# కృష్ణకాంత్

(కృష్ణకాంతుని మరణశాసనం)

బంకించంద్ర చట్టోపాధ్యాయ్





వెరైటీ ఏజన్సీస్‌వారి

## అరుణ ప్రచురణలు

గవర్నరుపేట, బెజవాడ.

౨

అరుణ ప్రచురణలు.
సంపాదకుడు,
కంభంమెట్టు సత్యనారాయణరావు.

ప్రథమముద్రణ
1947

అనువాదం
" శ్రీ సూరి "

ప్రతి వెల
1-8-0

Q. H. K. 58
కాపీలు 1000

కిసాన్ ప్రెస్,
బెజవాడ.

# ద్రాక్షారిష్ట

## రుచిని పుట్టించునట్టి పానీయము



బీడీలు, సిగరెట్లు కాల్చు దురలవాటులచే గాని, తన బలమునకు మించిన వ్యాయామము వలనగాని చెడిపోయిన గుండెలకు తగినబలము నిచ్చును. అరిగిపోయిన రొమ్ములకు కండపుష్టి కలుగజేయును. పొడి దగ్గు, నీరసము, ప్రాలుమాలిక, కడుపులో మంట, సమస్త దౌర్బల్యములు, శ్వాసకాస మొదలగు క్షయ చిహ్నములను, మలబంధము వీనిని హరించును. స్త్రీ బాల వృద్ధ గర్భిణులు స్వేచ్ఛగా సేవింపదగిన బలవర్ధక (టానిక్) ఔషధము.

**సాద్నామృతం డిపో, గవర్నరుపేట, బెజవాడ.**

# చ్యవనప్రాశము




## చైత్రామలకములతో తయారుచేయబడినది



చ్యవనప్రాశము రసాయనములలో అత్యుత్తమము. దగ్గు, ఎగవూపిరి, ఆయాసము తగ్గించును. క్షయరోగులకు అమృతతుల్యము. క్షీణించినవారికి బాలురకు, వృద్ధులకు చాల మంచిది. రక్తమునకు వృద్ధిని, శరీరమునకు పుష్టిని వీర్యమునకు దార్ఢ్యమును కలిగించును. హృద్రోగము, వాతరక్తము, దాహము. శుక్లదోషములు, మూత్రదోషములను పోగొట్టి, జ్ఞాపకశక్తిని కలిగించును.

**సారస్వామృతం డిపో, గవర్నరుపేట, బెజవాడ.**

# అశోకారిష్ట

## స్త్రీల గర్భరోగ

## నివారిణి

తెల్లకుసుమ, ఎర్రకుసుమ, గర్భకోశవ్యాధులు, నష్టసంతానము,  బహిష్టు సరిగ కాకపోవుట, మాసమునకు ముందుగాని, వెనుకగాని, హెచ్చుగను లేక తగ్గుగను బహిష్టు అగుట, బహిష్టుకాలమందు కలుగు శూల, కళ్ళనరములు లాగుట మొదలగు స్త్రీరోగములకు ప్రసిద్ధముగ సర్వత్ర వాడునట్టి ఉత్తమ ఔషధము. దీనిని అనేకమంది స్త్రీలు సేవించి సంతానమును బడసియున్నారు.

**సార్సామృతం డిపో,** గవర్నరుపేట, బెజవాడ.

అయోడైజ్డ్

# సార్వామృతము

రసాయనమిశ్రితము

---

శ్రేష్ఠమైన సుగంధపాల, పొటాసియమ్ అయోడైడ్,

రసాయనములతో తయారుచేయబడినది.

రక్తమును శుభ్రపరచుటలో వజ్రాయుధము.

ఈ సార్వామృతము చెడురక్తము శుభ్రపరచి పరిశుద్ధముగ చేయుటలో అమోఘమైనది. అతిమేహము వలనను రక్తము చెడుటవలనను కలుగు మేహవ్రణములు, నెత్తురుగడ్డలు, రాచకురుపులు, తీట, గజ్జి, దురద, తామర, కుష్టువ్యాధులును అరికాళ్లు అరిచేతులు మంటలు, గనేరియా, కొరుకుడు, (సవాయిమేహము) వాతరక్తము మొదలగు వ్యాధులను రూఢిగా పోగొట్టును.

సార్వామృతం డిపో, గవర్నరుపేట, బెజవాడ.

# కృష్ణకాంత్

హరిద్రాపురంలో ఉన్న జమీందారు పేరు కృష్ణకాంతరాయి. ఆయన చాలా ధనవంతుడు. ఆయనకు జమీందారీమీద వచ్చే ఆదాయిమే ఇంచుమించు రెండు లక్షలు ఉంటుంది. ఈ ఆస్తి అంతా ఆయనా ఆయన తమ్ముడు రమాకాంతరాయీ సంపాదించినదే. ఇద్దరూ కలిసి ఉండే సంపాదించారు. ఇద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండేవాళ్ళు. ఒకర్ని ఒకరు మోసగిస్తారేమో అన్న సందేహం ఇద్దరికీ ఉండేదికాదు. జమీందారీ యావత్తూ పెద్దవాడైన కృష్ణకాంత రాయిపేరనే కొన్నారు. రమాకాంత రాయికి ఒక కొడుకు పుట్టాడు అతడి పేరు గోవిందలాల్ కొడుకు పుట్టిన దగ్గిర్నుంచీ మాత్రం రమాకాంత రాయికి మనస్సులో ఒక సంకల్పం కలిగింది ఇద్దరం సంపాదించిన ఆస్తి ఒకరి పేరనే ఉండే కుమారుడి శ్రేయస్సుకోసం కాస్త రాతకోతలు చేసుకుంటే మంచిది కదా-అని....ఎందుకు కలగకూడదూ ?....కృష్ణకాంత ఎన్నడూ తనకు అన్యాయం చెయ్యడని నమ్మకం ఉంది? కాని ఆయన చనిపోయ్యింతర్వాత ఆయన కుమారులు ఏం చేస్తారో. దానికి నిర్ధారణ ఏముంది? కాని ఆ రాతకోతల విషయం మామూలుగా పైకి చెప్పలేక పోయాడు. ఇవాళ చెబుదాం? అని జాప్యం చేయసాగాడు. ఒకసారి ఏదో పని ఉండి తాలూకా గ్రామానికి వెళ్లి అకస్మాత్తుగా అక్కడే చనిపోయాడు.

కృష్ణకాంత్ ఒకవేళ తమ్ముడి కుమారుణ్ణి అన్యాయం చేసి, ఆస్తి అంతా తానే అనుభవిద్దామని అనుకున్నా, అనుభవించినా ఇప్పుడెలాంటి అంతరాయమూలేదు. కాని అతడికి ఇలాంటి దుర్బుద్ధి కలగ లేదు. అతడు గోవిందలాల్‌ను తన పిల్లలతో పాటు సమానమైన ఆపేక్షతో పెంచసాగాడు. తన ఆస్తిలో న్యాయతః రమాకాంత్ రాయికి రావలసిన సగభాగమూ గోవిందలాల్‌కు ఇచ్చేట్లు వీలునామా రాయాలని కూడా సంకల్పించుకున్నాడు.

కృష్ణకాంత్ రాయికి ఇద్దరు కుమారులు, ఒక కూతురూ. పెద్ద కొడుకు పేరు హరలాల్, రెండోవాడి పేరు వినోదలాల్. కూతురు పేరు శైలవతి. కృష్ణకాంత్ తాను చనిపోయాక ఆస్తిలో ఎనిమిది అణాలవంతు గోవిందలాల్‌కూ, హరలాల్, వినోదలాల్ లకు ప్రత్యేకం మూడేసి అణాలవంతు పోగా మిగిలిన రెండణాలలో ఒక వంతు భార్యకీ, మరోవంతు కూతురుకూ చెందాలని వ్రాశాడు.

హరలాల్ చాలా దుర్దాంతుడు. తండ్రి చెప్పినమాట వినేరకం కాదు-దురాలోచనపరుడు కూడా. ఆ వీలునామా విషయం ఆయన గోప్యంగా ఉంచలేదు, అందుచేత అది హరలాల్ తెలుసుకున్నాడు. హరలాల్ చూసి చూసి, కోపంతో కళ్లెర్రచేసుకుని "ఇదేమిటి? గోవిందలాల్‌కు సగభాగమూ, మాకు మూడణాల భాగమూనా?'' అని అడిగాడు తండ్రిని. "ఇదే న్యాయం. గోవిందలాల్ తండ్రికి రావలసిన సగభాగమూ వాడి కిచ్చేశాను.'' అన్నాడు. కృష్ణకాంత్

"గోవిందలాల్ తండ్రికి రావలసిందేమిటి? మా పిత్రార్జితం తీసుకోటానికి వాడెవ్వరు? అమ్మనూ, చెల్లెలినీ మేమే పోషిస్తాం-వాళ్ళ కింకా ఆ వాటా లెందుకు? వాళ్ళకి తిండికీ, బట్టకీ మాత్రం అధికారం ఉంటుందని వ్రాస్తే చాలు.''

కృష్ణకాంత్ కొంచెం కోపం తెచ్చుకొని, "ఒరేయ్ హరలాల్! ఆస్తినాది కాని, నీది కాదు. నా కెవరి మీద ఇష్టమయితే వాళ్ళ కిచ్చి పోతాను'' అన్నాడు.

"మీకు బుద్ధి కొంచెం భ్రమించి లోపించింది. మీ ఇష్టం వచ్చినట్లు చెయ్యనియ్యను''

కృష్ణకాంత్ క్రోధంతో గుడ్లెర్రజేసి, "హరలాల్! నువ్వు చిన్న పిల్లవాడివైనట్లయితే ఇవాళ పంతుల్ని పిలిపించి కొట్టించేవాణ్ణి నిన్ను'' అన్నాడు. "నేను చిన్నప్పుడు గురువుగారి పిలక ఊడకొట్టాను. ఇప్పుడు ఈ వీలునామా కూడా అలాగే చించేస్తాను'' అన్నాడు హరిలాల్.

కృష్ణకాంత్‌రాయ్ ఇంక మరోమాట మాట్లాడలేదు. ఆ వీలునామా తన చేతులమీదుగానే చించేసి, దానికి బదులు మరో వీలునామా వ్రాయించాడు. దాన్నిబట్టి గోవిందలాల్‌కు ఎనిమిదణాలూ, వినోదలాల్‌కు

అయిదణాలూ, భార్యకు ఒక అణా, శైలవతికి ఒక అణా, హరలాల్‌కు ఒక అణా వంతున వస్తుంది ఆస్తి.

కోపంవచ్చి హరలాల్ ఇల్లు వదిలి కలకత్తా వెళ్ళిపోయాడు. అక్కడినుంచి తండ్రికి ఓ పుత్తరం రాశాడు. "కలకత్తా పండితులంతా విధవావివాహం శాస్త్రసమ్మతమేనని అంగీకరించారు. నేనుకూడా విధవా వివాహం చేసుకుందామని అనుకున్నాను. మీరు ఆ వీలునామా మార్చి నాకుకూడా ఎనిమిదణాల భాగం వచ్చేట్లు మరో వీలునామా రాసి, దాన్ని వెంటనే రిజిష్టర్ చేయించేట్లయితే నేను ఈ ఉద్దేశ్యాన్ని వదులుకుంటాను. లేకపోతే త్వరలోనే ఒక వితంతువుని చూచి పెళ్ళి చేసుకుంటాను.''

ఇదీ ఆ ఉత్తరంలోని సారాంశం.

కృష్ణకాంత్ ఆ ఉత్తరంచూచి భయపడి, వీలునామా మార్పు చేయించి తనకే ఎక్కువ ఆస్తి రాసిఇస్తాడని అనుకున్నాడు హరలాల్. కాని కృష్ణకాంత్ రాసిన జవాబుమీద అతడికి భరోసా లేకపోయింది.

"నువ్వు త్యజింపబడ్డ పుత్రుడివి నాకు. నీకు ఎవరు ఇష్టమయితే వారినే పెళ్ళిచేసుకో. నాకెవరు ఇష్టమయితే వారికే ఇస్తాను ఆస్తి. నువ్వు ఈ వివాహం చేసుకుంటే నేను వీలు మార్పిస్తా నిజమే. కాని దాని వల్ల నీకు కీడుతప్ప మేలు కలుగదు'' అని రాశాడు కృష్ణకాంత్.

ఆతర్వాత కొద్ది రోజులకే హరలాల్ తాను విధవావివాహం చేసుకున్నట్లు కబురు చేశాడు. కృష్ణకాంత్ మళ్ళీవీలునామా చించేశాడు. కొత్తది రాయాలి.

ఆ ఊళ్ళో బ్రహ్మానందఘోష్ అనే నిరహంకారియైన పెద్దమనిషి ఒకాయన ఉన్నాడు. అయన కృష్ణకాంత్‌ని పెదబాబూ అని పిలుస్తూ ఉంటాడు. ఆయన అనుగ్రహానికి పాత్రుడై పోషింపబడుతున్నాడుకూడా.

బ్రహ్మానంద్ దస్తూరీ చాలా మంచిది. ఇలాంటి వ్రాతపనులన్నీ అతడిద్వారానే జరుగుతుంటాయి. కృష్ణకాంత్ ఆరోజునే బ్రహ్మానందాన్ని పిలిపించి, "భోజనమయింతర్వాత ఇక్కడకు ఓసారి రా కొత్త వీలునామా రాయాలి'' అని చెప్పాడు.

వినోదలాల్ అప్పుడు అక్కడే వున్నాడు. "మళ్ళీ వీలునామా మార్పించటం ఏఉద్దేశ్యంతో?'' అని అడిగాడు అతడు.

"ఈసారి నీ అన్నకు భాగం శూన్యమవుతుంది" అన్నాడు కృష్ణకాంత్.

"అది మంచిదికాదు. అతడు అపరాధే. కాని ఆతడికి ఒక కొడుకు ఉన్నాడు. వాడు పసివాడూ నిరపరాధీ. వాడిగతి ఏమవుతుంది?"

"వాడికో కానీవంతు రాసియిస్తాను"

"ఒక్క కానీవంతు రాసియిస్తే ఏమవుతుంది?"

"నా అదాయం రెండులక్షల రూపాయలు వాడికో కానీ వంతు రాస్తే ఇంచుమించు మూడువేల రూపాయలు వస్తుంది. దానివల్ల ఒక గృహస్తుకు తిండికీ బట్టకీ సునాయాసంగా గడిచిపోతుంది. అంతకంటె ఎక్కువ ఇవ్వను" అన్నాడు కృష్ణకాంత్. వినోదలాల్ ఎంతో నచ్చచెప్ప టానికి ప్రయత్నించాడు. కాని తండ్రి ఎంత చూసినా ఆ అభిప్రాయం మార్చుకోలేదు.

---

## 2

బ్రహ్మానందం స్నాన భోజనాదులు ముగించుకుని పడుకుందా మనే ప్రయత్నంలో ఉన్నాడు. ఆ సమయంలో హరలాల్ వచ్చివుండటం చూసి విస్మితుడైనాడు. హరలాల్ దగ్గరకు వచ్చి అతడి తలాపిదిక్కున కూర్చున్నాడు.

"ఇదేమిటి? పెద్దఅబ్బాయా? ఎప్పుడు వచ్చావ్ ఇంటికి?"

"ఇంటికి ఇంకా వెళ్లలేదసలు"

"సరాసరి ఇక్కడికే వచ్చావా? కలకత్తానుంచి వచ్చి ఎంతసేపు ఆయింది?

"కలకత్తానుంచి రెండురోజులక్రితమే వచ్చాను. ఈ రెండు రోజులూ ఎక్కడో రహస్యంగా ఉన్నా మళ్లీ కొత్త వీలునామా రాస్తారుటగా?"

"అవును ఆలాగనే విన్నా"

"నాకు భాగం శూన్యం ఈసారి"

"బాబుగారు ఏదో కోపం వచ్చి అన్నమాట అది. ఆమాట నిలుస్తుందా?"

"ఇవాళ సాయంత్రం రాస్తారటగా? నువ్వేగా రాసేది?"

"ఏంచెయ్యను భాయీ, బాబుగారు చెప్పినపని కాదనలేను"

"మంచిదే. అందులో నీ తప్పేముంది? ఇప్పుడు కొంచెం డబ్బు తీసుకుని వ్రాసిపెడతావా? వెయ్యిరూపాయలు ఇస్తాను"

"విధవావివాహ చేసుకోమనా?"

"ఊఁ అందుకే"

"నాకెందికులెద్దూ, పెద్దవాడనైనాను"

"అయినా ఒక పని చెబుతా విను. ఇప్పుడే మొదలెట్టాలి అది. ముందు కొంచెం తీసుకో."

అని బ్రహ్మానందఘోష్ చేతికి హరలాల్ అయిదుపందల రూపాయల నోటు యిచ్చాడు.

బ్రహ్మానందం నోటు తీసుకుని అటు ఇటు తిప్పి చూసి, "ఇది తీసుకుని ఏం చెయ్యను నేను?"

"దగ్గిర ఉంచుకో. పది రూపాయలు మీ నౌకరుకు ఇయ్యి"

"నౌకర్లూ చాకర్లూ ఎవరూ లేరులే కాని ఏం చెయ్యాలి నేను?"

"రెండు కలాలు తయారు చెయ్యి. రెండూ సరీగ్గా ఒకే రకంగా ఉండాలి.

"సరే భాయీ! నువ్వు ఎలా చెబితే అలా చేస్తా"

అని ఘోష్ మహాశయుడు రెండు కొత్త కలాలు తీసుకువచ్చి. రెండూ ఒకే రకంగా ఉంటాయో ఉండవో అని రాసి చూశాడు.

"వీటిల్లో ఒక కలం పెట్టెలో అట్టేపెట్టు. వీలునామా వ్రాయటానికి వెళ్ళేటప్పుడు ఈ కలం తీసుకువెళ్ళి దీనితో రాయి. రెండో కలంతో ఇప్పు డొకటి రాయాలి. నీ దగ్గిర మంచి సిరా ఉందా? అన్నాడు హరలాల్.

బ్రహ్మానందం సిరాబుడ్డి తీసుకువచ్చి రాసి చూపించాడు........

"బాగుంది. ఈ సిరాయే వీలునామా రాయటానికి తీసుకువెళ్ళు."

"మీ యింట్లో కలం సిరాబుడ్డీ లేమా? నేను ఇక్కడ నుంచి వీటిని తీసుకు పోవాలా?"

"నాకో ఉద్దేశ్యం ఉంది-లేకపోతే నీకు ఇన్ని రూపాయలు ఎందికిస్తాను?"

"నిజమే. నేనూ అదే ఆలోచించా మంచిమాట చెప్పావు తమ్ముడూ!"

అని హరిలాల్, రెండు జసరల్ లెటర్ హెడ్స్ కాగితాలు బ్రహ్మా నందు చేతికిచ్చాడు. "ఇవి గవర్నమెంటు కాగితాలులా ఉన్నాయే" అన్నాడు బ్రహ్మానందం;

"గవర్నమెంటు కాగితాలు కావు-కాని ప్లీడర్ల ఇళ్లల్లో రాయటా నికి ఉండే కాగితాలు ఇవే. నాన్నగారు కూడా ఈ కాగితాలమీదే రాయి స్తారని విన్నా. అంచేత ఈ కాగితాలు సంగ్రహించి తీసుకువచ్చాను. నేను ఏది చెబితే అది అంతా ఈ కలంతో ఇందులో రాయి."

బ్రహ్మానందు వ్రాయటం మొదలెట్టాడు. హరిలాల్ ఒక వీలు నామా రాయించాడు, దాని సారాంశం యిది. కృష్ణకాంతరాయి వీలు నామా రాశాడు. అతడి పేరన ఉన్న ఆస్తి అంతా అతడు చనిపోయిం తర్వాత ఇలా సంక్రమిస్తుంది. ఎలాగంటే వినోదలాల్‌కు మూడణాల వంతూ, గోవిందలాల్‌కు ఒక కానీ భాగం, భార్యకు ఒక కానీ భాగం, శైలవతికి ఒక కానీ భాగం, హరిలాల్ పుత్రుడికి ఒక కానీ భాగం, హరిలాల్ జ్యేష్టపుత్రుడు కనుక మిగిలిన పన్నెండణాలభాగమూ అతడిది.

రాయటం పూర్తి అయాక-"రాయటం అయితే పూర్తి అయింది. కాని దస్కతు ఎవరు చేస్తారు?" అన్నాడు బ్రహ్మానందం.

"నేను" అని హరిలాల్ ఈ వీలునామా మీద కృష్ణకాంత్ రాయి సంతకమూ, నలుగురి సాక్ష్య సంతకాలూ చేసి యిచ్చాడు. "బాగుంది. కాని ఇది ఫోర్జరీ అవుతుంది" అన్నాడు బ్రహ్మానంద్.

"ఇదే నిజమైన వీలునామా అవుతుంది. సాయంకాలం రాయ బోయేదే ఫోర్జరీవిల్లు అవుతుంది"

"ఎందుకని?"

"నువ్వు వీలునామా రాయటానికి వెళ్ళేప్పుడు-ఈ వీలునామా చొక్కాజేబులో దాచుకుని వెళ్ళు. అక్కడకు వెళ్ళాక ఈ కలం, ఈ సిరాతోనే ఆయన చెప్పినట్లు రాయి వీలునామా. కాగితమూ, కలమూ, సిరా, దస్తూరీ అన్నీ ఒకలాగానే ఉంటాయి. తర్వాత వీలు చదివి విని

పించాక దస్కతు అయిపోయింతర్వాత చివరకు నువ్వు దస్తూరి ఫలానా అనిపెయ్యటానికి తీసుకుంటావుగా! అటూ ఇటూ చూసి దస్తూరీ వేసే టప్పుడు వీలునామాలు రెండూ మార్చేసి! ఈ వీలునామా ఆయనకిచ్చి, ఆయన రాయించిన వీలునామా తీసుకువచ్చి నాకియ్యి'' అన్నాడు హరలాల్.

బ్రహ్మానందఘోష్ ఆలోచించసాగాడు. "చెప్పగానే సరా?— బుర్ర ఉపయోగించి ఆలోచించటం మంచిది'' అన్నాడు.

"ఇచ్ఛ అయితే కలుగుతోంది నిజమే - కాని భయంవేస్తోంది. నీడబ్బు నీకు తిరిగి ఇచ్చివేస్తాను, కాని నేను ఈ వలలో పడను''

"డబ్బు ఇయ్యి'' అని హరలాల్ చెయ్యి చాపాడు. బ్రహ్మానంద ఘోష్ ఆ తీసుకున్న నోటు తిరిగి ఇచ్చివేశాడు. అది తీసుకుని హరలాల్ లేచి వెళ్ళబోతున్నాడు. బ్రహ్మానంద్ మళ్ళీ అతన్ని వెనక్కి పిలచి, "నువ్వు ఇప్పుడు అయిదువందలు ఇచ్చావు. ఇంకెంత ఇస్తావ్?' అని అడిగాడు. "నువ్వు ఆ వీలునామా తీసుకువచ్చి ఇస్తే మరో అయిదు వందలు ఇస్తాను.'' బోలెడంతడబ్బు!—ఆశ వదులుకోలేను "అయితే నువ్వు ఒప్పుకున్నట్లేనా?''

"ఒప్పుకోక ఏ చేస్తాను-మరి? కానీ మార్చటం ఎలాగా అని, చూస్తారేమో ఒకవేళ-!''

"ఎందుకు చూస్తారు? నేను నీ ఎదుట వీలునామా మార్చి తీసు కుంటాను. నువ్వు చూస్తూ ఉండు. ఎలా తీసుకుంటానో నీకూ తెలు స్తుంది ఆ కిటుకు'' అన్నాడు హరలాల్.

హరలాల్‌కు ఏ విద్య ఉండనీ, ఏ విద్య లేకపోనీ 'హస్తలాఘవ' మనే విద్యమాత్రం ఉంది. అతడు ఆ వీలునామా జేబులో పెట్టుకొని మరో కాయితం తీసుకొని ఏదో వ్రాయటానికి ఉపక్రమించాడు. ఈ లోపుగా చేతులో కాయితం జేబులోకి, జేబులో కాయితం చేతులోకి ఎలా రప్పించాడో బ్రహ్మానంద్ ఏమాత్రం కనిపెట్టలేకపోయాడు. అతను హరలాల్ చాతుర్యాన్ని ఎంతో ప్రశంసించాడు.

"ఈ కౌశలాన్ని నీకుకూడా నేర్పుతాను' అని హరలాల్ తన విద్యను బ్రహ్మానందునికి నేర్పసాగాడు. రెండు మూడు ఘడియలలోపలే బ్రహ్మానంద్ ఆ కిటుకు తెలుసుకున్నాడు. అప్పుడు హరలాల్ "నేను

ఇప్పుడే వెళ్తున్నాను. సాయంకాలం మిగతా డబ్బు తీసుకొనివస్తాను" అని చెప్పి వెళ్ళిపోయాడు.

హరలాల్ వెళ్ళిపోయిన తర్వాత బ్రహ్మానంద్‌కి విపరీతమైన భయం పుట్టింది. తాను ఏ పనికైతే ఒప్పుకున్నాడో అది ఎంతో శిక్షార్హమైన అపరాధమని తెలుసుకున్నాడు. తాను ఈ పనిచేస్తే యావజ్జీవం ఖైదులో ఉండవల్సొస్తుందేమో! ఈ వీలునామాలు మార్చేటప్పుడు ఒకవేళ ఎవరైనా చూస్తారేమో! అలా అయితే ఈ కార్యాన్ని సాధించటమేలా? సాధించకపోతే చేతులోపడ్డ వెయ్యి రూపాయలూ వొదులుకో వలసి వస్తుంది. అది ఎలా కుదురుతుంది...ప్రాణం పోతేమట్టుకు! ఆహా! ఎంతో దరిద్ర బ్రాహ్మణునికి నువు చాలా బాధకలిగించావు? ఒక వైపున ప్లీహ వ్యాధితో బాధపడుతుంటే ఆపైన ఫలాహారం తటస్థించింది! పళ్ళెం నిండా రసగుల్లాలు, జిలేబీలు, సీతాఫలాలు మొదలైనవన్నీ తీసుకొచ్చి, ఎదురుగా పెడితే దరిద్ర బ్రాహ్మడు ఏం చేస్తాడు? వదిలేస్తాడో, స్వీకరిస్తాడా? బ్రాహ్మణుడైనవాడు వెయ్యి సంవత్సరాలు ఆ పళ్ళెం ముందర కూర్చొని ఎంత మీమాంస పడ్డా ఆ పదార్థాలను అమాంతం మింగేస్తాడని నేను ఘట్టిగా చెప్పగలను.

బ్రహ్మానందఘోష్ విషయంలో కూడ సరిగ్గా అలాగే జరిగింది. హరలాల్ ఇస్తానన్న డబ్బుసంతా హరియించుకోవాలసిన భారమూ ఉంది అతనిమీద. జైలు వెళ్ళాల్సొస్తుందేమోనని భయమూ ఉంది. కాని డబ్బునుమాత్రం వొదులుకోలేకపోయ్యాడు. లోభం గొప్పదో? హరాయించుకోలేని అజీర్తి గొప్పదో బ్రహ్మానంద్ తేల్చుకోలేకపోయ్యాడు. దాన్ని గురించి ఇంక అట్టే మీమాంస పెట్టుకోకుండా, దాన్ని చటుక్కున మింగడానికే నిశ్చయించుకొన్నాడు.

---

# 3

సాయంకాలం బ్రహ్మానంద్ వీలునామా వ్రాసి ఇంటికి తిరిగి వచ్చాడు. హరలాల్ అప్పటికే వచ్చి కూర్చున్నాడు. "ఏం జరిగిందీ?" అని ప్రశ్నించాడు.

బ్రహ్మానంద్ కొంచెం కవితా ప్రియుడు. అతను బలవంతంగా నవ్వుతెచ్చుకొని "చంద్రుణ్ణి పట్టుకుందామని చేతులు చాచాను. ఆ చేతులు తుమ్మచెట్టు మీద పడి ముళ్ళు గుచ్చుకున్నై." అన్నాడు.

"చేయలేక పోయినావా ఏమిటి?"

"ఏదో కష్టం వెయ్యసాగింది భాయీ!"

"చెయ్యలేవా?"

"చెయ్యలేను భాయీ!—నీ ఫోర్జరీ విల్లు, నీ డబ్బు తీసుకో" అని బ్రహ్మానందం పెట్టెలోనుంచి ఆ నకలు వీలునామా, అయిదువందల రూపాయల నోటు తీసి ఇచ్చాడు. కోపంతోను, విరక్తితోనూ హరలాల్ కళ్ళు రెండూ ఎర్రపడ్డాయి. పెదవులు కంపించినాయి — మూర్ఖుడా! అకర్మణ్యుడా! ఆడవాళ్ళు చేయకలిగిన పనికూడా నీవల్ల కాదు. నేను వెడుతున్నా, కాని చూడు. ఈ విషయం నీవల్ల ఏమాత్రం బయటపడ్డా, నీ బ్రతుకు సంశయాస్పదమవుతుంది—అన్నాడు.

"ఆ సందేహం పెట్టుకోవద్దు, నానుంచి ఏమాటా బయటపడదు"

అక్కడనుంచి లేచి హరలాల్ బ్రహ్మానందుని వంటఇంట్లోకి వెళ్ళాడు. హరలాల్ ఆ ఇంట్లో పిల్లవాడిలాంటివాడు, ఇంట్లోకి ఎక్కడికి వెళ్ళాలన్నా అతడికేం అభ్యంతరం లేదు. అక్కడ బ్రహ్మానందుని అన్నకూతురు రోహిణి వంటచేస్తోంది.

ఆ రోహిణీతో మనకు చాలా అవసరం ఉంది. అంచేత ఆమె రూపాన్ని గురించీ, గుణాల్ని గురించీ కొంచెం చెప్పాలి. రోహిణి సంపూర్ణ యౌవనవతి. పదహారు కళలతో మిడిసిపడే చంద్రుడిలాగా ఆమెలో అందం తొణికిసలాడుతూ ఉంటుంది ఆమె చిన్నప్పుడే విధవ అయింది. కాని వైధవ్యానికి అనుపయుక్తములైన ఎన్నో దోషా లున్నాయి ఆమెలో. నల్లటి అంచు చీరెలు కడుతుంది. గాజులు తొడు

కున్నంటుంది. తాంబూలంకూడా వేసుకుంటుందన్లే ఉంది, ఇహ వంట విషయంలో సిద్ధ హస్తురాలు. అలంకరణలోకాని, అందమైన నగలు ధరించటంలో కాని, పూలతోటల్లో విహరించటంలోకాని, ఆమెకు ఎవ్వరూ సాటిరారు, జడలు వేయటంలో - ఆడపిల్లలకు ముస్తాబు చేయటంలో ఊళ్ళో ఆమె ఒక్కతే ఆధారం. ఆమెకింక ఎవరూ ఆధారం లేకపోవటంవల్ల బ్రహ్మానందుని ఇంట్లోనే ఉంటోంది.

రోహిణి లోపల పప్పు వండుతోంది. దూరంగా ఒక పిల్లి కూర్చునిఉంది, పశుజాతి ఆడవాళ్ళ విద్యుత్కటాక్షాలకు వణికిపోతుందో లేదో చూద్దామనికాబోలు రోహిణి దానిమీద మధ్య మధ్య విషపూర్ణమైన మధుర కటాక్షాలను ప్రసరింపచేస్తోంది. మధురమైన ఆమె చూపు ఆమె తయారుచేసిన ఆహారానికి ఆహ్వానంగా భావించి ఆ పిల్లి కొంచెం ముందుకు వస్తోంది మెల్లగా. సరీగ్గా ఈ సమయంలో హరలాల్‌బాబు టకటక బూట్లు చప్పుడు చేసుకుంటూ లోపలికి వచ్చాడు. ఆ పిల్లి భయపడి ఆహారంమీద ఆశ వదులుకుని పారిపోయే ప్రయత్నంలో ఉంది. ఈ రోహిణి పొయ్యిమీద ఉన్న గిన్నె దింపి, చేతులు కడుక్కుని, తల మీద ముసుగు ముందరకు లాక్కుని లేచి నిలబడింది. "పెదబాబుగారా? ఎప్పుడు వచ్చారు?" అని అడిగింది గోళ్ళు గిల్లుకుంటూ,

"నిన్న వచ్చాను. నీతో ఒకమాట ఉంది." అన్నాడు హరలాల్.

"ఇవాళ ఇక్కడే భోజనం చేస్తారా? అన్నానికి సన్నబియ్యపు గిన్నె ఎక్కించనా?"

"ఎక్కించు. కాని ఆ సంగతి కాదు. నీకు ఒకనాటి సంగతి జ్ఞాపకముందా?"

రోహిణి మెదలకుండా నేలచూపులు చూడసాగింది. "ఆరోజు నువ్వు గంగాస్నానం చేసివస్తూ, యాత్రికుల గుంపువదిలి వెనకపడ్డావే - ఆరోజు - జ్ఞాపకం వచ్చిందా?" అన్నాడు హరలాల్.

రోహిణి ఎడంచేతిని ఉన్న ఉంగరాలు నాలుగూ కుడిచేతిని పెట్టుకుంటూ "జ్ఞాపకం ఉంది" అన్నది.

"ఆరోజున నువ్వు దారితప్పి మైదానంలో పడ్డావు. జ్ఞాపకం ఉందా?"

"ఉంది"

"ఆరోజున అక్కడే ప్రొద్దుకూకింది. నువ్వు ఒంటరిదానివి. కొంత మంది పోకిరీవాళ్ళు నిన్ను తమవెంట తీసుకెళ్లారు. జ్ఞాపకముందా?"

"ఉంది"

"ఆరోజున నిన్ను ఎవరు రక్షించారు?"

"మీరు-మీరు గుఱ్ఱమెక్కి ఆమైదానంలోనుంచే ఎక్కడకో వెడుతున్నారు—

"మావదినగారింటికి"

"మీరుచూడగానే నన్ను రక్షించి—నన్ను పల్లకీఎక్కించి ఇంటికి పంపించారు. జ్ఞాపకం రాకపోవట మేమిటి? నేను ఆఋణం ఎన్నటికీ తీర్చుకోలేను"

"ఇవాళ ఆఋణం తీర్చుకోగలవు—పైగా నన్ను జన్మంతాశ్రిత దాసుణ్ణిగా చేసుకోగలవు, అవునా?"

"ఏమిటో చెప్పండి—నేను ప్రాణాన్ని యిచ్చిఅయినా సరే మీకు ఉపకారం చేస్తాను"

"చెయ్యి చెయ్యకపో ఈ సంగతి మాత్రం ఎక్కడా బైటపెట్ట కూడదు"

"ప్రాణముండగా బైటపెట్టను"

"ఒట్టువేసుకో"

రోహిణి అలాగే ఒట్టు వేసుకుంది.

అప్పుడు హరలాల్ కృష్ణకాంతుని అసలు వీలునామా-దొంగ వీలునామాల సంగతి తెలియచెప్పాడు. చివరకు—ఆ అసలువీలు దొంగిలించి, ఈ దొంగవీలు అక్కడ పెట్టిరావాలి. మా ఇంట్లో నీరాకపోకల కేం అభ్యంతరంలేదు. నువ్వు తెలివైన దానివి, సులభంగా చెయ్యగలవు. నాకోసం ఈపని చేస్తావా? అని అడిగాడు.

రోహిణి వణికిపోతూ - దొంగతనమా? నన్ను తెగ్గోసినా చెయ్యలేను ఆపని—అంది.

"ఆడవాళ్లు ఇంతే ఒఠ్ఠి అబలలు—మాటలు చెప్పటానికే! అయితే నువ్వు నాఋణం ఈజన్మలో తీర్చుకో లేవు అనుకుంటా"

"ఇంకేది చెప్పినా చేస్తా, చావమన్నా చస్తా, కాని యీ విశ్వాస ఘాతకమైన పనిమాత్రం చెయ్యలేను,"

రోహిణి ఏ మాత్రం అంగీకరించకపోవటం చూసి, హరలాల్ ఆ వెయ్యిరూపాయలనోటు రోహిణి చేతికిస్తూ "యీవెయ్యిరూపాయల బహుమానం ముందు తీసుకో. ఈపని నువ్వు చేసితీరాలి'' అన్నాడు.

రోహిణి నోటు తీసుకోలా "నాకు డబ్బుమీద ఆశ ఏంలేదు. బాబుగారి ఆస్తి అంతా ఇచ్చినా చెయ్యలేను. చేసేదాన్ని అయితే మీ మాటకే చేసేదాన్ని'' అంది. హరలాల్ దీర్ఘంగా నిట్టూర్చి "నువ్వునాకు హితైషిణివనీ, పరాయిదానివి ఎన్నడు కాదనీ అనుకున్నాను రోహిణీ! చూడు ఇప్పుడు నాభార్యే ఉన్నట్లయితే నిన్ను బ్రతిమాలేవాణ్ణికాదు. ఆమే చేసేది ఈపని'' అన్నాడు.

ఈసారి రోహిణి కొంచెం నవ్వింది. "నవ్వుతావెందుకు?'' అని అడిగాడు హరలాల్.

"మీ భార్యమాట ఎత్తేసరికి ఆ విధవావివాహం సంగతి జ్ఞాపకం వచ్చింది. మీరు విధవావివాహం చేసుకుంటారటగా?''

"ఇచ్ఛ అయితే ఉంది - కాని మనస్సుకు నచ్చిన విధవ ఎక్కడ దొరుకుతుంది?''

"విధవకానీ, సధవకానీ, పెళ్లి చేసుకుని సంసారిఅవటం మంచిది. మా ఆత్మీయులంతా అలా చేస్తే చాలా సంతోషిస్తారు''

"చూడు రోహిణీ! విధవావివాహం శాస్త్రసమ్మతం''

"అమాటే అంటున్నారు ఇప్పుడంతా''

"చూడు, నువ్వుకూడా వివాహ చేసుకోవచ్చు — ఎందుకు చేసుకోవు?''

రోహిణి తలమీద ముసుగు కొంచెం ముందుకు లాక్కుని ముఖం ప్రక్కకు తిప్పుకుంది. "చూడు-మీతోమాకు దూరపు బంధుత్వం కూడా ఉంది—'' అని చెప్పసాగాడు హరలాల్.

ఈసారి రోహిణి తలమీది చెంగు ముందరికి పేళ్ళాదేసుకుని, పొయ్యికెదురుగా కూర్చుని వంటపని చేసుకోసాగింది. హరలాల్ అది చూసి విషణ్ణుడై వెనక్కి తిరిగాడు.

హరలాల్ గుమ్మందాకా వెళ్లాడు. "ఆ కాగితాలు ఇక్కడ పెట్టి వెళ్ళండి. చెయ్యగలనేమో చూస్తాను'' అంది రోహిణి.

హరలాల్ సంతోషంతో ఆ దొంగ వీలునామా వెయ్యి రూపాయల నోటు రోహిణిదగ్గర పెట్టాడు. అది చూసి, "నోటువద్దు వీలునామా మాత్రమే ఇవ్వండి'' అన్నది రోహిణి.

హరలాల్ వీలుమాత్రం అక్కడ ఉంచి నోటు తీసుకుని వెళ్ళిపోయాడు.

---

## 4

ఇవాళ రాత్రి ఎనిమిది గంటలప్పుడు కృష్ణకాంత్‌రాయి తన పడక గదిలో మంచంమీద బాలీసుకు ఆనుకుని కూర్చుని, హుక్కా త్రాగుతున్నాడు—ప్రపంచంలో ఉన్న మత్తుపదార్థాలన్నిటిలోనూ ఉత్తమమైనది నల్లమందు. ఆనల్లమందు నిషాలోపడి తూగూతూ చేతిలోవున్న వీలునామాని వీలునామాకాదు—విక్రయపత్రం అని భావించుకున్నాడు కృష్ణకాంతరాయి. తన ఆస్తి అంతా హరలాల్ మూడు దుగ్గానులకు కొన్నట్లు తోచింది. అది వీలునామాకాదు, కొన్నట్లు యిచ్చిన రశీదు అని ఎవరో చెబుతున్నట్లు వినిపించింది. అంతట్లోనే మళ్ళీ బ్రహ్మకుమారుడు విష్ణుమూర్తి వృషభారూఢుడైన మహాదేవుని దగ్గరకువచ్చి ఒక పెట్టెడు నల్లమందు తీసుకొని, బ్రహ్మాండమంతా తాకట్టుపెట్టినట్లు కన్పించింది—మహాదేవుడు గంజాయి మత్తులో ఆపెట్టె మూతవెయ్యటం మరచిపోయాడు. అలాంటి సమయంలో రోహిణి మెల్లమెల్లగా గదిలోకి వచ్చి "పెదబాబుగారూ! నిద్దరోతున్నారా?'' అన్నది.

కృష్ణకాంత్ తూగుతూ తూగుతూ "ఎవరూ? నందా? మహాదేవునితో ఇప్పుడాపెట్టె మూసివెయ్యమని చెప్పు" అన్నాడు.

కృష్ణకాంతుడు నల్లమందు నిషాలోపడి కొట్టుకుంటున్నాడని రోహిణి గ్రహించింది. నవ్వుతూ "నంది ఎవరు బాబుగారూ?" అని అడిగింది.

కృష్ణకాంతుడు తలపైకి ఎత్తకుండానే "హుం-నిజంచెప్పావు. బృందావనంలో గొల్లఇళ్ళలో వెన్న అంతా మింగేశాడు—ఇవ్వాళ కూడా అతడికి ఒక్కపిసరయినా ఇవ్వాలా" అన్నాడు.

రోహిణి కిలకిల నవ్వసాగింది. అప్పుడు కృష్ణకాంతుకు కొంచెం మత్తువదలింది. తలఎత్తిచూచి, "ఎవరూ? అశ్వనీ. భరణీ. కృత్తికా, రోహిణీ?" అన్నాడు,

"మృగశిరా, ఆరుద్రా, పునర్వసూ, పుష్యమీ''—అని సమాధాన మిచ్చింది రోహిణి.

'ఆశ్లేషా, మఘా. పుబ్బా.'

'బాబుగారూ, నేనుమీదగ్గరకు జ్యోతిషం నేర్చుకోటానికి వచ్చానా'?

'అంతేగా! అయితే మరి ఏఉద్దేశ్యంతో? నల్లమందు అక్కర్లేదా?

"ఏ వస్తువయితే ప్రాణాలు ధారపోసినా ఇవ్వరో, దానికోసం వచ్చానా ఏంనేను! నన్ను బాబాయి పంపాడు అందుకోసంవచ్చా"

"అదే, అదే. అయితే నల్లమందు కోసమే"

"కాదు బాబుగారూ! కాదు. మీమీద ఒట్టు. నాకు నల్లమందు అక్కర్లా. ఇవాళ రాసినవీలునామామీద మీ దస్కత్ కాలేదని చెప్పాడు బాబాయి"

"అదేమిటి? నేను దస్కతు చేసినట్లు నాకు బాగా జ్ఞాపకంఉంది"

"లేదు మీరు అందులో దస్కతు పెట్టనట్లు బాబాయికేదో జ్ఞాపకం వచ్చింది. సరే సందేహమెందుకు? మీరు అదితీసి ఒకసారి చూడరాదూ?"

"నిజమే—అయితే దీపం పట్టుకో - చూస్తా''

అని కృష్ణకాంత్ లేచి బాలీసుక్రిందనుంచి ఒక తాళపుచెవి తీశాడు రోహిణి దగ్గిరలో ఉన్న దీపం చేతపట్టుకుంది కృష్ణకాంతుడు మొదట్లో ఒక చిన్న చేతిపెట్టె తెరచి, ఒక సొరుగు తీసి అందులో వెతికి వీలు నామా బైటికి తీశాడు. తర్వాత కేస్‌లోనుంచి కళ్ళజోడు తీసి పెట్టుకో బోతూంటే రెండు సార్లు మళ్లీ మత్తుతో కునికిపాట్లు వచ్చి తూగాడు. అంచేత కాస్త ఆలస్యమయింది. చివరకు జోడు సరీగ్గా పెట్టుకుని, కృష్ణకాంత్ వీలునామామీదికి దృష్టి పోనిచ్చి, "నేను ముసలివాడ్ని అయినాకనుక మతి మరుపువాడ్నికూడా అయినాననుకున్నావా రోహిణీ? ఇదిగో చూడు నా సంతకం'' అన్నాడు.

"అయ్యోరాతా! ముసిలివారెందుకవుతారు? మమ్మల్ని కేవలం బలవంతంగా మనుమరాళ్ళని మాత్రం పిలుస్తున్నారు. అయితే మంచిదే. ఇహ నేను వెడతాను — వెళ్ళి బాబాయితో చెప్పేస్తాను''

అని రోహిణి కృష్ణకాంతుని పడకగదిలోంచి వెళ్ళిపోయింది.

....    ....    ....    ....

అర్ధరాత్రి మంచి నిద్రలో ఉండగా కృష్ణకాంతుడికి అకస్మాత్తుగా నిద్రాభంగమయింది. కళ్లతెరిచి చూసేసరికి తన గదిలో దీపం వెలగటం లేదు. ఎప్పుడూ ప్రతి రాత్రీ దీపం వెలుగుతూ ఉండేది. కాని ఆరాత్రి మాత్రమే దీపం ఆరిపోవగా చూశాడు. నిద్రాభంగమయ్యేముందు తాళం చెవితో ఎవరో తాళం తిప్పుతున్నట్లు చప్పుడుకూడా వినిపించింది. ఎవరో గదిలో తిరుగుతున్నట్లుకూడా అనిపించింది. ఆ వ్యక్తి తన తలాపి దిక్కువరకూ కూడా వచ్చి, బాలీసుక్రింద చెయ్యికూడా పెట్టి నట్లుంది. కృష్ణకాంత్ నల్లమందు నిషాతో సగం నిద్దరోతూ సగం మెలు కువగానూ ఉండటంవల్ల బాగా గుర్తుపెట్టుకోలేకపోయాడు. గదిలో దీపంలేదన్న సంగతికూడా సరీగ్గా తెలుసుకోలా — కాసేపు సగంనిద్ర — మరికాస్సేపు సగం మెలకువ. మెలకువగాఉన్నా కళ్ళు తెరిపిడి పడటం లేదు. ఒకసారి దైవవశాత్తు కళ్ళు తెరిఛినిపడేసరికి అంతా అంధకారంగా కన్పించింది. కాని అప్పుడు కృష్ణకాంత్ హరిఘోష్ వ్యాజ్యంలో దొంగ రసీదు దాఖలుచెయ్యటంవల్ల జైలుకు వెళ్లినట్లు అనుకున్నాడు. జైలంతా అంధకారమయం. కాస్సేపటికి హటాత్తుగా తాళపుచెవి చప్పుడు కొంచెం చెవినిపడింది. ఇదేమిటి? జైలుకు తాళంపడిందా? చటుక్కున కొంచెం మత్తు వదిలింది. కృష్ణకాంత్ హుక్కాకోసం చెయ్యిచాచాడు — అది చేతికి అందలా, అలవాటుచొప్పున "హరీ!" అని పిలిచాడు

కృష్ణకాంత్ లోపల గదిలోనూ పడుకోడు. బైట గదిలోనూ పడుకోడు. ఈ రెండి టికీ మధ్య ఉన్న గదిలో పడుకుంటూఉంటాడు. అక్కడ హరి అనే నౌకరు ఒకడు అతడికి కాపలాగా పడుకుంటాడు. ఇ కెవరూ ఉండరు, కృష్ణకాంత్ అతడ్నే "హరీ!" అని పిలిచాడు.

కృష్ణకాంత్ ఒక్కసారిమాత్రం పిలిచి, మళ్ళీ నల్లమందుమత్తుతో తూగటం మొదలెట్టాడు, అసలు వీలునామా అతడి గదిలోంచి అప్పుడే అంతర్హితమయింది. దొంగ వీలునామా దానికి బదులుగా అక్కడ ఉంచబడింది.

---

# 5

మర్నాడు ఉదయం రోహిణి మళ్ళీ వంటచెయ్యటానికి కూర్చుంది. హరలాల్ వచ్చి తొంగిచూస్తున్నాడు లోపలికి. అదృష్టవశాత్తు బ్రహ్మానందఘోష్ ఇంట్లో లేడు — ఉంటే ఏమన్నా అనుకునేవాడేమో!

హరలాల్ మెల్లిగా రోహిణిదగ్గరకు వెళ్ళాడు — రోహిణి అతడికేసి సరీగ్గా చూడలేదు. "సరీగ్గా చూడవచ్చు; వంట పాడైపోదులే" అన్నాడు.

రోహిణి అతడికేసి చూసి నవ్వింది "ఏంచేశావు?" అని అడిగాడు హరలాల్.

రోహిణి తా నపహరించి తెచ్చిన వీలునామా హరలాల్‌కు చూడమని ఇచ్చింది. హరలాల్ చదివిచూశాడు, అసలు వీలునామాయే. అప్పుడా దుష్టుడింక నవ్వు పట్టలేకపోయాడు. వీలు చేత్తో పట్టుకుని "ఎలా తీసుకువచ్చావ్?" అని అడిగాడు.

రోహిణి ఆకథ చెప్పటం మొదలెట్టింది. అసలు సంగతి చెప్పకుండా ఏదోకల్పించి చెప్పసాగింది. చెబుతూ చెబుతూ ఆమె హరలాల్ చేతిలోని కాగితంతీసుకొని, ఆవీలునామా కాగితాల పెట్టెలో ఎలా మడతపెట్టి పడి ఉందో చూపించింది. వీలునామా దొంగిలించిన కథ చెప్పటం పూర్తికాగానే రోహిణి వీలునామా చేత్తోపుచ్చుకుని చటుక్కున లేచి వెళ్ళింది. మళ్ళీ తిరిగి వచ్చేసరికి చేతిలో వీలునామా లేకపోవటం చూచి, "అది ఎక్కడ పెట్టివచ్చావ్" అని అడిగాడు. "దాచిపెట్టి వచ్చాను" అంది రోహిణి,

"మళ్ళీ దాచివస్తే ఎలా? నేను ఇప్పుడే వెడతా"

"ఇప్పుడే వెడతారా? అంత హడావుడి ఎందుకు?"

"నాకు ఉండటానికి వీల్లేదు"

"అయితే వెళ్ళండి"

"వీలునామా"

"నాదగ్గిర ఉంటుందిలే"

"అది ఏమిటి? నాచేతికి యివ్వవా"

"మీదగ్గిరఉంటే ఎంతో, నాదగ్గిర ఉన్నా అంతే"

"నా చేతికి వీలునామా ఇవ్వకపోతే మరి దొంగిలించటం ఎందుకు ?"

"మీ కోసమే ఇక్కడ ఉంచటం కూడా మీ కోసమే."

"మీరు విధవివాహం చేసుకున్నప్పుడు మీ భార్య చేతికి ఇస్తాను ఇది మీరు అయితే తీసుకుని చింపేస్తారు"

హరలాల్ గ్రహించాడు." అలా కాదు రోహిణీ! ఎంతడబ్బైనా అడుగు ఇస్తాను'' అన్నాడు.

"లక్ష రూపాయలు ఇచ్చినా అక్కర్లా నాకు. ఏది అయితే ఆశ చూపించారో అదే కావాలి."

"అలా కాదు. నేను మోసం చెయ్యనీ, దొంగతనం చెయ్యనీ నా హక్కుకోసం నేను చేశా. నువ్వు దొంగతనం చేశావు. ఎవరికోసం చేశావ్ ?''

రోహిణి ముఖం వాడిపోయింది. తలవంచుకుని కూర్చుంది.

"నేను ఏమైనా కానీ-కృష్ణకాంతరాయ్ కొడుకును దొంగతనం చేసిన స్త్రీని ఎన్నడూ భార్యగా స్వీకరించలేను" అన్నాడు.

రోహిణి చటుక్కున లేచి నుంచుని, తలమీది చెంగు పైకి తీసుకుని, హరలాల్ ముఖంకేసి చూసి " నేను దొంగనా ? మీరు మంచి వారా ? నన్ను దొంగతనం చెయ్యమని చెప్పిందెవరు ? నాకు పెద్ద ఆశ చూపించిందెవరు ? మెత్తనిదాన్ని కదా అని చూసి మోసగించిం దెవరు? మోసాలన్నిటికన్నా మోసమయినదాన్ని—ఎంత దుర్మార్గులైనా నోటితో ఉచ్చరించటానికి వీలులేనికుతంత్రాన్ని-కృష్ణకాంతరాయ్ కొడుకై ఉండికూడా మీరే చేశారు ? వహ్వా! నేను మీకు అయోగ్యురాలినా ? మీలాంటి నీచుణ్ణి, మోసగాణ్ణి చేపట్టేటంత దౌర్భాగ్యురాలు ఎప్పటేలేదు మీరే కనుక ఆడజన్మఎత్తి ఉన్నట్లయితే మిమ్మల్ని ఇవాళ చీపురు పుచ్చకుని ఏం చెయ్యాలో అది చేసి చూపించేదాన్ని మీరు మగవారు. అది తెలుసుకుని మెదలకుండా వెళ్ళిపొండి" అంది.

తగినట్లే జరిగింది అనుకొన్నాడు. హరలాల్ మొదలకుంతా నెమ్మ దిగా వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు మాత్రం ముసిముసి నవ్వులు నవ్వు కుంటూ వెళ్ళాడు. ఇద్దరికీ తగినట్లె జరిగింది, అని రోహిణీ కూడా గ్రహించింది కోపంలో ఉండిపోయిన జుట్టుముడిని మళ్ళీ వేసుకుని వంట చెయ్యటానికి కూర్చుంది. ఆమె కళ్ల వెంట నీళ్ళు రాసాగాయి.

---

# 6

నీవు వసంతకోకిలవి. నువ్వెంతగాలయినా కూయనీ నాకేం అభ్యంతరంలేదు. కాని నిన్నుగురించి నా ప్రార్థన ఏమిటంటే కాస్త సమయం కనిపెట్టి కూస్తూఉండమని. సమయాసమయాలు గమనించ కుండా ఎప్పుడుపడితే అప్పుడు కూయడం మంచిదికాదు. చూడు, నేను ఎంతో వెదికి వెదికి కలం సిరాబుడ్డి కాగితాలు తెచ్చి దగ్గరపెట్టుకొని అంతకన్న ఎక్కువ ప్రయత్నంమీద మనస్సును దగ్గరుంచుకొని, కృష్ణ కాంతుని వీలునామాగాథ రాయటానికి ప్రారంభించి కూర్చున్నాను. ఈ సమయంలో నువ్వు ఆకాశములోనుంచి "కూహూ కూహూ'' అని పిలవటం ప్రారంభించావు. నీది మంచి కంఠమే అది నేనూ ఒప్పు కుంటా. కాని మంచి కంఠంకదా అనిచెప్పి వెనకనుంచి పిలుస్తూ ఉండే అధికారం ఎవ్వరికీలేదు ఏమయినా కాని నేను తలనెరిసినవాడిని. ఏదో రాసుకుంటున్నవాడిని ఇలాంటిచోట్లల్లా నువ్వు కూనిరాగాలు తీయ టంవల్ల కలిగే ప్రయోజనంలేదు కాని చూడు, కొత్తబాబుగారు రూపా యలు లెక్కపెట్టుకోటంలో మునిగి జమాఖర్చు వేసుకోటంలో తల పగలకొట్టుకుంటూంటే—అప్పుడు నువ్వు ఆఫీసు మొండిగోడ దగ్గర నుంచి "కూహూ కూహూ'' అన్నావంటే అతగాడికింక జమాఖర్చు కుదరదు. విరహంతో బాధపడే సుందరి రోజంతా అలాగేఉండి, రాత్రి తొమ్మిందింటికి రెండు మెతుకులు నోట్లోవేసుకొని, పాలగిన్నె దగ్గిరెట్టు కొని కూర్చుంటుదనుకో-అలాంటిసమయంలో నువ్వు కుహూ అన్నావంటే ఆమె ఒళ్ళో ఉన్న పాలగిన్నె అలాగే ఉండిపోతుంది. బహుశా అందులో పంచదారకుబదులు ఉప్పువేసుకుని త్రాగవచ్చు ఏమైతేనేం ఆ కుహూరవంలో ఒకవిధమైన గారడీమంత్రం ఉంది లేకపోతే ఎప్పు

దైతే నువ్వు వకుళ వృక్షం మీద కూర్చుని కూన రాగాలు తీస్తున్నావు. ఆ సమయంలోనే విధవయైన రోహిణి బిందె చంకనెట్టుకుని నీళ్ళు తీసుకురావటానికి వెడుతోంది—అప్పుడు-ఉండు ముందు నీళ్ళు తీసుకురావటానికి వెళ్ళటం సంగతి చెప్పనీ........

ఆ సంగతే ఇది. బ్రహ్మానందఘోష్ బీదవాడు. దాసీలను వాళ్ళనూ పెట్టుకోలేడు. అది మంచో చెడో చెప్పలేము-మంచికానీ చెడుకానీ, దాసీ వాళ్ళు లేని యింట్లో, మాయలాడితనం, చాడీలు చెప్పటం, పోట్లాటలూ, మురికీ ఈ నాలుగూ ఉండవు. ఈ నాలిగింటికీ "దాసీ" అనే దేవత సృష్టికర్త. విశేషించి ఎక్కువ దాసీఉన్నవారి ఇళ్ళల్లో నిత్యమూ కురుక్షేత్రసంగ్రామమే నిత్యమూ రామరావణ యుద్ధమే. ఒక్కొక్క దాసీదీ భీమావతారమే—చీపురుకట్ట అనే గదను పుచ్చుకుని గృహరిణ క్షేత్రంలో తిరుగుతూవుంటుంది. తనకు ప్రతికక్షులైన దుర్యోధన, భీష్మ, ద్రోణ, కర్ణులతో సమానులైన వీరులను బెదిరిస్తూ ఉంటుంది. ఒక్కొక్కతె కుంభకర్ణుడిలాగా ఆరేసి నెలలు వరసగా నిద్దరోతూ ఉంటుంది. ఒక్కొక్కతె సుగ్రీవుని లాంటిది. ఆ మెడ తిప్పి కుంభకర్ణుని వధించాలనే ప్రయత్నంలో ఉంటుంది. ఇలాంటి వాళ్ళే ఇంచుమించు అంతా....

బ్రహ్మానందుకు ఆ ఆపదలేమీ లేవు అందుచేత నీళ్ళు తీసుకురావటం, గుడ్డలుతకటం-ఈభారమంతా రోహిణిమీద పడింది. సాయంకాలంపూట మిగతా పనులన్నీ పూర్తికాగానే రోహిణి నీళ్లు తీసుకురావటానికి వెడుతూఉంటుంది. వెనక ఏరోజుసంగతి అయితే రాశానో ఆ మర్నాడు మామూలు వేళకు రోహిణి నీళ్ళు తీసుకురావటానికి వెడుతోంది. జమీందారుగారికి పెద్దచెరువు ఒకటిఉంది. దానిపేరు వారుణి. రోహిణి అక్కడికే వెడుతుంది నీళ్ళుతీసుకురావటానికి. ఇవాళ్ళకూడ అక్కడికే వెడుతుంది, నీళ్ళుతీసుకురావటానికి. ఆమె ఒంటరిగానే వెడుతుంది ఎప్పుడూ—అంతేకాని ఆడుతూ పాడుతూ మిగతా ఆడవాళ్ళతోపాటు వెళ్ళి ఏదోకాస్త చిన్నబిందెతో కాసిని నీళ్ళు తెచ్చామన్న పేరుకు తీసుకురావటం ఆమెకు అలవాటులేదు. రోహిణి విధవే—కాని విధవలాగా వుండదు- పెదవులకు తాంబూలారాగం, చేతులకుగాజులు, జరీఅంచు చీరె, అందముగా మెడలమీదికి వదులుగావేసుకున్న నల్లత్రాచులాంటి జడచుట్ట; చంకను ఇత్తడిబిందె, నడిచేటప్పుడు మెల్లిగా ఒయ్యారంగా

ఆబిందె తీసుకొని—అలలమీద హంసనృత్యం చేస్తున్నట్లు - నడిచి వెడుతూ ఉంటుంది. కాళ్ళు రెండూ - చెట్టునుంచి రాలిన పువ్వుల్లాగా మృధువుగా నేలమీద ఆనీ-ఆనకుండా ఉంటాయి. ఆ నీళ్ళబిందె కదలటం ఈఅడుగులకు తాళంవేస్తున్నట్లు వుంటుంది. ఇలా ఒయ్యారంగా,రోహిణి ఆసరోవర మార్గాన్ని ప్రకాశవంతంచేస్తూ నీళ్ళుతీసుకురావటానికి వెడు తోంది—సరీగ్గా ఆ సమయంలో వకుళ వృక్షం కొమ్మమీద కూర్చుని కోయిల "కుహూకుహూ" అని కూయసాగింది.

కుహూ! కుహూ!! కుహూ!!! రోహిణి నాలుగువైపులా తేరి పారచూచింది. ఆమె ఆకాశంలోకి పరపిన అవిలోలదృష్టి-ఆకొమ్మమీద పడి కోయిల కనుక కనుపించినట్లయితే, అప్పుడే అక్షయమైనపక్షి-బాణం తగిలితే గిర్రునతిరిగి క్రిందపడే పక్షిలాగా—కాళ్ళు పట్టుతప్పి క్రిందపడిపో యేదే అని నేను ఘంటాపధంగా చెప్పగలను. కాని ఆకోయిల అదృష్టంలో అలా రాసిపెట్టిలేదు. అనేకమైన కార్యకారణ పరంపరలో ఇది అందులో లేకపోయింది. కాని దానికి పూర్వార్జితమయిన సుకృతమనేది లేదు. అంచేతనే మళ్లీ ఆదుష్టపక్షి కుహూ! కుహూ! అని రాగంతీసింది.

"పో! పాడుముఖందానా!" అని రోహిణి వెళ్ళిపోయింది. వెళ్ళి పోయిందికాని కోయిలను మాత్రం మరచిపోలా. నాదృఢవిశ్వాసం ఏమి టంటే ఆ కోయిల ఆసమయంలో కూసింపని. ఓవరాలైన విధవ యువతి ఒంటరిగా నీళ్లకోసం వెడుతూంటే అప్పుడుకూయటం అంతమంచిది కాదు. ఎందుకంటె కోయిల కూతవింటే ఎన్నో చెడువిషయాలు గుర్తుకు వస్తాయి. ఏదో పోగొట్టుకున్నట్లు - అది మళ్ళీ చిక్కినట్లు ఉండి; జీవితమంతా నిస్సారమైనట్లు తోస్తుంది. ఏదో లేనట్లూ, ఎందుకో లేక పోయినట్లూ, ఏదోజరగనట్లు, ఏదోపొందునట్లూ ఉంటుంది. ఎక్కడో ఏదోరత్నం జారిపోయినట్లూ—ఎవరో పిలుస్తున్నట్లూ ఉంటుంది. ఈ జీవితమంతా వృధాగా అయిపోతున్నట్లూ, సుఖలేశమైనా లభించనట్లూ, ఈ ప్రపంచంలోని అనంత సౌందర్యంలో ఏమాత్రం అనుభవించనట్లూ ఉంటుంది.

మళ్లీ 'కుహూ! కుహూ!!' వినిపించింది. రోహిణి తేరిపార చూచింది. నిర్మలమూ, నీలమూ, అయిన అనంతాకాశంలోని "హోరు మెల్లిగా ఆకుహూరవంతో మేళవించింది. అప్పుడే వికసించి బంగారు

వర్ణంతోవున్న మామిడిపూత ప్రతిరెమ్మతోనూ ఆకుపచ్చని ఆకులతోనూ లీనమై సుగంధపరిపూర్ణం చేస్తోంది. తేనేటీగల ఝుంకారం తుమ్మెదల రొద ఆ కూహూరావంతో స్వరం కలిపాయి. ఆ చెరువు వొడ్డున గోవిందలాల్ పుష్పోద్యానంలో రెమ్మ రెమ్మకూ, కొమ్మ కొమ్మకూ ఆకు ఆకుకూ, ఎక్కడ వడితే అక్కడ. ఎర్రటి పూలూ, తెల్లటిపూలూ పచ్చటిపూలూ, చిన్నవీ, పెద్దవీ—వికసించి ఉండటం చూసింది-ఇటు చూస్తే పంచమ శ్రుతిలో కోయిల. ఆ కుసుమితకుంజవనంలో ఒక చెట్టు క్రింద గోవిందలాలూ, కుసుమిత వృక్షం కన్న సుందరంగాఉన్న అతడి భుజం మీద-బాగా వికసించినలత ఒకటి - వంగి కదులుతోంది. కోయిల ఈ సారి ఒక అశోకవృక్షం మీద నుంచి "కుహూ" అంది. అప్పుడు రోహిణి చెరువు లోపలికి మెట్లు దిగుతోంది. మెట్లు దిగి, ఆ బిందె నీళ్లలోముంచి ఏడుస్తూ కూర్చుంది. ఎందుకు ఏడుస్తూ కూర్చుందో అది నాకు తెలియదు. నేను ఆడవాళ్ల మనస్సులో సంగతి ఎలా చెప్ప గలను? అయినా ఈ దుష్టమైన కోయిలే రోహిణిని ఏడిపించిందని నాకు పెద్ద సందేహం.

---

# 7

వారుణీ తటాకం సంగతి ఎత్తి నేను చాలా చిక్కులో పడ్డాను. దానినిక వర్ణించగలిగినంత ఓపికలేదు నాకు. ఆచెరువు చాలాపెద్దది.— దానిచుట్టూ పచ్చగడ్డి, నీలపుఅద్దానికిచుట్టూ ఫ్రేమ్‌బిగించినట్లుఉంది. ఆపచ్చగడ్డి ఫ్రేముచుట్టూ ఉద్యానవనం - మరోఫ్రేమ్‌లాగాఉంది. ఆచె రువుకు నాలుగువైపులా జమీందారుగారి ఉద్యానవనాలు వాటిచుట్టూప్రహరీ గోడలు - అవన్నీయెంతో అద్భుతంగా ఉన్నాయి. రకరకాల పూలూ— ఫలభారంతో క్రిందికి వంగిన చెట్లూ - అందంగా వున్నాయి. ఆ ఉద్యాన వనాల్లో అక్కడక్కడ ఉన్న బాబుగారి చిన్న చిన్న బంగాళాలు - అస్త మించబోతున్న సూర్యకాంతిలో రత్నాల మేడల్లాగా ప్రకాశిస్తున్నాయి. ఇంకపైన ఆకాశం - అదికూడా ఈ ఉద్యానవనాల ఫ్రేముచుట్టూ బిగిం చిన మహో ఫ్రేమ్‌లాగానే ఉంది. అదీ ఒక నీలపు టద్దమే. ఆ నీలా కాశం, ఆ ఉద్యానవనాలు, ఆ పచ్చ గరిక, పూలూ, ఫలాలూ, చెట్లూ,

బంగాళాలూ, అన్నీ ఆ చెరువులోని నల్లటి నీళ్లల్లో ప్రతిఫలిస్తున్నాయి. మధ్య మధ్య కోయిల కూస్తూనే ఉంది. వీటి నన్నిటినీ ఒక రకంగా ఊహించుకోవచ్చు; కాని ఆ ఆకాశంలోనూ, ఆ చెరువులోనూ, ఆ కోయిల గానంతోనూ రోహిణి మనస్సుకు ఏం సంబంధం ఉందో అది మాత్రం చెప్పలేకపోతున్నాను. అందుకనే ఈ చెరువు సంగతి ఎత్తి నేను చాలా చిక్కుల్లో పడ్డాను అన్నా.

నేను చిక్కుల్లో పడ్డట్టే గోవిందలాల్ కూడా చిక్కుపడ్డాడు. గోవిందలాల్ కూడా ఆ పుష్పించిన లతల్లోంచి రోహిణి ఒంటరిగా వచ్చి ఆ రేవులో మెట్లమీద కూర్చుని ఏడుస్తూ ఉండటం చూశాడు. ఈ ఊళ్లో యువతి ఎవరో భర్తతో పోట్లాడివచ్చి ఇక్కడ కూర్చుని ఏడుస్తోందని అనుకున్నాడు గోవిందలాల్. నేను గోవిందలాల్ సిద్ధాంతంలో మాత్రం అంతగా ఏకీభవించను. రోహిణి మాత్రం ఏడుస్తూనే ఉంది.

రోహిణి ఏమాలోచిస్తోందో చెప్పలేను. కాని-"ఏ అపరాధంవల్ల నాకీ బాల వైధవ్యం ప్రాప్తించింది? ఈ ప్రపంచంలోని సుఖాన్ని అనుభవించటానికి వీలులేకపోవటానికి నేను ఇతరులకన్న ఏమంత మహాపరాధం చేశాను? నాకు రూపమూ యౌవనమూ ఉన్నా - జీవితమంతా ఇలా మ్రోడులా బ్రతకటానికి నేను చేసిన దోషమేమిటి? ఈ మానవ జీవితంలో అందరూ సుఖవంతులే - ఇప్పుడు ఈ గోవిందలాల్ భార్య విషయమే తీసుకుందాం - ఆమె నాకన్న ఏవిషయంలో, ఏ గుణంలో, ఎక్కువది? ఏ పుణ్యఫలమువల్ల ఆమెకు ఇంత సుఖం, నాకింత శూన్యమూను? అదలా పోనీ - ఇతరుల సుఖాన్ని చూసి నేను అసూయ పడను, కాని నాకు అన్ని మార్గాలూ ఎందుకు బంధితములైనాయి? నేనింత సుఖరహితంగా బ్రతికి ఏమిటీ చెయ్యటం?'' అని ఆలోచిస్తోంది అనుకుంటా.

అందుకనే రోహిణి స్వభావం అంతమంచిది కాదని అన్నాను నేను. చూడరాదూ ఈ కాస్తదానికే ఎంత అసూయో! రోహిణిలో చాలా దోషాలున్నాయి. ఆమె ఏడుపు చూసి విచారించటం దేనికి? విచారించను కాని ఇది విచారవిషయంకాదు - ఇతరుల దుఃఖం చూసి కన్నీరుకార్చటం మంచిది. మేఘాలు ముళ్లకంచెలను చూసినా అక్కడ వర్షింపకమానవు.

అంచేత మీరు కూడా రోహిణిని గురించి ఒక్కసారి "పాపం" అనండి. ఇంకా ఇప్పటికీ రోహిణి ఆ మెట్లమీద కూర్చుని ముఖాన చేతులెట్టుకొని ఏడుస్తునే ఉంది-ఉత్త బిందె నీళ్లమీద గాలికి కదులు తోంది.

సూర్యాస్తమయం అయింది. క్రమంగా చెరువులోని నీళ్ళమీదికి కూడా చీకట్లు వ్యాపించి-అంధకారం అలుముకుంది. పక్షులన్నీ తమ గూళ్ళకు చేరుకున్నాయి, పశువులు పొలాలనుంచి ఇళ్లకు చేరుకున్నాయి. అప్పటికి చంద్రోదయమయి, చీకటి అంచుల మీదికి కొంచెంగా వెన్నెల వ్యాపిస్తోంది. రోహిణి మాత్రం ఇంకా అప్పటికీ అక్కడే కూర్చుని ఏడుస్తోంది. ఆ బిందె నీళ్లమీద అలాగే తేలుతోంది. గోవిందలాల్ ఉద్యానవనం నుంచి యింటికి బయలుదేరాడు. వెళ్ళేటప్పుడు రోహిణి ఇంకా అక్కడే కూర్చుని ఉండటం చూశాడు. ఒక అబల ఇంతసేపు అక్కడ కూర్చుని ఏడవటం చూసేసరికి అతడికి కొంచెం విచారం వేసింది. "ఈ స్త్రీ సచ్చరిత్రురాలు కానీ, దుశ్చరిత్రురాలు కానీ ఆమెకూడా జగత్పిత ప్రపంచంలోకి వదలిన ఒక పతంగం, నేనూ అలాంటి పతంగాన్నే. అంచేత ఆమెకూడా నా సోదరే. ఆమె దుఃఖాన్ని నేను కనుక పోగొట్టగలిగితే - ఎందుకు పోగొట్టలేను?" అని తోచింది అతడి మనస్సుకు.

గోవిందలాల్ మెల్లిమెల్లిగా ఆ మెట్లన్నీదిగి రోహిణి దగ్గరకు వెళ్ళి, ఆమె ప్రక్కన నిలబడ్డాడు. రోహిణి అతణ్ణిచూచి తుళ్ళిపడింది.

"నువ్వు ఇంతసేపు ఒంటరిగా కూర్చుని ఏడుస్తున్నావెందుకు రోహిణీ?" అని అడిగాడు గోవిందలాల్.

రోహిణి లేచినుంచుంది కాని మాట్లాడలేదు.

"నీకు అంతదుఃఖము యెందుకు వచ్చిందో నాతో చెప్పకూడదా? ఒకవేళ నేనేదయినా ఉపకారం చేయగలుగుతానేమో!" అన్నాడు మళ్ళీ గోవిందలాల్.

హరలాల్ ఎదుట అతిగా మాట్లాడిన రోహిణి—గోవిందలాల్ ఎదుట ఒక్కమాటకూడా మాట్లాడలేకపోయింది. ఏమీ మాట్లాడకుండా ఆ చెరువు మెట్లమీద శిలావిగ్రహంలా నిలబడింది. స్వచ్ఛంగావున్న ఆ చెరువునీళ్ళలో—సూర్యకిరణాల సముదాయంలావున్న ఆమె నీడను

చూశాడు. పూర్ణచంద్రుని ఛాయను చూశాడు, పుష్పించిన లతావృక్షాల ఛాయలను చూశాడట. అంతా సుందరంగానే వుంది. కేవలం నిర్దయ ఒక్కటే సౌందర్య విహీనంగా ఉండేది. సృష్టికరణామయే—మనుష్యుడే కరుణా విహీనుడు. గోవిందలాల్ ప్రకృతిని స్పష్టంగా అర్థం చేసుకున్న వాడు. "నీకు ఎలాంటి కష్టమయిన కలగనీ, ఇవాళకానీ, రేపుకానీ, ఎప్పు డయినా సరే నాకు తెలియచెయ్యి. నాతో స్వయంగా చెప్పలేకపోతే మా ఇంట్లో ఆడవాళ్ళద్వారా నైనాసరే—తెలియచెయ్యి" అన్నాడు గోవిందలాల్.

"రోహిణి ఈసారి మాట్లాడింది. "ఎప్పుడో చెబుతా, కాని ఇవాళ కాదు. ఒకరోజున మీకు నాగాధవినిపిస్తా" అన్నది.

గోవిందలాల్ అందుకు అంగీకరించి ఇంటికి వెళ్ళటానికి బయలు దేరాడు. రోహిణి నీళ్ళలోదిగి బిందినిండా నీళ్ళుముంచింది—ఆబిందె నీళ్ళలో ముంచేటప్పుడు చిత్రమైన చప్పుడౌతూ చటక్కున మునగలేదు. తర్వాత బిందెమునిగి నిండినతర్వాత రోహిణి వట్టుమీదికివచ్చి తడి చీరెతో శరీరాన్ని అందంగా ఆచ్ఛాదితంచేసుకొని మెల్లిగా ఇంటికి బయలు దేరింది. ఆబిందెలోనీళ్ళు నడుస్తున్నప్పుడు గలగలకదులుతూ రోహిణితో మాట్లాడుతున్నట్లున్నాయి. రోహిణి మనస్సుకూడా—ఆనీళ్ళు ఏమం టున్నాయో అని శ్రద్ధగా వినసాగింది.

---

# 8

రోహిణి పెందరాళే వంటచేసి, బ్రహ్మానంద్ ఘోష్‌కు భోజనం పెట్టి, తాను తినకుండా గదిలోకి వెళ్ళి తలుపులు బిగించుకుని పడుకుంది.

నువ్వు దార్శనిక సిద్ధాంతాలూ, వైజ్ఞానికవిషయాల్లోని మతామతాలు కాస్సేపు దూరంగా ఉంచి నేను చెబుతున్న కథ విను. సుమతి అనే దేవ కన్య. కుమతి అనే రాక్షసీ ఇద్దరూ ఎప్పుడూ మనుష్య హృదయాల్లో సంచరిస్తూనూ ఉంటారు. పరస్పరం ఎప్పుడూ యుద్ధం చేసుకుంటూనూ ఉంటారు. చచ్చిన ఆవుకోసం రెండు పెద్ద పులులు పోట్లాడుకున్నట్లు శవం కోసం రెండు నక్కలు కీచులాడుకున్నట్లు - వీళ్ళిద్దరూ బ్రతికి ఉన్న మనుష్య దేహాల్లో ఉండి - అలాగే చేస్తూ ఉంటారు. ఇవాళ ఏ

ఏకాంతంగా ఉన్న రోహిణి పడక గదిలో రోహిణిని పట్టుకుని వాళ్ళిద్దరూ ఇలాగే తగవులాడుకుంటున్నారు.

"ఇలాంటి వారిని కూడా సర్వనాశంచేసి కూర్చున్నావా?" అన్నది సుమతి.

"వీలునామా హరలాల్‌కు ఇవ్వలేదుగా! సర్వ నాశం చేసిం దెక్కడ?" అంది కుమతి.

"కృష్ణకాంతునికే వీలునామా కృష్ణకాంతుని ఇచ్చేసెయ్యి"

"బాగుంది! అప్పుడు కృష్ణకాంత్ "ఈ వీలునామా నీకు ఎక్కడ దొరికింది? నా డ్రాయరులోకి దొంగవీలునామా ఎలా వచ్చింది?' అని అడిగితే ఏం చెప్పను నేను? ఎంత భేషైనమాట! బాబాయితోపాటు మమ్మల్నిద్దరినీ జైల్లోకి పొమ్మంటావా ఏమిటి?"

"అయితే ఉన్న సంగతులన్నీ గోవిందలాల్‌కు విప్పిచెప్పి అతడి కాళ్ళమీద ఎందుకు పడాలా? అతడు దయాళువు. తప్పకుండా రక్షిస్తాడు నిన్ను."

"అదీ సంగతి. కాని గోవిందలాల్ ఈ విషయాలన్నీ కృష్ణకాంత్‌కు తప్పకుండా తెలియచెయ్యాల్సి వస్తుంది. లేకపోతే ఆ వీలునామాలు మార్చటానికి వీలుండదు. అప్పుడు కృష్ణకాంత్ మమ్మల్ని ఠాణాకు పంపిస్తే గోవిందలాల్ ఎలా అడ్డుపడగలడు? అంతకన్నా నాదొక సలహా ఉంది. ఇప్పుడు మెదలకుండా ఊరుకుని కృష్ణకాంత్ చనిపోయిం తర్వాత సలహాప్రకారం గోవిందలాల్ దగ్గరకువెళ్ళి అతడి కాళ్ళు పట్టుకుని ఈ వీలునామా అతని కిస్తే సరి."

"అప్పుడది వ్యర్థమౌతుంది. కృష్ణకాంతుని ఇంట్లో దొరికిన వీలునామా నాకు ఏదైతే ఉందో అదే యదార్థమైనదని విశ్వసిస్తారు. అప్పు డీ వీలునామా బైటపడితే గోవిందలాల్‌ని మోసగాడని అపవాదు వేస్తుంది లోకం.

సుమతి ఓడిపోయి మెదలకుండా ఊరుకుంది. తర్వాత ఇద్దరూ మళ్లీ సంధికావించుకుని సఖ్యభావంతో మరోపనిలో ప్రవృత్తులైనారు. అతడే - ఆచెరువుగట్టున వెన్నెల్లో ధగధగామెరిసి పోయినదేవమూర్తి రోహిణి మానసచక్షుష్పులకు ప్రత్యక్షమైనాడు. రోహిణి అతన్నే చూడసాగింది. చూస్తూచూస్తూ యేడ్వసాగింది; రోహిణి ఆరాత్రినిద్రపోలా.

---

# 9

అదిమొదలుకొని రోహిణి రోజూ బిందె చంకనుపెట్టుకొని చెరువుకు నీళ్ళకు వెడుతూనేవుంది. నిత్యమూ కోయిల కూస్తూనేవుంది. నిత్యమూ ఆపుష్పోద్యానంలో రోహిణి గోవిందలాల్‌ను చూస్తూనేఉంది. ప్రతిరోజూ సుమతి, కుమతలకు ముందు పోట్లాటా: ఉగ్రావర రాటీ జరుగుతూనేఉంది. సుమతి కుమతుల విరోధం మనుష్యులు సహించదగినదే కాని నాటి స్నేహంమాత్రం మహా అనర్థాన్ని కలిగిస్తుంది, అప్పుడు సుమతి కుమతి రూపాన్ని ధరిస్తుంది. కుమతి సుమతి పని చేస్తుంది. అప్పుడు సుమతి ఏదో, కుమతి ఏదో తెలుసుకోలేము. లోకులు సుమతి అనుకుని కుమతికి వశమవుతారు

ఏమయినాకానీ, సుమతికానీ, కుమతికానీ గోవిందలాల్ రూపం రోహిణి హృదయపటంమీద గాఢంగా చిత్రితమవుతూ వచ్చింది. చిత్రపటమేమో అంధకారమయం. దానిమీద చిత్రమేమో ఉజ్వలమూను. ఆరోజుకారోజు చిత్రం ఉజ్వలతరమవుతున్నకొద్దీ చిత్రపటం గాఢాంధకారమయ మవుతోంది. అప్పుడు ప్రపంచమంతా ఆమె నేత్రాలకు - పోసింది పాతమాటలు చెప్పాల్సినంత అవసరం లేదు. రోహిణి గోవిందలాల్‌మీద ప్రణయసక్తురాలైంది. మళ్ళీ కుమతి జయించింది.

ఇంతకాలానికి ఆమెకిలాంటి దుర్దశ ఎందుకు సంభవించిందో నాకు తెలియదు. ఈరోహిణే గోవిందలాల్‌ను చిన్నప్పటినుంచీ చూస్తూనే ఉంది. ఎప్పుడూ అతడు రోహిణి మనస్సును ఆకర్షించలేదు. ఇప్పుడు హఠాత్తుగా ఇలాఎందుకు జరిగిందో తెలియదు. ఏం జరిగిందో అది మాత్రమే చెబుతున్నా నేను. ఆముసలికోయిల పాడినరాగం. ఆచెరువుగట్టున

ఏడుపూ, ఆసమయమూ, ఆపరిదేశమూ, ఆచిత్తభావమూ - ఆపైన ఆస మయంలో గోవిందలాల్ కరుణ - గోవిందలాల్ అపరాధంఏమీలేక పోయినా అతడియెడ రోహిణి అన్యాయ పరివర్తన, వీటినన్నిటినీ పుర స్కరించుకుని కొద్దిరోజుల్లో గోవిందలాల్ రోహిణి మనస్సులోస్థానాన్ని పొందకలిగాడు.

రోహిణి తెలివికలది - ఇది ప్రాణాలమీదికి వచ్చేవిషయమని వెంటనే తెలుసుకుంది. గోవిందలాల్‌కు ఈ విషయం ఒకవేళ ఘుణా క్షరన్యాయేణా తెలిసిదంటే - ఇక ఎన్నడూ అతడినీడయినా తనమీద సోకదు. బహుశా ఊళ్ళోనుంచి వెళ్ళగొట్టినాకూడా, ఇది ఎవ్వరిముందరా చెప్పే విషయంకూడాకాదు. రోహిణి అతిప్రయత్నం మీదమనస్సులోనే దాచుకుంది తనప్రణయాన్ని కానిఅంతర్నిహితమైన అగ్నిలోపల్లో పలే ఎలాదగ్ధంచేస్తూ ఉంటుందో - రోహిణి మనస్సుకూడా అలాగేకాజొ చ్చింది. జీవనభారాన్ని వహించటం రోహిణికి కష్టదాయకమయింది. ఆమె రాత్రింబవళ్లాలోపల్లోపలచావును కోరుకోసాగింది.

ఎంతమంది ఇలా మనసామృత్యువును కోరుకుంటూవుంటారో ఆలెక్క యెవరు చెప్పగలరు? కాని నాకేమనిపిస్తుందంటే సుఖవంతులు కానీ, కష్టాల్లో ఉన్నవారుకానీ చాలామంది మనోవాక్కాయ కర్మలతో మృత్యువును కోరుకుంటూనేవుంటారు. ఈ ప్రపంచములోవున్న సుఖం కాదు. సుఖంకూడా దుఃఖమయమే ఏసుఖంలోనూ సంపూర్ణత్వంలేదు. అంచేతనే సుఖవంతులుకూడా చాలామంది చావును కోరుకుంటూ వుంటారు - ఇక కష్టాలలోవున్నవారు - ఆకష్టాన్నీ. దుఃఖాన్నీ భరించ లేక మృత్యువును ఆహ్వానిస్తూ యుంటారు.

మృత్యువును ఆహ్వానిస్తారు - కాని ఎవరిదగ్గరకు వస్తుందీమృ త్యువు? పిలిస్తే చావురాదు. సుఖవంతులు చావును కోరనివాళ్ళు, సుంద రలు, యౌవనవంతులూ - ఎవరికళ్ళకు ఈ సృష్టిఅంతా నందనవనంలా కన్పిస్తుందోవాళ్లూ—వాళ్లకు వస్తుంది మృత్యువు. రోహిణిలాంటి వాళ్ల దగ్గరకు రాదు. మృత్యువును పిలిచి రప్పించుకునేశక్తిలేదు మానవులకు. ఏదైనా విషప్రయోగాదుల వల్ల ఈ నశ్వరీ జీవితాన్ని అంతం చేసుకో వచ్చు. కాని అంతరంగికంగా అలాంటి ఔషధాలను మ్రింగలేరు. ఎవ

నైనా అలా చేయగలిగినా రోహిణి అలాంటిది కాదు. రోహిణి అలాంటిది చేయలేకపోయింది,

కాని ఒక్క విషయంలోమాత్రం—రోహిణి కృతనిశ్చయురాలైంది. ఆ దొంగ వీలునామాను చలామణీ కానియ్యకూడదు. దీనికి సులభమైన ఉపాయంపుంది. కృష్ణకాంతుకుచెప్పినా—అథవా ఎవరిచేతనయినా మీ వీలునామా ఎవరో దొంగిలించారు. ఆడ్రాయరులోని అక్కడపడివున్న వీలునామా తీసిచూచుకోండి అని చెప్పించవచ్చు. రోహిణి ఈ దొంగతనం చేసిందని చెప్పవలసిన అవసరంలేదు. ఎవరైనా దొంగిలించనీ కృష్ణకాంత్‌కు సందేహముకలిగి పెట్టెతెరచి వీలునామాచదవి - ఆదొంగ వీలునామా రద్దుచేసి కొత్తదిరాయటానికి ప్రయత్నిస్తాడు.

గోవిందలాల్ సంపత్తి రక్షింపబడుతుంది. ఈ దొంగతనం ఎవరు చేశారో ఎవ్వరూ తెలుసుకోరుకూడా. కాని ఇందులో ఒక చిక్కువుంది. కృష్ణంకాత్ వీలునామచదవగానే ఇదీ బ్రహ్మానందుని దస్తూరేనని తెలుకోగలడు. అప్పుడు బ్రహ్మానందం మహావిపత్తులో పడిపోతాడు. అంచేత ఆడ్రాయరులోవున్న వీలునామా ఏదోఅది ఎవరికంటాపడకూడదు.

అంచేతహరిలాల్ మీదఉన్న ఆశతో గోవిందలాల్‌కు ఎంతటి అనిష్టం సిద్ధంచేసి ఉంచిందో - దానిప్రతీకారంకోసం ఎంతవ్యాకులపడినా పినతండ్రిని రక్షించటానికి ఏమీచేయలేక పోయింది. చివరకు - ఎలాఅయితే దొంగవీలునామా తీసుకువెళ్ళి అక్కడపెట్టి అసలువీలునామా తీసుకువచ్చిందో, అలాగే ఈసారి ఈఅసలువీలునామా మళ్ళీ అక్కడపెట్టి ఆదొంగవీలునామా తీసుకురావాలని నిశ్చయించుకుంది.

అర్ధరాత్రి రోహిణీసుందరి ఈవీలునామా చేతపుచ్చుకుని సాహసించి కృష్ణకాంతుని ఇంటికి బయిలుదేరింది. దొడ్డితలుపు మూసిఉంది. సింహద్వారం దగ్గిర దర్వాను యథాప్రకారంగా మంచంవేసుకు కూర్చుని అర్ధనిద్రలో కూనిరాగాలుతీస్తూ ఏదోగొణుకుంటున్నాడు. రోహిణి ఆగుమ్మందగ్గరకువచ్చింది. "ఎవరునువ్వు?'' అని అడిగాడు దర్వాను. నేను సఖిని' అన్నదిరోహిణి. సఖీఅనేది ఆఇంట్లో ఒకదాసీదానిపేరు. అంచేత

దర్వాన్ ఇంకఏమీమాట్లాడలా. రోహిణి నిర్విఘ్నంగా ఇంట్లోకి ప్రవే శిస్తూనే పూర్వపరిచితమైన కృష్ణకాంతుని గదిలోకివెళ్ళింది. ఊరుఫద్రం గానేవుందికదాఅని కృష్ణకాంత్ పడకగది మూయించలేదు ఆగదిలోప్రవే శించేటప్పుడు కృష్ణకాంత్ గురకతీస్తూ ఉండటం రోహిణిచెవి ఒగ్గివిన్నది. మెల్లిగా ఇహదగ్గరకువెళ్ళి ముందుగా దీపంఆర్పేసింది. తర్వాత ఇదివరకు లాగానే తాళంచెవి సంగ్రహించింది. ఇదివరకులాగానే చీకట్లో ఆడ్రా యరు గుర్తుపెట్టుకుని సొరుగు పైకి లాగింది.

రోహిణి అతిశర్ధగా - ఎంతో మెల్లిగానే లాగింది. అయినాతాళం తీసేప్పుడు 'టక్' మని కొంచెం చప్పుడయింది. ఆచప్పుడుతో కృష్ణకాంత్ కు నిద్రాభంగమయింది. అదిఏంచప్పుడో కృష్ణకాంత్ సరీగ్గాతెలుసుకో లేకపోయాడు ఏమీమాట్లాడకుండా చెవిఒగ్గి ఊరుకున్నాడు.

గురకవినిపించటం ఆగిపోవటం రోహిణికూడాచూసింది. కృష్ణ కాంత్ కు నిద్రమెళుకువచ్చిందని గ్రహించి ఆమె నిశ్శబ్దంగా స్థిరంగా కూర్చుంది "ఎవరది?" అన్నాడు కృష్ణకాంత్ ఎవ్వరూ ఏమి సమాధానం ఇవ్వలా.

ఆపూర్వపు రోహిణికాదు ఇప్పుడు. ఈరోహిణీ విపత్తురాలై క్లిష్ట స్థితిలోపడి కొంచెం బయపడిందికూడానేమో- ఒక్కసారి నిట్టూర్పుకృష్ణ కాంతుని చెవినిపడింది.

కృష్ణకాంత్ హరిని కేకేశాడు ఆసమయంలో పారిపోదామనుకుంది రోహిణి కానిఅలా అయితేగోవిందలాల్ కు తగినసహాయం జరగదు. "చెడుపనికోసంఆరోజున ఎంతసాహసించానో, మంచిపనికోసం ఈరోజున అంతఎందుకు సాహసించలేను? పట్టుపడుతేపడుతాను" అనుకుంది పారి పోలా

కృష్ణకాంత్ హరినిఎంతపిలిచినా సమాధానంరాలా హరిఎక్కడికో వెళ్లిఫుంటాడు - త్వరలోనేరావచ్చు కృష్ణకాంత్ దిండుకిందనుంచి అగ్గి పెట్టెతీసి వెలిగించాడు ఆవెలుతురులో గదిమధ్య డ్రాయరుదగ్గిర - ఒక స్త్రీఉండటం చూశాడు.

ఆ అగ్గిపుల్లతో దీపం వెలిగించి "ఎవరు నువ్వు?" అని ప్రశ్నించాడు ఆమెను.

రోహిణి కృష్ణకాంత్ దగ్గరకు వెళ్లి "నేను రోహిణిని" అంది.

అతను విస్మితుడై "ఇంతరాత్రివేళ ఈ చీకట్లో ఇక్కడ ఏం చేస్తున్నావు?" అన్నాడు.

"దొంగతనం చేస్తున్నా"

"ఆపరిహాసాలు అలావుంచు నిన్నుమెలాంటి స్థితిలో చూశానో చూడు. నువ్వు దొంగతనం చెయ్యటానికి వచ్చావంటే చచ్చినా నమ్మలేకుండావున్నా కాని దొంగతనస్థితిలోనే చూస్తున్నా నిన్ను"

"అయితే నేను ఏం చెయ్యటానికి వచ్చానో అది మీకళ్లయెదుటే చేస్తాను చూడండి తర్వాత నన్నేం చెయ్యటం ఉచితమో అలాగే చెయ్యండి నేను పట్టుబడ్డాను, ఇంక పారిపోలేను. పారిపోను"

అని రోహిణి మళ్లీ వ్రాయసుడు దగ్గరకు వచ్చి దాని యొక్క సొరుగు ఇవతలకు లాగి అందులో వున్న దొంగ వీలునామా పైకితీసి అసలు వీలునామా అందులో ఉంచి ఆ దొంగ వీలునామా ముక్కలు ముక్కలుగా చేసింది.

"ఆఁ, ఆఁ, ఏమిటి చింపుతున్నావ్? చూడనీ, చూడనీ. అని కృష్ణకాంత్ కేకలేశాడు కాని ఆయన అలా అరుస్తూండగానే ఆ ముక్కలను దీపానికి వెలిగించి మసి చేసింది.

కృష్ణకాంత్ కోపముతో కళ్ళెర్ర చేసుకుని "ఏమిటా తగల పెట్టింది?" అన్నాడు.

"ఒక దొంగ వీలునామా"

కృష్ణకాంత్ గజగజ లాడిపోయి, "వీలు! వీలు! నా వీలునామా ఎక్కడుంది" అన్నాడు

"ఓ వీలునామా మీ డ్రాయరులోనే ఉంది; చూడరాదూ?"

ఈ యువతి స్థైర్యాన్ని నిశ్చింతనూ చూసేసరికి కృష్ణకాంత్‌కు ఆశ్చర్యం కలిగింది. "ఏ దేవతయినా మోసగించటానికి రాలేదుకదా!" అనుకున్నాడు.

కృష్ణకాంత్ వెంటనే డ్రాయరు తీసి, చూశాడు ఒకవీలునామా ఉంది అందులో. అది బయటికి తీసి సులోచనాలు పెట్టుకొని చదివి చూశాడు. అది అసలు వీలునామాయే, విస్మితుడై మళ్ళీ "నువ్వు తగల పెట్టింది "ఒకి దొంగ వీలునామా"

"అదేమిటి? అ వీలునామా ఎవరు తయారు చేశారు? అది నీకు ఎక్కడి దొరికింది?

"ఎవరు తయారుచేశారో నేను చెప్పలేను. అది నాకు ఈ డ్రాయరులోనే దొరికింది?"

"ఈ డ్రాయరులో దొంగవీలునామా ఉన్నదని నీకెలా తెలిసింది?"

"అది నేను చెప్పలేను"

కృష్ణకాంత్ కాస్సేపు ఆలోచించసాగాడు. "నేను ఇలాంటి స్త్రీల క్షుద్రబుద్ధిని గ్రహించనేలేకపోతే ఇంత ఆస్తిని ఇన్నాళ్ళనుంచీ ఎలా కాపాడుకు రాగలిగినాను? ఈ దొంగ వీలునామా ఇక్కడ ఉంచి అసలుది తీసుకువెళ్ళటానికివచ్చి ఉంటావు బహుశా, తర్వాత పట్టుబడటం వల్ల భయపడి ఆ దొంగవీలునామా తగలపెట్టి ఉంటావు అవునా?" అన్నాడు.

"అది కాదు"

"అది కాదా? అయితే మరేమిటి?"

"నే నేమీ చెప్పను. నేను మీ ఇంట్లో దొంగలాగా ప్రవేశించాను వాసు దానికి తగిన శాస్తి ఏం చెయ్యాలో అది చెయ్యండి."

"నువ్వు పాడు పని చెయ్యటానికే వచ్చావు. అందులో సందేహం లేదు. లేకపోతే ఇలా దొంగలాగా రావటం ఎందుకు? నీకు తగిన శిక్ష తప్పకుండా విధిస్తాను నిన్ను పోలీసులకు ఒప్పగించను. రేపు నీకు కేశఖండనం చేయించి ఊరేగించి వెళ్ళగొట్టిస్తా నువ్వు ఈ పూటకు కొట్లో ఉండు.

రోహిణి ఆ రాత్రే బంధితురాలయిది.

---

# 10

ఆ రాత్రి తెల్లవారుఝామున తనపడకగదిలో కిటికీదగ్గర నిలబడి ఉన్నాడు గోవిందలాల్ తెల్లవారటానికి యింకా కొంతఆలస్యంఉంది ఇంటిముంగిలిలోవున్న కామునేని కుంజంమీదనుంచి ఇంకా కోయిలకూయ లేదు. కాని ప్రభాతగీతాలు మాత్రం ప్రారంభమైనాయి గోవిందలాల్ ఆకిటికీదగ్గరనుంచుని ఎదురుగా వున్న ఉద్యానవనంలోంచి మల్లెపొదరింటిమీదుగా వస్తున్న ప్రభాతవాయువు పరిమళాన్ని ఆఘ్రాణిస్తున్నాడు అలాంటి సమయంలో ఒక సన్నటి యువతి వచ్చి అతడి దగ్గర నిలబడింది.

"నువ్వు మళ్ళీఇక్కడికెందుకు?" అన్నాదు గోవిందలాల్.

"మీరెందుకు ఇక్కడ?" అన్నదా యువతి ఆమె గోవిందలాల్ భార్య అనివేరే చెప్పనక్కర్లా.

"నేనుకొంచెం గాలిని తిందామనివచ్చాను. అదికూడా సహించలేరా మీరు?"

"ఎందుకు సహించలేను?" ఇంకా ఇప్పటికీ తినాలి తినాలనేనా? ఇంట్లోఇన్నితిన్నాతృప్తికలగలా? మళ్ళీ మైదాన ల్లోనూ, చెరువుగట్లమీదా గాలితి టానికి తొంగిచూస్తున్నారు"

"ఇంట్లో అన్నీ ఏంతిన్నాను."

"ఇప్పుడేగా! నాదగ్గిర చీవాట్లుతినలా?"

"చీవాట్లు తినేటట్టయితేనే వంగ యువకులను కమీషన్ చేసేయితే

ఈ దేశీయ యువకులు ఈపాటికి అజీర్తితో చచ్చిపోయేవారని తెలియదా భ్రమరీ ఆతిట్లన్నీ వీరికి సులభంగానే అజీర్ణమవుతాయి ఏదీ నువ్వు నీ ముక్కు నత్తుతిప్పుకుంటూ మాట్లాడు. మరోసారి చూస్తాను ”

గోవిందలాల్ భార్య పేరు కృష్ణమోహినియో, కృష్ణకామినియో అనంగమంజరియో ఇలాంటి పేరే ఏదో, పెట్టిఉంటారు ఆమె తల్లి దండ్రులు. ఆ పేరును ఎవ్వరూ పిలవకపోవటంవల్ల ఆ పేరు లోపించి పోయింది. ఆమెకు ముద్దుపేరు—భ్రమరి అని “భోమరా” అనీ, ఆ పేరు సార్ధకమవటంవల్ల అదే ప్రచారంలోకి వచ్చింది. భోమరా (తుమ్మెద) నల్లగా ఉంటుంది.

భ్రమరి తన నత్తు తిప్పటానికి అయిష్టత కనపరచి అది తీసి మరొకచోట పెట్టివచ్చి గోవిందలాల్ ముక్కుపట్టుకుని ఆడించ సాగింది.

తర్వాత గోవిందలాల్ ముఖంకేసి చూసి, మెల్లిమెల్లిగ నవ్వుకుని తనెంతో పెద్దఘనకార్యంచేసినట్లు తలపోయసాగింది. గోవిందలాల్ కూడా ఆమెముఖంకేసి చూస్తున్నాడు. ఆ సమయంలో సూర్యోదయ సూచకంగా ప్రధమకిరణం ఆకాశంలో కాన్పించింది. క్రమంగా సూర్యుని లేత కిరణాలు భూమి మీద ప్రతిఫలించసాగాయి. ఆ నూత్నకాంతితూర్పు దిక్కు నుంచి తూర్పు ముఖంగా నిలబడ్డ భ్రమరి ముఖం మీద పడసాగింది. ఉజ్జ్వలంగా, శుభ్రంగా ఉన్న ఆమె శ్యామల ముఖకాంతిమీద, కోమల మయిన ప్రభాతకాంతులుపడి, విస్ఫారితకులమున ఆమె చంచల నేత్రాలలో ప్రతిఫలించి స్నిగ్ధోజ్వలములయిన ఆమె చెక్కిళ్ళమీద ప్రభాసిత మయినాయి.

ఈ సమయంలో నిద్రలేచిన దాసీవాళ్ళ గోలవినిపించింది. తర్వాత ఇళ్లుతుడవటం, నీళ్ళుతోడటం. బట్టలుతుకటం—ఈధ్వనులన్నీ వినిపించ సాగినాయి. ఆధ్వనులన్నీ అకస్మాత్తుగా ఆగిపోయి: “ఏంజరిగిందేతల్లి” “కొంపమునిగిపోయిందే” ‘ఎంతసాహసం’! అంటూ ఏదోగందరగోళం వినిపించసాగింది. అదివిని భ్రమరి బైటికి వెళ్ళిపోయింది.

ఆదాసీది భ్రమరిని సహజంగా అంతగా లెక్కచెయ్యదు. దానికి కొన్ని కారణాలున్నాయి. ఒకటేమో భ్రమరిచిన్నపిల్ల అదీగాక ఇంక గృహస్వామినీ కాలేదు. ఆమెకు అత్తా ఆడబిడ్డాకూడా ఉన్నారు. అది

అలావుండగా భ్రమరికి నవ్వటం చేతనయినంతగా—దాసీవాళ్ళను అమ్మ పాజ్జల్లోపుంచటం చేతకాదు భ్రమరినిచూసి ఆదాసీవాళ్ళంతా మరింత గందరగోళ చేయసాగారు.

"మీరువిన్నారా అమ్మా? అన్నదొకతె"

"ఇంతకొంపమునగటం స గతి నేనెక్కడా వినలేదమ్మా!"

"ఎంతసాహసం; ఆముండను చీపురుప్రచ్చుకొని బాదివస్తానిప్పుడు" అన్నది మరొకతె

"కేవలం చీపురుదెబ్బలుకాదు అమ్మా! నేను దానిముక్కుకోసి వస్తాను" అన్నది ఇంకొకతె

"ఎవరికడుపులో ఏముందో—అదెలా తెలుసుకోగలం అమ్మా?" అన్నది వెరొకతె

భ్రమరి నవ్వుతూ "ముందుఏంజరిగిందో చెప్పరే? తర్వాత ఎవరికి ఎలాతోస్తే అలాచెయ్యవచ్చు" అంది;

అప్పుడు మళ్ళీ మొదటిలాగానే గందరగోళం చెలరేగింది.

"వినలా! ఊరంతాకూడా పొక్కిపోయింది"—

"పెద్దపులిగుహలో తోడేలు కాపురం"

"చీపురుకట్టపుచ్చుకొని దానివిషమంతా వదలకొట్టాలి"

"ఏం చెప్పనమ్మా! బ్రాహ్మణమనిషై ఉండికూడా అలాంటి పని ఏమిటి?"

"ఏమన్నా అంటే కంఠానికి ఉరి! కంఠానికిఉరి!" అన్నదొకతె

"మీకు" అన్నది భ్రమరి.

దాసీలంతా అప్పుడు ఒక్కకంఠ తో "మాదేంతప్పు? మేమేం చేశాం? ఎవరేంచేసినా తప్పుమాదేనా? మాకేం దిక్కులేకపోవటం మూలంగా చాకిరిచేసి పొట్టపోసుకుందామని వచ్చాం" ఇలాఅని వారిలో ఒకరిద్దరు ముఖానికి చెంగు అడ్డంపెట్టుకొని ఏడుపులు ప్రారంభిచారు. ఆఏడుపు కొడుకు చచ్చిపోయినవారి ఏడుపునికూడా మించిపోయింది. భ్రమరి గాభరాపడింది. కాని నవ్వునుమాత్రం ఆపుకోలేకపోయింది. "మీ

మెడలకు ఉరిఎందుకో తెలుసా? ఏం జరిగిందో ఎవ్వరూ చెప్పలేదు కనుక ....అసలుసంగతేమిటి? ఏం జరిగింది? అని అడిగింది.

అప్పుడు మళ్లీ నాలుగు వైపులనుంచీ నాలుగయిదురకాల గొంతులు వినిపించాయి. అతి కష్టం మీద-వాళ్ళ గందరగోళంలోని సారాంశాన్ని భ్రమరి ఇలా అని తెలుసుకుంది. రాత్రి పెద్దబాబుగారి గదిలో దొంగతనం జరిగిందట! కొందరు దొంగే నన్నారు. కాదు బందిపోటుదొంగ అన్నారు కొందరు. కన్నం వేశారన్నారు కొందరు. కాదు నలుగు రయిదుగురు దొంగలువచ్చి లక్షరూపాయలు కంపెని కాగితాలు ఎత్తుకుపోయారన్నారు మరికొందరు.

"తర్వాత? ఎవరి ముక్కు కోసుకువస్తానన్నది?" అని అడిగింది భ్రమరి.

"రోహిణీది-ఇం కెవరిది?"

"ఆ అభాగ్యురాలేనా దీని కంతికీ కారణం?

"అదేగా దొంగల ముఠాను వెంటపెట్టుకు వచ్చింది"

"గీత ఎలా ఉందో దాని చేతలూ అలాగే ఉన్నాయి"

"జైల్లో పడి చావనీ ఇహ"

"రోహిణి'దొంగతనం చెయ్యటానికి వచ్చిందని మీ కెలా తెలిసింది?" అని అడిగింది భ్రమరి.

"ఎలా ఏమిటి? పట్టుబడి కచేరీ హావిడి కొట్లో ఉందిగా!" భ్రమరి విన్నదంతా వెళ్ళి గోవిందలాల్‌కు చెప్పింది. గోవిందలాల్ ఆలోచించి తల తిప్పాడు.

"తల ఊగిస్తారేం?"

"రోహిణీ దొంగతనం చెయ్యటానికి వచ్చిందంటే నాకు నమ్మకం కలగటంలా. నీకు నమ్మకమేనా?"

"లేదు" అంది భ్రమరి.

"నీకెందుకు కలగటంలేదో చెప్పు చూదాం? లోకులంతా అంటున్నారుగా?"

"మీ కెందుకు నమ్మకం కలగటంలేదో చెప్పండి?"

"అది మరొకప్పుడు చెబుతాను. నీ కెందుకు విశ్వాసం కలగటం లేదో ముందు చెప్పు"

"మీరు ముందు చెప్పండి"

గోవిందలాల్ నవ్వుతూ "ముందు నువ్వు" అన్నాడు. "ముందు నేనెందుకు చెప్పాలి?"

"నాకు వినాలని కోరిక ఉంది"

"నిజంగా చెప్పనా."

"నిజంగా చెప్పు

భ్రమరి చెబుతా చెబుతా అంటూనే చెప్పలేకపోయింది. సిగ్గుతో తలవంచుకుని మెదలకుండా ఊరుకుంది.

గోవిందలాల్ గ్రహించాడు. ముందుగానే తెలుసుకున్నాడు. అందుకనే ఇంత తర్కించి తర్కించి అడిగాడు రోహిణి నిరపరాధిని అని భ్రమరికి దృఢవిశ్వాసం కలిగింది. తన జీవితంమీద భ్రమరికి ఎంత విశ్వాసమో-రోహిణి నిర్దోషిత్వం మీద కూడా అంత విశ్వాసం ఉంది ఆమెకు. కాని ఆ విశ్వాసానికి మరోకారణం లేదు-ఆమె నిర్దోషి అని నా విశ్వాసం అని గోవిందలాల్ అన్నాడుగా, అదేకారణం. గోవిందలాల్ విశ్వాసమే భ్రమరి విశ్వాస కూడా. గోవిందలాల్ అదగ్రహించాడు. భ్రమరిని అర్థం చేసుకున్నాడు. అంచేతనే ఆమెనల్లనిదైనా ఇంత ప్రేమిస్తున్నాడు.

గోవిందలాల్నవ్వుతూ "నేనుచెబుతాను - నువ్వురోహిణి పక్షం ఎందుకనో?" అన్నాడు.

"ఎందుకని?"

"ఆమె నిన్ను నల్లనిదానివని అనకుండా--నీది ఉజ్జ్వలమైన శ్యామ వర్ణం అంటుందని" భ్రమరి కోపంగా చూస్తూ "పోండి" అంది.

"పోతున్నాను" అని గోవిందలాల్ లేచాడు. భ్రమరి అతడి చొక్కా పట్టుకొని "ఎక్కడికి వెళుతున్నారు అన్నది?"

"ఎక్కడికి ... ... చెప్పు ..."

"ఈసారిచెప్పనా?"

"చెప్పుచూద్దాం"

"రోహిణిని రక్షించటానికి"

"అదే" అని గోవిందలాల్ భ్రమరి ముఖం ముద్దెట్టుకున్నాడు. పరదుఃఖకాతరుల హృదయం పరదుఃఖకాతరులే తెలుసుకోగలరు— అంచేతనే గోవిందలాల్ భ్రమరి ముఖం ముద్దెట్టుకున్నాడు.

---

# 11

గోవిందలాల్ కృష్ణకాంతరాయ్ కచేరీసావిడిలోకి వెళ్ళిప్రత్యక్ష మయినాడు.

కృష్ణకాంత్ ఉదయమే కచేరీలో కూర్చున్నాడు. కుషన్ కుర్చీలో కూర్చుని బంగారంతో చేసిన హుక్కాలో సువాసనపొగాకు వేసి, హుక్కా తాగుతూ - మర్త్యలోకంలో స్వర్గలోకాన్ని అనుకరిస్తున్నాడు. ఒకవైపున బొత్తులు బొత్తులుగా కట్టలుకట్టి. చిత్తాపుస్తకాలూ. ఆవర్జాలూ, రసీదు పుస్తకాలూ, పన్నులువేసిన నోటీసులూ జమా ఖర్చురోజు బుక్కులూ, ఉన్నాయి, మరొకవైపున గుమాస్తాలూ, దివానూ. ఓపరుసీరూ. తహసీలుదారూ, ఎకౌంటెంటూ, అమీనా, పూప్రసన్యాజలూ ఉన్నారు. ఎదురుగా తలవంచుకుని అవగుంఠనంతో ఉన్నరోహిణి.

ప్రియమైన తమ్ముడికొడుకు గోవిందలాల్ లోపలప్రవేశిస్తూనే "ఏంజరిగింది పెదనాన్నగారూ?" అని ప్రశ్నించాడు.

అతడి కంఠస్వరం విని రోహిణి అవగుంఠనాన్ని రవంత తొలగించుకుని అతడికేసి ఒక్క క్షణం చూసింది. కృష్ణకాంత్ తన ప్రశ్నకు ఏం సమాధాన మిచ్చాడో దాన్ని అంత శ్రద్ధగా వినలా. ఆ 'చూపుకు అర్థం ఏమిటా?" అని ఆలోచిస్తున్నాడు. చివరకు ఈభయదృష్టికి అర్థం 'భిక్షే' నని నిర్ధారణ చేసుకున్నాడు.

"ఏంభిక్ష?" ఆర్తులకు మరే భిక్ష కావలసి ఉంటుంది? అని ఆలోచించాడు. ఆపదనుంచి రక్షింపబడటం. ఆ చెరువుగట్టున మెట్లమీద

నుంచుని ఏం మాట్లాడిందో గోవిందలాల్‌కు ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. నీకు ఏ విషయంలో కష్టం సంభవించినా, ఇవాళకానీ, రేపుకానీ, నాకు తెలియచెయ్యి'' అన్నాడు గోవిందలాల్. ఇవాళ రోహిణికి నిజంగా కష్టమే ప్రాప్తించింది. రోహిణి ఈ ఇంగితాన్నే సూచించి ఉంటుందని గ్రహించాడతను.

"నీకు శుభాన్ని కోరటమే నా వాంఛ. ఎందుకనంటే నీకు ఇహ లోకంలో సహాయం చేసేవారు ఎవ్వరూ లేకపోవటం కనిపిస్తూనే ఉంది. కాని నువ్వు ఎవరి చేతుల్లోపడ్డావో వారినుంచి రక్షించటం సులభంకాదు" అని ఆలోచించుకుంటూనే గోవిందలాల్ "ఏం జరిగింది పెదనాన్న గారూ?" అని ప్రశ్నించాడు.

వృద్ధుడైన కృష్ణకాంత్ జరిగిందంతా అనుపూర్వికంగా చెప్పాడు. కాని అతడు రోహిణి చూపుతో కలవరపడుతున్నాడేమో, అతడి చెవులకు ఏమీ వినిపించలా. "ఏం జరిగింది పెదనాన్నగారూ'' అని మళ్ళీ అడిగాడు తమ్ముడికొడుకు. అదివిని వృద్ధుడు "జరిగింది! ఈ పెద్దకుంక దాని ముఖం చూసి అంతా మరచిపోయాడు' అనుకున్నాడు మనస్సులో. మళ్లీ అనుపూర్వికంగా క్రితం రాత్రి జరిగిన గాథ యావత్తు గోవింద లాల్‌కు వినిపించాడాయన చివరికి "ఆ దౌర్భాగ్యపు పనిచేసిన నీచు రాలు యిదే. ఇది వాటి దగ్గర దబ్బులిని దొంగవీలు అక్కడపెట్టి అసలు వీలునామా ఎత్తుకుపోవాలని వచ్చింది. తర్వాత పట్టుపడే సమయంలో ఆ మాయ వీలునామా చించి పారేసింది" అన్నాడు.

"రోహిణి ఏమంటుంది?"

"అదేమంటుంది ఇంక? అదికాదంది"

గోవిందలాల్ రోహిణికేసి తిరిగిచూసి, "అదికాకపోతే మరి ఇంకేమిటి రోహిణీ?'' అనిఅడిగాడు.

రోహిణి ముఖంపైకెత్తకుండా గద్గదకంఠంతో — "నేను మీచేతుల్లోపడ్డాను. ఏదిచేస్తే అదిచెయ్యండి. నేనింకేమీచెప్పను'' అన్నది

"మాటాడవు దుర్మార్గురాలా?" అన్నాడు కృష్ణకాంత్.

"ఈపృథివిలో అంతా దుర్మార్గులు కారు. వీళ్ళతో దుర్మార్గం కాకుండా ఇంకేదయినా కొంత ఉంటుంది'' అని మనస్సులోఅనుకొని పైకి "ఈమెకు ఏమనిఆజ్ఞాపించారు! ఠాణాకు పంపుతారా? అన్నాడు.

"నాదగ్గరఇంక ఠాణాఏమిటి? కోర్టుఏమిటి? నేనేమేజస్ట్రీటును. నేనేజడ్జిని పైగాఈఘవస్త్రీని జైలుకు పంపించటంమాత్రం మనకేమంత పౌరుషం? అన్నాడు కృష్ణకాంత్.

"అయితే ఏంచేస్తారు?'' అని అడిగాడు గోవిందలాల్.

"తలగొరిగించి సున్నపుబొట్లు పొడిపించి డప్పుకొంచిపైటకు పంపిస్తాను మన ఎస్టేటులో యింకఅడుగు పెటగూడదు."

గోవిందలాల్ మళ్ళీ రోహిణికేసి చూసి "ఏమంటావు రోహిణి?'' అనిఅడిగాడు.

"నష్టమేమిటి?'' అంది రోహిణి.

గోవిందాలాల్ విస్మితుడైనాడు. కాస్సేపు ఆలోచి చి కృష్ణకాంతు నితో'' నా దొక విన్నపం అన్నాడు.

" ఏమిటి ? "

"ఈమెను ఒకసారి విడిచిపెట్టండి. నేను జామీను ఉంటాను. పది గంటలకు మళ్లీ తీసుకొచ్చి అప్పగిస్తాను'' అన్నాడు గోవిందలాల్.

"అనుకున్నంతా జరిగింది'' అని మనస్సులో అనుకొని, ఎక్కడికి వెడుతుంది? ఎందుకు వదలిపెట్టటం?'' అన్నాడు పైకి కృష్ణకాంత్

"అసలు సంగతి ఏమిటో తెలుసుకోట చాలా అవసరం. ఇంత మంది ఎదుట ఈమె అసలు సంగతి చెప్పదు. ఈమెను ఒకసారి లోపలికి తీసుకువెళ్ళి అడిగి తెలుసుకుంటాను'' అన్నాడు గోవిందలాల్

"దానికి శిరోముండను చేయించాల్సిందే. ఈ కాలపువాళ్ళు మరీ హద్దుమీరి పోతున్నారు. లేకిపనులు-పిల్లా! నేనూ వాళ్ళపని ఒకసారి పట్టి చూస్తాను'' అని మనస్సులో అనుకొని, 'సరే' అని కృష్ణకాంత్ ఒక బంట్రోతును పిలిచి "ఒరేయ్! దీనికి ఒక దాసీదాన్ని తోడుయిచ్చి పారిపోకుండా చూస్తూ మా చిన్న కోడలి దగ్గిరకు పంపుదాన్ని!'' అన్నాడు.

ఆట ద్రోతు రోహిణిని వెంటపెట్టుకుని వెళ్ళాడు. గోవిందలాలూ కదిలాడు అక్కడనుంచి. "దుర్గా! దుర్గా! పిల్లలు ఇలా అయిపోతు న్నారేం?" అనుకున్నాడు కృష్ణకాంత్.

---

# 12

. గోవిందలాల్ అంతఃపురములోకివచ్చిచూసేసరికి, భ్రమరి రోహి ణిని దగ్గరపెట్టుకుని మెదలకుండా కూర్చునిఉంది. మంచి మంచి మాటలు చెబుదామనుకుందికాని, ఏది చెప్పబోయినా రోహిణికి ఏడుపువస్తోంది అంచేత ఏమీ మాట్లాడలేకపోయింది. గోవిందలాల్ రావటం చూసేసరికి భ్రమరికి తన బాధ్యత ఏదో వదలిపోయినట్లుంది. అతడు ఇంకా దూరంగా ఉండగానే చటుక్కున రమ్మని సంజ్ఞచేసి పిలిచింది. గోవింద లాల్ భ్రమరి దగ్గిరకు వెళ్ళాడు". రోహిణి ఇక్కడ ఎందుకు?" అని భ్రమరి రహస్యంగా అడిగింది అతడ్ని.

"నేను ఆమెను చాటుగా కొంచెం అడిగి తెలుసుకోవాలి తర్వాత ఆమె మొహాన ఎలా రాసిపెట్టిఉంటే అలా జరుగుతుంది" అన్నాడు గోవిందలాల్.

"ఏమి అడుగుతారు?"

"ఆమె మనస్సులో ఉన్న సంగతి నన్ను ఒంటరిగా ఇక్కడ ఉండనిచ్చి వెళ్ళటం నీకు భయమయితే—ఫరవాలేదు, చాటున నుంచుని విను"

భ్రమరి తెల్లబోయింది. సిగ్గుతో తలవంచుకుని అక్కడనుంచి పారిపోయింది. సరాసరి వంటయింట్లోకి వె. వెనకాలనుంచి వంట లక్క జడలకుముడుతూ 'వంటచేస్తున్నావా అవ్వా?' వంట చేస్తూ చేస్తూ ఏవయినా కథలుచెప్ప రాదూ? అంది.

ఇక్కడ గోవిందలాల్ "ఈ విషయం ప్రత్యేకించి నాకు చెబుతావా?" అని అడిగాడు చెప్పాలని రోహిణికే మనస్సు తత్తరపడుతోంది. అయినా బ్రతికి ఉండగానే మండుతున్న చితిలో దూకే ఆర్యకన్యకే రోహిణి కూడా.

"బాబుగారి దగ్గిర ఏం విన్నారు?" అంది.

"ఆయన చెప్పటం—నువ్వు మాయపీలునామా తెచ్చిపెట్టి, అసలు వీలునామా తీసుకువెళ్ళటానికి వచ్చావంటారు అంతేనా?"

"అది కాదు"

"అయితే మరేమిటి?"

"చెబితే లాభమేమిటి?"

"నీకు శుభం కలగవచ్చు"

"మీరు విశ్వసించగలరా?"

"విశ్వాసయోగ్యమైన సంగతి అయితే ఎందుకు విశ్వశించను?"

"విశ్వాసయోగ్యమైనది కాదు"

"నా దగ్గిర ఏది విశ్వాసనీయమో. ఏది అవిశ్వాసనీయమో అది నాకు తెలుసుకాని నీ కెలా తెలుసు? అవిశ్వాసనీయమైనదాన్ని కూడా నేను అప్పుడప్పుడు విశ్వసిస్తూ ఉంటా" "లేకపోతే నేను మీ కోసం ఎందుకు చావటానికి సిద్ధపడతాను? ఏమయితే అయింది, నే నెటూ చావటానికి సంసిద్ధురాలనయినాను" అని మనస్సులో అనుకుని పైకి "అది మీ ప్రభావమే. కాని మీకు ఈ విషాదగాథ చెప్పటంవల్ల ఏం లాభం?" అంది.

"నీకు నేనేదయినా ఒకవేళ ఉపకారం చేయకలుగుతానేమో!"

"ఏమి ఉపకారం చేస్తారు?"

"ఇలాంటివారు అరుదు. ఏమయితే యేం—ఈమె చిక్కుల్లో ఉంది. ఈమెను సులభంగా వదిలిపెట్టకూడదు" అని మనస్సులో అనుకుని "వీలయితే నేను ఆయన్ని బ్రతిమాలుతాను. ఆయన నిన్ను విడిచిపెడతారు" అన్నాడు పైకి.

"ఒకవేళ మీరునన్ను గురించి బ్రతిమాలారే అనుకోండి. అప్పుడు వారు నన్నేంచేస్తారు?"

"విన్నావుగా?"

"నాకు శిరోముండనంచేయించి, సున్నపుబొట్లు పొడిపించి ఊళ్లో నుంచి వెళ్ళకొట్టిస్తారు. ఇందులో ఉన్న మంచి ఏమిటో, చెడు ఏమిటో

తెలుసుకోలేక పోతున్నాను. ఈ కళంకంకన్న ఊరునుంచి వెళ్ళకొట్ట టమే తెలుసుకోలేకపోతున్నాను. ఈ కళంకంకన్న ఊరునుంచి వెళ్లకొట్టటమే ఉపకారమవుతుంది నాకు. నన్ను వెళ్ళకొట్టించక పోతే నాఅంతట నేను వెళ్లిపోతాను. మళ్లీ ఈఊళ్లో ముఖమెత్తుకుని ఎలాతిరగ గలను? సున్నపుబొట్లు పొడిపించటం ఏమంత పెద్ద శిక్షకాదు—కడు క్కుంటే పోతాయి. ఇక మిగిలిందల్లా ఈజుట్టు—'' అని రోహిణి ఒక్కసారి తరంగాలుతాగా గాలికి పైకి లేచిన జుట్టుకేసి చూసుకుని— "ఈ జుట్టు--మీరు కత్తెర తెప్పించండి--మీ భార్యకు సవరంగా కట్టించు కోటానికి కత్తిరించి యిస్తాను'' అంది.

గోవిందలాల్ వ్యవధితుడయి దీర్ఘంగా నిట్టూర్చి "గ్రహించాను రోహిణీ! కళంకమే నీకుశిక్ష! ఆశిక్షను తప్పించుకోటానికి వీల్లేనప్పుడు మరొకశిక్షవల్ల నీకువచ్చే నష్టమేమీలేదు" అన్నాడు.

రోహిణి ఈసారి ఏడ్చింది, గోవిందలాల్‌కు మనస్సులో సహస్ర ధన్యవాదాలు అర్పించి, "ఒకవేళ గ్రహించినట్లయితే అడుగుతున్నా— ఈకళంక శిక్షనుంచి నన్ను రక్షించగలరా మీరు" అంది.

గోవిందలాల్ కాస్సేపాలోచించి "చెప్పలేను కాని అసలుసంగతే మిటో వింటే రక్షించగలనో లేదో చెప్పగలను" అన్నాడు.

"ఏమి తెలుసుకోవాలనుకుంటున్నారో అడగండి''

"నువ్వు తగలపెట్టిన కాగితమేమిటి?''

"దొంగవీలునామా''

"ఎక్కడ దొరికింది అది?''

"బాబుగారి గదిలో—డ్రాయరులో''

"ఆవీలునామా అక్కడికి ఎలా వచ్చింది?"

"నేనే తీసుకొచ్చి పెట్టాను. అసలు వీలునామా రాసిననాడు రాత్రే- దాన్ని దొంగిలించి ఇది అక్కడ పెట్టివచ్చాను''

"ఎందుకు పెట్టావ్? దానివల్ల నీకేంలాభం?''

"హరలాల్ బాబు బ్రతిమాలటం మూలంగా....?''

"అయితే మరి మళ్ళీ నిన్నరాత్రి ఎందుకువచ్చావ్?"

"అసలు వీలునామా మళ్ళీ అక్కడపెట్టి. ఆ మాయ వీలునామా దొంగిలించటానికి...."

"ఎందుకు? ఆ మాయవీలునామా ఉంటేప ?"

"హరలాల్‌కు పన్నెండణాలవాటా—మీకు ఒక కానీ వాటా...."

"మళ్ళీ ఆ వీలునామా మార్చటానికి ఎందుకు వచ్చావ్ ? నేను నిన్నేమీ బ్రతిమాలలేదే!"

రోహిణి ఏడవటం మొదలెట్టింది. ఆ ఏడుపును అతిప్రయత్నం మీద ఆపుకుని, "లేదు-మీరు బ్రతిమాలలేదు. నేను ఈ జన్మలో ఇంత వరకు పొందనిదీ, ఇహముందు పొందలేనిది-అది మీరు నాకుయిచ్చారు-" అంది.

"ఏమిటది రోహిణీ?"

"ఆ వారుణీ చెరువుఒడ్డున—జ్ఞాపకంతెచ్చుకోండి"

"ఏమిటి రోహిణీ?"

"ఏమిటా? అది ఏమిటో ఈ జన్మలో చెప్పలేను. ఇంకేమీ అడగకండి. ఈ వ్యాధికి చికిత్సలేదు—నాకు ముక్తిలేదు, నాకు విషం కనుక దొరికితే త్రాగుతాను. కాని అది మీ యింట్లో ఉండిమాత్రం కాదు. మీరు నాకేం ఉపకారం చెయ్యలేరు. కాని ఒక్క ఉపకారం మాత్రం చెయ్యగలరు—ఒక్కసారి వదిలిపెట్టండి నన్ను—మనసారా ఏడ్చి వస్తాను. ఆ తర్వాత ఇంక నేను బ్రతికిఉంటే—నాకు శిరోముండనంచేయించి, ఊళ్ళోంచి వెళ్ళగొట్టండి. నన్ను"

గోవిందలాల్ గ్రహించాడు. అద్దంలో ప్రతిబింబంలాగా రోహిణి హృదయాన్ని చూడగలిగాడు. ఏ మంత్రంవల్ల భ్రమరి ముగ్ధురాలైందో- ఆ మంత్రంవల్లనే ఈఆడత్రాచు కూడా ముగ్ధురాలైంది. అతడికి సంతోషమూ కలగలా, కోపమూరాలా అతడి హృదయం దయారసంతో వెల్లివిరిసింది.. "నీకు మరణమే మంచిది రోహిణీ! కాని అందులో లాభమేమీ లేదు అందరూ తమ పనులు తాము చేసుకోటానికి వచ్చినవారే ఈ లోకంలోకి. వాళ్ళ పనులు వాళ్ళు చేసుకోకనే చావటం ఎందుకు?" గోవిందలాల్ కొంచెం సంకోచించాడు.

"చెప్పరే?" అంది రోహిణి.

"నిన్ను ఈ ఊరు నుంచి పంపించి వెయ్యాల్సిందే"

"ఎందుకు?"

"ఈ ఊరు వదిలిపోవాలనుకుంటున్నా నని నువ్వే చెప్పావుగా !"

"అభిమానంవల్ల చెప్పాను నేను. మీ రెందుకు చెప్పారు?"

"నువ్వూ నేనూ కలునుకోకుండా, మాట్లాడకుండా ఉండాలని"

గోవిందలాల్ అంతా గ్రహించాడని రోహిణి తెలుసుకుంది. లోపల్లోపల చాలా చిన్నపుచ్చుకుంది-చాలా సంతోషించిందికూడా తన విచారాన్నీ బాధనీ అంతా మరచిపోయింది ఆమెకు మళ్లీ బ్రతుకుమీద తీపి ఏర్పడింది. మళ్లీ ఆ ఊళ్లోనే ఉండాలనే వాంఛ మొలకెత్తింది, మనుష్యుడు కేవలం పరాధీనుడు సుమా !

"నేను వెళ్ళటానికి ఇప్పుడైనా సిద్ధమే కాని ఎక్కడికి వెళ్ళను?

"కలకత్తా వెళ్ళు. అక్కడ నా స్నేహితుడి కొకడికి ఉత్తరం రాసి ఇస్తాను. అతడు నీకో ఇల్లు కొని యిస్తాడు. నీ డబ్బు ఏమీ ఖర్చు పెట్టుకో అక్కర్లేదు."

" మా బాబయ్య ఏమవుతాడు?"

"అతడు నీతోనేవస్తాడు లేకపోతే నిన్నుకలకత్తావెళ్ళమని చెప్పేవాణ్ణికాను"

"అక్కడమాకు రోజులెలా గడుస్తాయి?"

"నాస్నేహితుడు మీ బాబయ్యకు ఒకనౌకరీ కుదిర్చిపెడతాడు"

"బాబయ్య ఈఊరు విడిచిపెట్టడానికి ఎందుకు ఒప్పుకుంటాడు"

"నువ్వు అయన్ని ఈవిషయంలో ఒప్పించలేవా?"

"ఒప్పించగలను కాని మీ పెదనాన్నగారిని ఎవరు ఒప్పిస్తారు వారు మమ్మల్ని ఎందుకువిడిచిపెడతారు?"

"నేను బ్రతిమాలతాను"

"అలాఅయితే నాకు ఈకళంకంమీద మరొకకళంకం. ఆకళంకం మీకుకొంత అంటుతుంది"

"నిజమే నీకోసమని పెదనాన్నగారిని భ్రమరి బ్రతిమాలుతుంది నువ్వు యిప్పుడే భ్రమరి ఎక్కడుందో వెళ్ళివెదుకు. ఆమెను అక్కడకు పంపించి నువ్వు ఇక్కడేవుండు—పిలిస్తే వెళ్ళవచ్చు"

రోహిణి సజలనయనాలతో గోవిందలాల్‌కేసి చూస్తూ భ్రమరిని వెతకటానికి వెళ్లింది. ఇలాంటి కళంకంలో—బంధనంలో రోహిణి మొదటి ప్రేమసంభాషణ జరిగింది.

---

# 13

భ్రమరి మామగారిదగ్గిరకువెళ్ళి ఆయన్ని బ్రతిమాలటానికి ఏమాత్రం ఒప్పుకోలా ఛీః అని సిగ్గుపడిపోయింది.

ఇహతప్పనిసరిగా గోవిందలాల్ కృష్ణకాంత్ దగ్గిరకువెళ్ళాడు. కృష్ణకాంత్ అప్పుడే భోజనంచేసి మంచంమీద చేరగిలపడుకొని హుక్కాగొట్టం చేతిలోవుంచుకొని నిద్రపోతున్నాడు అతడి మనస్సు నల్లమందు ప్రభావంవల్ల ములోకాలూతిరిగి రాగలిగిన గుర్రాన్నిఎక్కి నానాప్రదేశాల్లోనూ పర్యటనచేస్తోంది. చంద్రబింబంలాంటి రోహిణిముఖం ముసలివాడిమనస్సులో ప్రవేశించిందలేదుంది--అవును చంద్రుడు ఎక్కడ ప్రకాశించడు? లేకపోతే ముసలివాడు నల్లమందుమత్తులో ఇంద్రాణీభుజం మీద తలఎందుకు వాలుస్తాడు—'రోహిణి హటాత్తుగా శచీదేవిఅయి ఈశ్వరుని గోశాలనుంచి ఎద్దును దొంగతనంగా తోలుకుపోతుంది నంది త్రిశూలం చేతపుచ్చుకొని ఆఎద్దుకు మేతవెయటానికనివెళ్ళి ఆమెను పట్టుకున్నాడు? నంది రోహిణి జుట్టునుపట్టుకొనిలాగుతున్నాడు. కుమారస్వామి నెమలి—మోకాళ్ళవరకు వేలాడుతున్న ఆమెజడను పాముఅనే భ్రమతో మ్రింగుదామని బయలుదేరింది. ఆసమయంలో కుమారస్వామి ఈనెమలి దౌష్ట్యాన్నిచూచి, ఈశ్వరునిదగ్గరకు ఫిర్యాదుచెయ్యటానికివచ్చి "పెదనాన్నగారు" అని పిలుస్తున్నాడు— ఈ దృశ్యాన్ని చూస్తున్నాడు కృష్ణకాంత్.

కృష్ణకాంత్ విస్మితుడై "కార్తికేయుడు ఈశ్వరుణ్ని ఏవరసను పురస్కరించుకొని "పెదనాన్న" అనిపిలుస్తున్నాడా?" అని ఆలోచించ

సాగాడు. ఆసమయంలో కార్తికేయుడు మళ్ళీ పెదనాన్నగారూ అనిపిలి చాడు. కృష్ణకాంత్ చాలాకోపంతెచ్చుకొని, ఆకార్తికేయుని చెవిమెలేద్దా మనేఉద్దేశంతో చెయ్యిఎత్తాడు. అప్పుడు అతనిచేతిలోఉన్న హుక్కా-గొట్టంజారి పాన్‌దాన్‌మీద పడింది. అది పీకదాన్‌మీదపడి—మొత్తానికి మూడు ఒక్కసారి క్రిందపడి ధన్‌మని చప్పుడయింది. ఆచప్పుడుతో కృష్ణకాంత్‌కు మెళుకువవచ్చింది. అతడు కళ్ళుతెరచిచూచేసరికి నిజం గానే కార్తికేయుడు అక్కడ ప్రత్యక్షమైఉన్నాడు మూర్తిమంతుడైన స్కందవీరునిలాగా గోవిందలాల్ అతనిఎదుట నిలబడి "పెదనాన్న గారూ' అనిపిలుస్తున్నాడు. కృష్ణకాంత్ గాబరాగా లేచిహార్చుని" ఏమిటి నాయనా! గోవిందలాల్?" అన్నాడు. గోవిందలాల్ అంటే ముసలాయనకు మహాఅపేక్ష.

గోవిందలాల్ కూడ కొంచం కంగారుపడి "మీరు నిద్రపొండి. నేనేమంత పనిమీద రాలేదిప్పుడు" అని ఆపీకదాన్ ఎత్తి సరిగ్గాపెట్టి పాన్‌దాన్ కూడా యదాస్థానములోవుంచి. హుక్కా-గొట్టం కృష్ణకాంత్ చేతికి అందించాడు. కృష్ణకాంత్ ఎంతముసలివాడయినా—అంత అమా యకుడుకాదు. ఏంలేదు—ఈ కుర్రసన్యాసిమళ్లీ ఆచంద్రముఖి సంగతి చెప్పటానికేవచ్చాడు, అనుకొని "లేదు నానిద్రఅయిపోయింది—ఇంక రాదు" అన్నాడుపైకి.

గోవిందలాల్ కొంచెం ఇరుకునపడ్డాడు. రోహిణి సంగతి ప్రొద్దున కృష్ణకాంత్ దగ్గిర చెప్పటానికి అతడేమీ సిగ్గుపడలా ఇప్పుడు కొంచెం సిగ్గుపడసాగాడు. చెబుదాం చెబుదాం అనుకుంటూనే ఏమీ చెప్పలేకపోయాడు రోహిణితో చెరువుఒడ్డున మాట్లాడినందుకు ఇప్పుడు సిగ్గెందుకు?

ముసలాయన ఈ వైఖరి చూస్తున్నాడు. గోవిందలాల్ ఏమీ మాట్లాడక పోవటం చూసి, ఆయనే తన జమీందారీ సంగతి ఎత్తుకుని, ఆ తర్వాత సంసారపు గొడవలూ, దాని తర్వాత వ్యాజ్యాల సంగతీ చెప్ప సాగాడు, కాని అప్పుడు కూడా రోహిణి ప్రసంగం తీసుకురాలా. గోవిం దలాల్ రోహిణి విషయం ఏమీ ఎత్తలేకపోయాడు, కృష్ణకాంత్ ముసి ముసి నవ్వులు నవ్వుకోసాగాడు. ముసిలాయన మహాఅసాధ్యుడు

విధిలేక గోవిందలాల్ పెదవాడుని వెనక్కితిరిగాడు, అప్పుడు

కృష్ణకాంత్ ప్రియతముడైన తమ్ముడి కొడుకును వెనక్కి పిలిచి, "నువ్వు ప్రొద్దున రోహిణికి జామీనువుండి తీసుకువెళ్ళావుకదా, అది ఏమయినా ఒప్పుకున్నదా ఆ విషయం?'' అని అడిగాడు

అప్పుడిహ గోవిందలాల్ కాస్తతేరుకుని, రోహిణి చెప్పినదంతా సంక్షేపంగా చెప్పాడు. చెరువు ఒడ్డున తమ సంభాషణ విషయంమాత్రం రహస్యంగా ఉంచాడు. "ఇప్పుడు ఆమెవిషయంలో ఏంచేద్దామని నీవుద్దేశం?'' అని అడిగాడు కృష్ణకాంత్.

గోవిందలాల్ సిగ్గుపడి "మీఅభిప్రాయమేమిటో నాయభిప్రాయము అదే'' అన్నాడు.

కృష్ణకాంత్ లోపల నవ్వుకున్నాడు. ఆనవ్వులక్షణాలు పైకికన్పడనీయలా. నాకు దానిమాటలమీద నమ్మకం కలగటంలా. దానికి శిరోముండనంచేయించి, సున్నంపూయించి ఊరేగించి వెళ్లకొట్టిస్తాను. ఏమంటావ్'' అన్నాడు,

గోవిందలాల్ మెదలకుండా ఊరుకున్నాడు. అప్పుడు—"దాని తప్పు ఏమీలేదనే ఊహ కనుక నీకునిజంగా కలిగితే విడిచిపెట్టు'' అన్నాడు కృష్ణకాంత్.

గోవిందలాల్ నిట్టూర్చి ముసలివాడి చేతిలోంచి బైటపడ్డాడు.

---

# 14

గోవిందలాల్ అనుమతి ప్రకారం రోహిణి పినతండ్రితో కూడా ఊరువదలి పెట్టిపోవటానికి ఏర్పాట్లూ అవీచేసుకోటానికివచ్చి పినతండ్రికి ఈవిషయం చెప్పకుండానే సావట్లో చతికిలపడి ఏడుస్తూ కూర్చుంది. "ఈ హరిద్రా గ్రామంనేను విడిచిపెట్టిపోను—అసలేచూడకపోతే చచ్చిపోతాను. నేనుకలకత్తావెడితె గోవిందలాల్ కనుపించడుగా? నేనువెళ్ళను ఈఊరేనాకు స్వర్గం మోక్షమూను ఇక్కడే గోవిందలాల్ గృహం. ఈ ఊరే నాకు స్మశానం కూడా. ఇక్కడే చచ్చిపోతాను. నేను ఒకవేళ ఈ ఊరు వదలి వెళ్ళకపోతేమాత్రం ఏం చేస్తారేమిటి? కృష్ణకాంత్

రాయ్ నాకు శిరోముండనం చేయించి నన్ను ఊరోడ్చించి వెళ్ళగొట్టేసాడా? నేను మళ్ళీ వస్తాను; గోవిందలాల్‌కు కోపం వస్తుందా? వస్తేరానీ— అయినా నేను అతణ్ణి కళ్ళారా చూడగలుగుతానుగా! నా గ్రుడ్లు పీకించడుకదా! నేను వెళ్లను-నేను కలకత్తా పోను-ఎక్కడికీపోను. వెడితే ఇహ యమలోకానికి తప్ప ఎక్కడికి పోను''

ఇలా నిశ్చయించుకుని రోహిణి లేచి, తలుపు తెరిచి మళ్ళీ దీపం మీద పడబోయే మిడతలాగా—గోవిందలాల్ ఇంటికే బయలుదేరింది. వెడుతూ మనస్సులో ఇలా అనుకోసాగింది. "జగదీశ్వరా! దుఃఖితులకు నీ వొక్కడివే సహాయుడివి. నేను దుఃఖితురాలిని. అంతులేని దుఃఖములోపడి కొట్టుకుంటున్నాను—నన్ను రక్షించు. నా హృదయంలోని ఈ సహించలేని ప్రేమాగ్నిని చల్లార్చు నన్ను మాత్రం దగ్ధం చెయ్యకు నేను ఎవరినయితే చూడటానికి వెడుతున్నానో—అతన్ని ఎన్నిసార్లు చూస్తే అంతబాధ—అంతసుఖమూను. నేను విధవను. నాకు ధర్మం పోతోంది, సుఖశాంతులు లేకుండా పోతున్నాయి. చివరకు ప్రాణాలు కూడా పోతున్నాయి. ఇంక నాకు మిగిలింది కానీ, నేను మిగుల్చుకో వలసింది కానీ ఏ ముంది ప్రభూ? హే భగవాన్ దుర్గా! కాళీ! జగన్నాథ! నాకు సద్బుద్ధిని కలిగించండి నా ప్రాణాలను కుదుటపడేటట్లు చెయ్యండి. ఈ బాధ ఇంక భరించలేను నేను.

అయినా ప్రేమ పరిపూర్ణమైన ఆమె హృదయం శాంతించలా. విషం త్రాగుదామనుకుంది కాస్సేపు. గోవిందలాల్ కాళ్ళ మీదపడి తన మనస్సును విప్పిచెప్పుకుందామనుకుంది కాస్సేపు. పారిపోదామనుకుంది కాస్సేపు. వారుణీ చెరువులోపడి చద్దామనుకుంది మరికాస్సేపు. ధర్మానికి జలాంజలివదలి గోవిందలాల్‌ను లేవదీసుకుని, పరదేశం పారిపోదామనుకుంది కొంతసేపు. రోహిణి ఏడుస్తూ మళ్ళీ గోవిందలాల్ ఎదుట ప్రత్యక్షమయింది.

"ఎందుకు? కలకత్తా వెళ్లటానికి నిశ్చయించుకున్నావుగా?" అని అడిగాడు గోవిందలాల్,

"లేదు''

"అదేమిటి? ఇప్పుడేగా నాదగ్గిర ఒప్పుకున్నావు?''

"వెళ్ళలేను''

"నేను చెప్పలేను బలవంతం చేసేందుకు నాకేం అధికారం లేదు కాని వెళ్ళటం మంచిది''

"ఎవరికి మంచిది?''

గోవిందలాల్ తలవంచుకున్నాడు ఏసంగతిఅయినా స్పష్టంగా విప్పి చెప్పటానికి ఎవరుతాను?

రోహిణి కన్నీళ్ళు చాటుగా తుడుచుకుంటూ ఇంటికి తిరిగి వెళ్ళింది. గోవిందలాల్ ఎంతో విచారంతో ఆలోచించసాగాడు. అప్పుడు భ్రమరి అక్కడికి వచ్చి "ఏమిటాలోచిస్తున్నారు?" అన్నది.

"చెప్పుకో చూద్దాం"

"నా నలుపును గురించి—''

"ఛీ!''

భ్రమరి విపరీతమైన కోపం తెచ్చుకుని. "అదేమిటి? నన్ను గురించి ఆలోచించటంలేదా? నేను తప్ప ప్రపంచంలో మీకు మరో ఆలోచన ఏముంది?'' అంది.

"ఉండకపోవటమేం? నేను మరో మనిషిని గురించి ఆలోచిస్తున్నా''

భ్రమరి గోవిందలాల్ మెడకు చేతులు పెనవైచి ముఖం ముద్దెట్టుకుని. దగ్గరకు జరిగి, నవ్వుతూ "మరో మనిషా?—ఎవరో చెప్ప రామా?'' అంది.

"నీకు చెబితే ఏం లాభం?"

"చెప్పరా!''

"నీకు కోపం వస్తుంది''

"వస్తే వస్తుంది—చెప్పరాదూ"

"వెళ్లి అందరి భోజనాలూ అయినాయో లేదో చూసిరా''

"చూసివస్తాలెండి—చెప్పరా ఎవరో!"

" ... ... రోహిణిని గురించి ఆలోచిస్తున్నా"

"రోహిణిని ఎందుకాలోచిస్తున్నారు?"

"అది నాకేం తెలుసు?''

"తెలుసు చెప్పండి"

"మనిషి—సాటిమనిషిని గురించి ఆలోచించకూడదా?"

"ఊహూ! ఎవర్ని ప్రేమిస్తారో వాళ్ళనిగురించే ఆలోచించాలి. నన్ను మీరు—మిమ్మల్ని నేను—".

"అయితే నేను రోహిణిని ప్రేమిస్తున్నా"

"అబద్ధం—మీరు నన్నే ప్రేమించాలి. ఇంకెవర్నీ ప్రేమించ కూడదు. రోహిణిని ఎందుకు ప్రేమిస్తున్నారో చెప్పండి"

"విధవయి మత్స్యాలు తినవచ్చా?"

"కూడదు"

"కూడదు నిజమే. అయితే మరి రాక్షసితల్లి తింటుందేం?"

"దౌర్భాగ్యురాలు, ఏది చెయ్యకూడదో అదే చేస్తుందావిడ"

"నేనూ అలాంటివాడినే. చెయ్యకూడనిదే చేస్తాను. రోహిణిని ప్రేమిస్తున్నాను"

చటుక్కున గోవిందలాల్ బుగ్గమీద ఒక్క చిటికె వేసింది భ్రమరి మళ్ళా కోపం తెచ్చుకుని "నేను శ్రీమతి భ్రమరీదేవిని—నాదగ్గిరే అబద్ధాలా?" అంది.

గోవిందలాల్ అపజయాన్ని అంగీకరించాడు భ్రమరి భుజాల మీద చేతులువేసి, నల్లకలువలాంటి ఆమె మొఖాన్ని చేతుల్తో పట్టుకుని మృదువుగానూ, గంభీరంగానూ "అబద్ధమే భ్రమరీ! నేను రోహిణిని ప్రేమించటంలా. రోహిణే నన్ను ప్రేమిస్తోంది" అన్నాడు.

గబుక్కున గోవిందలాల్ చేతుల్లోంచి ముఖాన్ని తప్పించుకుని, భ్రమరి దూరంగా వెళ్ళి నుంచుని ఆయాసపడుతూ- "దౌర్భాగ్యురాలు కోతిముండ-చావాలి-చావాలి-" అని తిట్టడం మొదలెట్టింది.

గోవిందలాల్ నవ్వుతూ "అంత తిడతావెందుకు? నీ ఏడువారాల సొమ్ముల్లో ఒక్క నగయినా ఎత్తుకుపోలేదుగా ఆమె" అన్నాడు.

భ్రమరి కొంచెం నిర్చేష్టురాలై- "పోండి అదేమిటి? దానిసంగ్లి ఏమన్నతుంది? అది మీ ఎదుటపడి ఎందుకు మాట్లాడాలి?" అన్నది.

"నిజమే భ్రమరీ! మాట్లాడటం అంత మంచిదికాదామెకు- అదే ఆలోచిస్తున్నా. ఈ ఊళ్ళో మకాం ఎత్తేసి కలకత్తా వెళ్ళి ఉండమని

చెప్పాను ఆమెకు. ఆమెకు అప్పు ఇవ్వటానికికూడా ఒప్పుకున్నాను"

"తర్వాత?"

"తర్వాత-ఆమె ఒప్పుకోలా"

"సరే నేను ఆమెకు ఓ సలహా ఇవ్వనా?"

"ఇయ్యి. కాని ఆ సలహా ఏమిటో నేను వినవచ్చా?"

"వినండి"

అని భ్రమరి 'క్షీరి' 'క్షీరీ' అని ఒక దాసీదాన్ని పిలిచింది.

అప్పుడు క్షీరోదా-రేవా-క్షీరోదమణి-లేదా క్షీరాబ్ధితనయ— క్షీరి వచ్చి నిలబడింది. "క్షీరీ ఆ దరిద్రపుమొహం రోహిణిదగ్గిరకు ఒకసారి వెళ్ళివస్తావా?" అని అడిగింది.

"ఎందుకువెళ్ళను? ఏం చెప్పాలి ఆమెతో?"

"నా మాటలుగా దాన్ని చావమన్నానని చెప్పు"

"ఇంతేనా? వెడుతున్నా" అని క్షీరి నడ్డితిప్పుకుంటూ వెళ్ళింది. వెడుతుండగా భ్రమరి మళ్ళీ వెనక్కి పిలిచి "ఏం చెప్పిందో మళ్ళీ నాతో చెప్పివెళ్ళు" అంది.

"సరే" అని క్షీరి వెళ్ళిపోయింది. కాస్సేపట్లో తిరిగివచ్చి "చెప్పి వచ్చా అంది.

"ఏమన్నదీ అది?"

"ఉపాయమేదయినా అడిగివచ్చి చెప్పమన్నది"

"అయితే మళ్ళీ వెళ్లు ఏమని చెప్పివస్తావంటే-వారుణీతటాకంలో సాయంకాలం బిందె మెడకుకట్టుకుని-తెలిసిందా?"

"ఆహాఁ"

అని క్షీరి మళ్ళీ వెళ్ళింది. మళ్లీ వచ్చింది "వారుణీతటాకం సంగతి చెప్పావా" అన్నది భ్రమరి.

"చెప్పాను"

"ఏమన్నది"

"సరే' అంది.

"ఛీ భ్రమరీ!" అన్నాడు గోవిందలాల్.

"దిగులుపడ నవసరంలా. అది ఏమాత్రం చావను. నిన్నుమళ్ళి చూసి ఇవయినవి చెప్పపోగలదా?" అంది భ్రమరి.

---

# 15

రోజూ తన పనులన్నీ ముగించుకుని సాయంకాలానికల్లా గోవిందలాల్ నియమంగా వారుణీ తటాక ఒడ్డున ఉన్న పుష్పోద్యానానికి వెళ్ళి పచార్లు చేస్తూ ఉండేవాడు అలా పచార్లు చేయటం అతడికి ప్రధానమైన సుఖాలలో ఒకటి. అన్నిచెట్లచుట్టూ నాలుగయిదుసార్లు తిరిగి వస్తూంటాడు. కాని ఆ చెట్లక్రింద తిరగటంసంగతి చెప్పబోవటం లేదిప్పుడు. వారుణీఒడ్డున-ఉద్యానానికి మధ్యగా ఒక వేదిక ఉంది. ఆ వేదికామధ్యంలో స్ఫటికశిలా నిర్మితమైన స్త్రీ విగ్రహం ఒకటి ఉంది. ఆ స్త్రీ విగ్రహం -అర్ధావృతియై, వినతలోచనయై ఒక బిందెతో నీళ్ళు తన పాదాలమీద పోసుకుంటున్నట్లు చెక్కబడి ఉంది దానికి నాలుగు ప్రక్కలా రకరకాల క్రోటన్సు పట్టికుండలలో అమర్చి ఉన్నాయి. ఆ వేదికకు దిగువుగా చుట్టూ కామినీ, మల్లె, జాజి మొదలయిన లతలు అల్లుకుని సుగంధాన్ని గుబాళిస్తూ ఉన్నాయి. వాటి ప్రక్కనే అనేక విధాలయిన చెట్లు-కన్నులపండువుగా బారులు తీర్చినట్లు ఉన్నాయి గోవిందలాల్‌కు అక్కడ కూర్చోవటమంటే మహా ఇష్టం. వెన్నెలరాత్రుల్లో అప్పుడప్పుడు భ్రమరిని ఉద్యానంలో త్రిప్పటానికి తీసుకువచ్చి అక్కడే కూర్చోపెట్టేవాడు. భ్రమరి అర్ధావృతయైన ఆ శిలావిగ్రహాన్ని చూసి 'పాడుముఖంబొమ్మ' అని తిడుతూఉండేది. అప్పుడప్పుడు తన పయిటతో ఆ విగ్రహం శరీరం కప్పుతూ ఉండేది ఒక్కొక్కప్పుడు ఇంటినుంచి వచ్చేప్పుడే మంచి వస్త్రం ఒకటి తీసుకువచ్చి ఆ విగ్రహానికి చుట్టేది.

ఇవాళ సాయంత్రం గోవిందలాల్ వచ్చి ఆ ప్రదేశంలోనే కూర్చుని వారుణీ జలశోభను చూడసాగాడు. అలా చూస్తూ చూస్తూనే-ఆ చెరువుమెట్లమీదనుంచి బిందె చంకనెట్టుకుని రోహిణి చెరువులోకి దిగుతూ ఉండటంకూడా-చూశాడు. ఏమీ లేకపోయినా గడుస్తుంది కాని,

ఈ నీళ్ళు తీసుకువెళ్ళకపోతేమాత్రం గడవదు. ఇంత దుఃఖంలో ఉన్న ఈనాడుకూడా నీళ్ళు తీసుకువెళ్ళటానికి వచ్చింది. రోహిణి నీళ్ళల్లో దిగి స్నానంచేస్తుందని ఊహించి-అలాంటి సమయంలో తానక్కడ కూర్చో టము మంచిదికాదని భావించి, గోవిందలాల్ అక్కడనుంచి మరో చోటకు వెళ్ళిపోయాడు.

గోవిందలాల్ చాలాసేపు అటూ యిటూ తిరిగాడు. చివరకు యీపాటికి రోహిణి పైకివచ్చి ఉంటుందని అనుకున్నాడు. అలా అను కుని మళ్ళీ ఆ వేదికమీద ఉన్న పాషాణసుందరి పాదసన్నిధికి వచ్చి కూర్చున్నాడు. మళ్ళీ ఆ వారుణీశోభను తిలకించసాగాడు. ఆఖ్టే చూడగా రోహిణిగాని, మరో స్త్రీగాని పురుషుడుకాని ఎవ్వరూ లేరు అక్కడ. ఎక్కడా ఎవ్వరూ లేరు-కాని ఆనీళ్ళమీద ఒక బిందెమాత్రం తేలుతోంది

ఎవరిబిందె? అని హటాత్తుగా సందేహం కలిగింది. ఎవరైనా నీళ్ళుతీసుకు వెడదామని వచ్చి మునిగిపోలేదుకదా। రోహిణే ఇప్పుడు నీళ్ళు తీసుకువెళ్ళటానికి వచ్చింది-చటుక్కున మధ్యాహ్నం జరిగిన సంగతి జ్ఞప్తికి వచ్చింది. సాయంకాలం బిందె మెడకు కట్టుకుని వారుణీ చెరువులో—అని భ్రమరి కబురంపించినమాటా-రోహిణి సరే' అనటం జ్ఞాపకం వచ్చాయి

గోవిందలాల్ వెంటనే అ మెట్లదగ్గిరకు వచ్చాడు. చివరకు అక్కడే నుంచుని చుట్టూ చూడసాగాడు. స్వచ్ఛంగా ఉన్నాయి నీళ్ళు. రేవుదగ్గిర నీళ్ళక్రింద నేలకూడా స్పష్టంగా కన్పిస్తోంది. స్వచ్ఛమైన స్ఫటికాలతో అలంకృతమైన బంగారు బొమ్మలాగా రోహిణీ నీళ్ళలోపల పడిఉంది. చీకటి జలాన్ని ప్రకాశింపజేస్తోంది.

---

# 16

గోవిందలాల్ చప్పున నీళ్ళల్లోకి దిగి, మునిగి రోహిణిని ఎతుకు వచ్చి మెట్లమీద పడుకోపెట్టాడు. చూస్తే రోహిణి జీవించిఉందో లేదో సందేహంగా ఉంది. స్పృహలేదు. శ్వాసకూడా విన్పించటంలా.

గోవిందలాల్ ఉద్యానంలోని తోటమాలిని పిలిచి, అతడి సహా యంతో రోహిణిని మోసుకుని ఉద్యానంలో ఉన్న ప్రమోద గృహానికి శుశ్రూష చెయ్యటానికి తీసుకువెళ్ళాడు. భ్రమరితప్ప మరో స్త్రీ ఎన్నడూ ఆ ప్రమోదగృహంలో ప్రవేశించి ఎరుగదు.

వర్షజలంతో ధౌతమైన సంపంగి పుష్పాలాగా ఉన్న ఆ మృత శరీరం మంచంమీదనుంచి వ్రేలాడుతూ—స్వచ్ఛమైన దీపాల కాంతిలో మరింత శోభగా ఉంది. నల్లని ఆమె దీర్ఘకేశాలనుంచి మేఘాలు వర్షిస్తు న్నట్లు నీళ్ళు స్రవించసాగినాయి కళ్ళు మూతలుపడిఉన్నాయి ఆ ముకు ళితములైన నేత్రపద్మాలమీది కనుబొమలు రెండూ నీటికి తడిసి మరింత నల్లగా నిగనిగలాడుతున్నాయి. లజ్జకాని, భయంకాని వ్యక్తంకాకుండా విశాలంగా ఉన్న ఆ నుదురూ, ఏదో అవ్యక్తభావాన్ని వెల్లడిచేస్తున్న ఆ చెక్కిళ్ళూ మరింత ప్రకాశవంతంగా ఉన్నాయి. గోవిందలాల్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి "అబ్బ! బ్రహ్మదేముడు నీకింత సౌందర్యాన్ని ప్రసా దించి ఎందుకు పంపాడు ఈ లోకంలోకి? పంపినవాడు సుఖపడేట్లు ఎందుకు చెయ్యాలా? నువ్వు ఇలా ఎందుకు వచ్చావ్?'' అనుకున్నాడు మనస్సులో. ఈ సుందరి ఆత్మహత్యకు తానే మూలకారణమని స్ఫుర ణకువచ్చి అతడికి గుండె విచ్చిపోయింది. రోహిణికి ఒకవేళ ప్రాణాలే కనుక ఉంటే ఎలాగయినా సరే బ్రతికించాలి. నీళ్ళలో మునిగినవాళ్ళను ఏవిధంగా బ్రతికించాలో గోవిందలాల్‌కు తెలుసు. పైనఉన్న నీరు సుల భంగానే జారిపోయింది, నాలుగయిదుసార్లు ఆమెను అటు ఇటూ పొర్లించి నీళ్ళు కక్కించాడు. కాని దానివల్లకూడా శ్వాస ఆడడం మొద లెట్టలా అదే కష్టమయినపని.

చావుకు సిద్ధంగావున్నవారిని చంకలక్రిందుగా చేతులువేసి పైకి లేవతీస్తే లోపల ఉన్న వాయుకోశం విచ్చుకుంటుందనీ, ఆ సమయంలో రోగి ముఖంలోకి ఉఫ్ అని ఊదాలనీ, తర్వాత పైకి ఎత్తుకునిఉన్న రోగి చేతులను మెల్లిమెల్లిగా క్రిందికి దింపాలనీ, అలా దింపితే వాయు కోశం సంకుచితం అవుతుందనీ, అప్పుడు ఆ ఉఫ్ అని ఊదిన గాలి సులభంగానే బెటికి వస్తుందనీ, దీనివల్ల కృత్రిమమైన శ్వాస వస్తుందనీ గోవిందలాల్‌కు తెలుసు ఇలా నాలుగయిదుసార్లు చేస్తే వాయుకోశం సహజస్థితిలోకి వచ్చి-కృత్రిమస్వాస రాగారాగా సహజమైన శ్వాస దానం

తటదే వస్తుంది. రోహిణికికూడా అలాగే చెయ్యాలి రెండుచేతులనూ ఆమె రెండు బాహువులక్రిందకీ పోనిచ్చి ఎత్తి ఆమె ముఖంలోకి ఊదాలి దొండపండును ధిక్కరిస్తూ, సుధా పరిపూర్ణములూ, మదనమదోన్మాద మనే హాలాహలానికి సమానములూ మధురములూ అయిన ఆమె పెద వులకు పెదవులు ఆనించి ఉఫ్‌మని ఊదాలి. ఛీ! ఎవరు చేస్తారు?

గోవిందలాల్‌కు అక్కడవున్న సహాయుడు ఒరియా తోటమాలి ఒక్కడే. తోటలో ఉన్న మిగిలిన నౌకర్లంతా ఇంతకుముందే ఇళ్ళకు వెళ్ళారు. "నేను ఈమె చేతులను ఎత్తి పైకి లేపతీస్తాను. నువ్వు ఈమె ముఖంలోకి ఊదు చూస్తాను!'' అన్నాడు గోవిందలాల్ తోటమాలితో.

నోటిలో ఊదటం! ఇంకేమన్నా ఉందా! అమృతమయములైన ఆ ఎర్రటి పెదవులమీద తోటమాలి ఊదటమా! "అది నావల్ల కాదు బాబూ!''

యజమాని అతడ్ని నల్లరాయి మింగమంటే కాదని ఎదిరిస్తే ఎదిరించవచ్చు. కాని ఆ చంద్రముఖి ఎర్రని పెదవులలోకి— ఆ ఒరియా వాడి ఫూత్కారమా! తోటమాలి ఇరుకునపడి "అంతపని నావల్ల కాదు బాబూ!'' అన్నాడు.

యదార్థమే చెప్పాడతడు. మాలి దేవదుర్లభములైన ఆమె పెదవు లమీద ఒకసారి పెదవులానించి ఉఫ్ అని ఊదితే—ఆ తర్వాత రోహిణి ఒకవేళ బ్రతికినా ఆ పెదవులను కదిలిస్తూ—నీళ్ళబిందె చంకనెట్టుకుని తీసుకువెడుతూ ఒక్కసారి మాలివేసి చూసిందంటే అతడికింక తోటపని సాగదు. అతడు అవలగూ, పారా ఆ చెరువులో పారేసిపోయి, సువర్ణ రేఖానదిలో పడాల్సిందే. సందేహంలేదు. అయితే మాలి ఇంతదూరం ఆలోచించాడో లేదో చెప్పలేను కాని, ఉఫ్‌న ఊదటానికి మాత్రం ఒప్పుకోలా.

"అయితే నువ్వు యిలా ఈమె చేతులు మెల్లిగా పైకి ఎత్తి పట్టుకో—నేను ఊదుతాను, తర్వాత మెల్లిమెల్లిగా చేతులు క్రిందికి దింపు'' అన్నాడు తప్పనిసరిగా గోవిందలాల్. మాలి అందుకు అంగీక రించాడు అతడు అలాగే మెల్లిగా చేతులెత్తి పట్టుకున్నాడు. గోవింద లాల్ విచ్చిన మంకెనపువ్వుల్లా ఉన్న ఆమె పెదవులమీద—అరవిచ్చిన మంకెనపువ్వుల్లా ఉన్న తన పెదవుల నానించి—ఉఫ్ అని ఊదాడు,

ఆ సమయంలో భ్రమరి ఒక కర్ర తీసుకుని పిల్లిని తరుముకుంటూ వచ్చింది. పిల్లిని కొట్టబోతే ఆ కర్ర పిల్లికి తగలక భ్రమరికే తగిలింది నొప్పుటిపేద.

మాని రోహిణి చేతులను క్రిందికి దింపి మళ్లీ పైకెత్తాడు. గోవిందలాల్ మళ్ళీ పూత్కారం చేశాడు రెండుమూడు గంటలు ఇలా చేసేసరికి రోహిణికి శ్వాస వచ్చింది. బ్రతికిందామె.

---

# 17

రోహిణికి కొంచెం శ్వాస ఆడగానే గోవిందలాల్ ఆమెచేత మందు త్రాగించాడు. ఆ మందు త్రాగటంవల్ల కొంచెం ఓపికవచ్చి ఆమె నాలుగువైపులా కలయచూచింది. చక్కగా అలంకృతమైవున్న ఆ గది లోకి కిటికీలోంచి చల్లని పిల్లవాయువులు ప్రసరిస్తున్నాయి. ఒకవైపున స్ఫటికాలతో తయారుచేసిన ఆధారంలో దీపం వెలుగుతోంది -మరొక వైపున హృదయంలో జీవనప్రదీపం వెలుగుతోంది. రోహిణి గోవిందలాల్ ఇచ్చిన మృతసంజీవని రసం తాగి చావుకు సిద్ధమైనది కోలుకుంటోంది మొదట్లో శ్వాస ఆడింది తర్వాత చైతన్యం. ఆ తర్వాత కళ్ళు తెరిచి చూడటం, తర్వాత స్మృతి. చివరకు పెదవులు కదిలించి మాట్లాడటంవరకూ వచ్చింది. "చచ్చిపోయినదాన్ని నన్ను ఎవరు బ్రతికించారు?" అని అడిగింది రోహిణి.

"ఎవరు బ్రతికిస్తే యేం—నువ్వు బ్రతికావు అంతేచాలు" అన్నాడు గోవిందలాల్.

"నన్నెందుకు బ్రతికించారు? నాతో మరింత శత్రుత్వం దేనికి? చావాలన్నా మీరు ప్రతివాదులేనా?"

"నువ్వు చావటం దేనికి?"

"చావటానికికూడా అధికారం లేదా నాకు?"

"పాపకృత్యానికి ఎవరికీ అధికారం లేదు. ఆత్మహత్య మహా పాపం"

"నాకు పాపపుణ్యాలు అంటే ఏమిటో తెలియదు. నా కెవరూ నేర్పనూలేదు పాపపుణ్యాలను అంగీకరించను నేను- ఏపాపం చేశానని నాకీ శిక్ష? ఏపాపం ఎరగనిదేనే నాకింత దుఃఖం కలగగాలేనిది-పాపం చేస్తేమాత్రం ఇంతకన్న ఎక్కువ దుఃఖం కలిగేదేముంది? నేనుచస్తాను ఇప్పుడంటే మీకంటపడ్డాకనుక మీరు రక్షించారు. ఈసారి మీ కంటపడ కుండా ఉండేట్లు ప్రయత్నిస్తాను'

గోవిందలాల్ చాలాభయపడి "నువ్వుఎందుకు చావటం?' అన్నాడు.

"ఎన్నాళను చో - రాత్రింబవళ్ళు ప్రతిక్షణం చావాలని అను కోవటంకన్న ఒక్కసారి చచ్చిపోవటమే మంచిది"

"ఎందుకంతబాధ?"

"రాత్రి బవళ్ళు దారుణమైనదాహం - హృదయం పిడచకట్టుకు పోతోంది - ఎదుటగానేవుంది శీతలజలం కాని ఈజన్మలో ఆ జలాన్ని స్పృశించనూలేదు, స్పృశించగలననే ఆశాలేదు."

"ఈమాటలవల్ల ప్రయోజనం ఏమీలేదు కానిపద మీఇంటిదగ్గర దింపించివస్తా"

"వద్దు నేనుఒంటరిగానే వెడతా"

అభ్యంతరం ఏమిటో గోవిందలాల్ గ్రహించాడు. గోవిందలాల్ ఇంకేమీమాట్లాడలా రోహిణి ఒక్కత్తేవెళ్ళింది. గోవిందలాల్ విజనంగా ఉన్న ఆగదిలో క్రిందపడి ఏడుస్తూ దొర్లసాగాడు. దొర్లగాపడుకొని "నన్ను ఈవిపత్తునుంచి రక్షించుభగవాన్! నువ్వురక్షించకపోతే ఇంక రక్షించేదెవరు? నేనుచస్తాను. భ్రమరి చనిపోతుంది. నువ్వునా హృద యంలో విరాజిల్లితే నీబలంవల్ల ఆత్మను జయిస్తాను" అనిభగవంతుని ప్రార్థించ సాగాడు

---

# 18

గోవిందలాల్ ఇంటికి తిరిగివచ్చాడు. ఇవాళరాత్రి ఇంత ప్రొద్దు పోయేంతవరకు తోటలో ఉన్నారెంచేత?'' అని అడిగింది భ్రమరి.

"ఎందుకలా అడుగుతున్నావ్? ఇంకెక్కడా ఉండకూడదాఏం?"

"ఉండవచ్చు కాని ఇవాళ మీ ముఖం చూసినా, మీ మాటలతీరు చూసినా ఇవాళేదో జరిగినట్లుంది"

"ఏం జరిగింది?"

"ఏంజరిగిందో మీరు చెప్పాలికాని, నేనెలా చెప్పగలనూ? నేను అక్కడేమయినా ఉన్నానా ఏ?"

"ఎందుకు? ముఖంచూసి చెప్పలేవూ?"

"వేళాకోళాలలాఉంచండి. జరిగినవిషయం మంచిదికాదనిమాత్రం ముఖంచూసి చెప్పగలను - చెప్పండి. నాకు చాలా భయంవేస్తోంది''అని అంటూఉండగానే భ్రమరి కళ్ళవెంట నీళ్ళు బొటబొటా కారసాగినాయి గోవిందలాల్ భ్రమరి కన్నీళ్ళు తుడిచి సాదరంగా "ఇవాళకాదు భ్రమరీ! మరొకరోజున చెబుతాలే'' అన్నాడు.

"ఇవాళ కాకపోవటమేం?"

"నువ్వు ఇంకా చిన్నదానివి. ఆసంగతి చిన్నవాళ్ళు వినేదికాదు"

"రేపు నేను పెద్దదాన్ని అవుతానావేం?"

"రేపూచెప్పను—రెండేళ్ళయాక చెబుతాను. ఇంకో అడగకు భ్రమరీ!''

భ్రమరి దీర్ఘంగా నిట్టూర్చింది. "అయితేసరే-రెండేళ్ళు పోయాకనే చెప్పండి-నాకు వినాలని మహా కోరిగ్గా ఉంది. కాని మీరు చెప్పకపోతే వే వినటమాఇంక? నా మనస్సు ఎలాగో ఉంది" అన్నది.

ఏదో ఒక పెద్ద దుఃఖం భ్రమరి మనస్సులో అంధకారాన్ని వ్యాపింపచెయ్యసాగింది. సుందరమూ, నీలమూ, ఉజ్జ్వలమూ అయిన వసంతాకాశంలోకి ఎక్కడనుంచో ఒక మేఘం వచ్చి ఎలా వ్యాపిస్తుందో-అలాగే ఆమె హృదయంలోకి ఎక్కడనుంచో చటుక్కున ఒక మేఘం వచ్చి అంధకారమయం చేయసాగింది. భ్రమరి కళ్ళవెంట నీళ్ళు కారసాగాయి. నేను అకారణంగా ఏడ్చాను- నేను చాలా దుర్మార్గురాలిని నా భర్తకు కోపంవస్తుంది అనుకుంది భ్రమరి అందుచేత భ్రమరి ఏడుస్తూ ఏడుస్తూ బైటికి వెళ్ళిపోయి, ఒకమూల కూర్చుని కాళ్ళు చాచుకుని ఏదో పుస్తకం చదువుకోసాగింది. ఆమె శిరస్సుమీదనుంచి ముసుగు తొలిగిందో లేదో చెప్పలేను కాని హృదయమధ్యంనుంచి ఆ కాలమేఘం మాత్రం తొలిగిపోలేదు.

# 19

గోవిందలాల్ పెత్తండ్రితో ఆస్తిపాస్తుల విషయాలు మాట్లాడుతూ కూర్చున్నాడు. మాటలసందర్భంలో ఏయే జమీందార్ల స్థితి ఎలా ఉందోకూడా అడిగి తెలుసుకోవటం మొదలెట్టాడు. కృష్ణకాంత్ గోవిందలాల్‌ని ఆసక్తి చూసి, సంతోషించి, "నువ్వుకూడా వాటివిషయం కాస్త చూసి తెలుసుకుంటూ ఉంటూంటే బాంగుటుంది. చూడు, నేనుమాత్రం ఇంకా ఎన్నాళ్ళు ఉంటాను? నువ్వు ఇప్పటినుంచీ చూసుకోకపోతే-నేను చనిపోయాక నీకేమీ తెలియదు నేను ముసలివాణ్ణి అయిపోయాను. ఎక్కడికయినా వెళ్లాలన్నా వెళ్ళలేను. కాని ఎక్కడికీ వెళ్ళి మేనేజ్ చేసుకోకపోవటంవల్ల ఎస్టేటంతా పాడైపోతోంది'' అన్నాడు.

"మీరు పంపిస్తే నేను వెళ్ళిరాగలను. ఎస్టేటంతా ఒక్కసారిచూసి రావాలని నాకూ చాలా కోరికగా ఉంది" అన్నాడు గోవిందలాల్. కృష్ణకాంత్ ఆహ్లాదితుడై- "అలాఅయితే నాకు చాలా సంతోషం బందర్‌ఖాలీ అనే ఊళ్ళో కొంచెంగోల బయలుదేరింది. ప్రజలంతా కట్టుకట్టి శిస్తులు చెల్లించటంలేదని చెబుతున్నాడు సముద్దారు. మేము శిస్తులు ఇస్తున్నా వసూలు చేసుకోవటంలేదు సముద్దారు అని ప్రజలంటున్నారు. నీకు వెళ్లాలని ఉంటే చెప్పు—నిన్ను అక్కడకు పంపిస్తాను'' అన్నాడు.

గోవిందలాల్ వెళ్ళటానికి ఒప్పుకున్నాడు అతడు ఇందుకోసమే పెత్తండ్రి దగ్గరకు వచ్చి కూర్చుని ఈ ప్రశక్తితెచ్చాడు. పరిపూర్ణమైన అతడి యౌవనమూ, ఉద్వేలితమైన సముద్రతరంగాల్లో పొంగుతున్న అతడి మనఃప్రవృత్తి తీవ్రమైన అతడి రూపతృష్ణ వశంతప్పిపోతున్నాయి. భ్రమరివల్ల అతడి తృష్ణతీరటంలేదు. గ్రీష్మకాలంలో మేఘమాల కనిపిస్తే చాతకపక్షికి ఎలాఉంటుందో - అలాగే రోహిణి రూపం ఈ చాతకంకంట పడింది. మొట్టమొదటగా మేఘదర్శనంకాగానే మయూరం ఎలానాట్యంచేస్తుందో - అలాగే రోహిణిని చూసినప్పట్నుంచీ గోవిందలాల్ మనస్సుకూడా నాట్యం చేయసాగింది. అంచేత - చచ్చినాసరే భ్రమరి విషయంలో అవిశ్వాసినీ, కృతఘ్నుడినీ కాకూడాదని నిశ్చయించుకున్నాడు గోంవిదలాల్ ఎస్టేటు వ్యవహారాల్లో మనస్సును దూర్చిస్తే రోహిణిని సులభంగా మరచిపోవచ్చు. ఈ ఊరు వదిలి వెడితే తప్ప

కుండా మరిచిపోగలను అనుకున్నాడు మనస్సులో. ఇలా మనస్సులో స్థిరీకరించుకునే పెత్తండ్రి దగ్గిరకెళ్ళి కూర్చుని ఈ ప్రస్తావన తీసుకొచ్చాడు. బందర్ ఖాలీ పేరువిని ఏమయినాసరే అక్కడికి వెళ్లాలని పట్టువల వహించాడు.

భర్త ఇలా ఎస్టేటు చూడటానికి వెళ్ళబోతున్నాడని భమరి విన్నది. తను కూడా వెడదామనుకుంది. ఏడ్చింది. రాగాలెట్టింది. కాని ఆమె అత్తగారు వెళ్ళనియ్యలేదు. నావ సిద్ధంచేయించుకుని - భ్రమరిని కౌగిలించుకుని - నౌకర్లను వెంటపెట్టుకుని గోవిందలాల్ ప్రయాణమై వెళ్లాడు.

భ్రమరి మొదట్లో కిందపడి దొర్లి ఏడ్చింది. తర్వాతలేచి ఇంట్లో వస్తువులు ఎక్కడి వక్కడ పారేసి, దాసీవాళ్ళను తిట్టి నానాహంగామా చేసి చివరకు పడుకుంది. పడుకుని ఒంటినిండా ముసుగెట్టుకుని మళ్ళీ ఏడవటం మొదలెట్టింది.

గోవిందలాల్ నావ వాయు గాలిలో తరంగాలమీద తేలిపోతూ నీళ్ళను చీల్చుకుంటూ పోసాగింది

---

## 20

భ్రమరికి ఒంటరితనం - ఏమీబాగుండలా. మెత్తటి పరుపుమీద పడుకోటం మానేసింది మంచానికి పైనకట్టినపంకా - వేడిగాలివేస్తున్నదని విప్పతీయించేసింది. దాసీవాళ్ళను పూలుఅవీ తీసుకురాకుండా చేసింది. సావాసకత్తెలతో చదరంగమాడటం మానేసింది. అదేమంటే అత్తగారికి కోపంవస్తుందన్నది. దారపుబంతులూ ఊలుబంతులూ - అల్లికబంతులూ ఇరుగు పొరుగునఉన్న ఆడపిల్లలకు పంచిపెట్టేసింది. చీరెమాసిందేమని ఎవరైనా అడిగితే చాకలిదాన్ని తిట్టేది-కాని నిజానికి చాకలి తెచ్చిన చీరెలు ఇంటినిండా ఉండేవి. తల ఎప్పుడూ దువ్వకపోవటంవల్ల జుట్టు గాలికి దుబ్బులాగా పైకిలేచింది. అన్నం ముందరకు వచ్చేసరికి భ్రమరి రోజూ "నేను తినను నాకు జ్వరంవచ్చిందని మారాం చేసేది అత్తగారు ఆయుర్వేద వైద్యుణ్ణిపిలిపించి చూపించి వేళకుసరిగ్గా మందూమాకూ

ఇస్తూఉండమని ఆహారం క్షీరికి ఒప్పగించింది. భ్రమరి దాని చేతులోంచి ఆ మందు లాక్కొని కిటికీలోంచి బైట పారేసేది.

క్రమంగా ఈ గడబిడ అంతా క్షీరి సహించలేకపోయింది. "సరే బాగానే ఉంది, కానిఅమ్మగారూ ఎవరికోసం మీరు ఇంతఇదవుతున్నారు? ఎవరికోసం మీరు నిద్రాహారాలు మానేశారో - వారు మిమ్మల్ని ఒక్కనాడైనా తలుచుకుంటారా? మీరు చనిపోయారన్నా వారు బహుశా హూం అని నిట్టూర్చికళ్ళు మూసుకుని రోహిణీ అమ్మవారిని తలచుకుంటారు'' అన్నది

భ్రమరి క్షీరిని ఒక్క చెంపదెబ్బ వేసింది. భ్రమరి చెయ్యి మహా చురుకు. ఇంచుమించు ఏడుపుముఖంపెట్టి. "నీ యిష్టవచ్చినట్లల్లా వాగుతున్నావు, ఫో ఇక్కడినుంచి దూరంగా" అంది.

మీరునన్ను చెంపదెబ్బలు కొట్టినా, చెప్పుయి మెత్తేసినా లోకాన్ని మూయగలరా అమ్మగారూ! మీకుకోపం వస్తుందేమో అన్నభయంతో మేమేమి చెప్పలేకుండాఉన్నాం. చెప్పకుండాఫుండి బ్రతుకలేము తోటలో వుండే మాలదాన్ని పిలిపించి - రోహిణి ఆనాడు అర్ధరాత్రివేళ బాబుగారి తోటలోంచి వచ్చిందోలేదో - అడిగిచూడండి" అన్నదిక్షీరి.

క్షీరిదికొంచెం మందబుద్ధి అంతచేనే పొద్దునే ఈ మాటలన్నీ భ్రమరిదగ్గర చెప్పేసింది. భ్రమరి లేచినిలబడి క్షీరిని చెంపలు పగల కొట్టింది వీపుమీద గుద్దింది. జుట్టుపుచ్చుకు లాగింది, చివరికిరానుకూడా ఏడవటం మొదలెట్టి ది.

క్షీరిఅప్పుడప్పుడు భ్రమరిచేత చెంపదెబ్బలు తింటూనే ఉండేది. కానిఎన్నడూ కోపం తెచ్చుకొనేదికాదు. కానిఇవేళమాత్రం కొంచెంకోపగి చుకుని "నన్నుకొడితే ఏంలాభం అమ్మగారూ! మీమంచి కోసమే చెప్పాను మిమ్మల్ని లోకులంతా ఆడిపోసుకుంటూ వుంటే - నేనువిని సహించ లేకుండా వున్నాను నామాటమీద నమ్మకంలేకపోతే నలుగురినీ పిలిచిఅడిగి చూడండి'' అంది.

భ్రమరి అభిమానంతోనూ, కోపంతోనూ, ఏడుస్తూ - "నీకులండి గాలనిఉంటే నువ్వేలడుగు నలుగురినీ పోగుచేసి నాభర్త సంగతి అడగటానికి నేనునీలాగా లేకే దాన్ని అనుకున్నానా? ఇంతగొప్పసంగతినువ్వు

కనక చెప్పావు మహా! అత్తగారితో చెప్పి నిన్ను చీపురు దెబ్బలు కొట్టించి ఇంట్లోంచి వెళ్ళగొట్టిస్తాను. నువ్వు నాదగ్గరనుంచి పో ముందింకా!'' అంది.

క్షీరి ఇహానప్పుడు ప్రొద్దుటివంట ఎలాగో అలాచేసి కోపంతో రుసరుస లాడుతూ వెళ్ళిపోయింది. భ్రమరి సజల నేత్రాలతో చేతులు జోడించి మనస్సులో గోవిందలాల్‌ను ఉద్దేశించి "ప్రభూ! మీరు నాకు గురువులు, ధర్మజ్ఞులు నాకు కేవలం సత్యస్వరూపులు మీరా రోజున నాదగ్గర చెప్పకుండా దాచినసంగతి ఇదేనా?" అని అనుకోసాగింది.

ఆమె మనస్సులోని రహస్యస్థానం - ఎన్నడూ ఎవ్వరూ చూడలేని ప్రదేశం - ఎంత తరచి చూసుకున్నా గోవిందలాల్ మీద అవిశ్వాసం కలగలేదు భ్రమరికి.

"వారు అవిశ్వాస పాత్రులైతే మాత్రం ఇంతదుఃఖం దేనికి? నేను చచ్చిపోతే అన్నీ సమసిపోతాయి'' అని మాత్రం ఒక్కసారి భ్రమరి తనలో తాను అనుకుంది. హిందూస్త్రీ చచ్చిపోదామని అతిసహజంగా అనుకుంటుంది.

# 21

"ఇదంతటి కలికాలం ఈమె నా మాటలు నమ్మలేక పోయిందికదా?" అని అనుకుంది క్షీరి. క్షీరి సరళహృదయంలో భ్రమరి మీద కోపంగాని ద్వేషం గాని ఏమీ లేదు. ఆమె భ్రమరికి శుభాన్ని కాంక్షించేదే - ఆమెకు అమంగళాన్ని ఎప్పుడూ కోరదు. అయినా తాను చెప్పిన శుభవార్తలు భ్రమరి వినిపించుకోకపోయేసరికి అసహ్యం వేసింది క్షీరికి. బలిష్ఠమైన శరీరానికి కొంచెం నూనె రాసుకొని, రంగుచీర భుజానవేసుకుని, చెంబు చంకన పెట్టుకుని, వారుణీ తటాకానికి స్నానానికి బయలుదేరింది.

హరమణికూడా జమీందారుగారింట్లో వంటచేసేవాళ్ళలో ఒక్కతే. సరిగ్గా అదే సమయానికే ఆమెకూడా స్నానానికి చెరువుకు వచ్చేసరికి ముందు ఆమె కనిపించింది. క్షీరి హరమణిని చూడగానే తనలో తాను అనుకుంటున్నట్లు "ఎవరికోసం దొంగతనం చేస్తే వాళ్ళనే దొంగ అంటారు - ఇంకగొప్పవా

ళ్ళిళ్ళల్లో పనులుచేయలేము. ఎప్పుడు ఎవరి స్వలాభం ఎలా వుంటుందో ఏం చెప్పగలం?'' అని అనుకోసాగింది.

హరమణి కొంచెం కలహ సూచకమైన వాసనను పసికట్టి కుడి చేతిలో ఉన్న ఉతికినబట్ట ఎడంచేతిలోకి తీసుకుని "ఏమిటే క్షీరోదా? మళ్లీ ఏం జరిగిందేమిటి?'' అని అడిగింది.

క్షీరి ఇహమనస్సులోని భారాన్ని దింపుకుంది. "చూడు అమ్మా! ఊళ్లోముండలంతా బాబుగారి తోటలో తిరుగుతూంటే - వారిపరిచారికలం మనం యజమానితో చెప్పకూడదూ?'' అంది.

"అదేమిటే? ఊళ్లోవాళ్ళంతా బాబుగారి తోటలోకి ఎవరువెళ్లారు?"

"ఇంకెవరువెడతారు? దౌర్భాగ్యురాలు - ఆరోహిణే!"

"అయ్యోరాత! రోహిణికి మళ్లీ ఇదెన్నాళ్ళనుంచి? ఏబాబుగారితోటలోకే క్షీరీ?"

క్షీరి చిన్నబాబుగారి పేరుచెప్పింది. అప్పుడిహ ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళుచూసుకుని, నవ్వుకుంటూ ఎవరిదారినివారు. వెళ్లిపోయారు. కాస్త దూరం వెళ్లేసరికి క్షీరోదాకు పక్కింటి రాముడితల్లి కన్పించింది. క్షీరి ఆమెను ఒక్కనవ్వుతో నిలవేసి రోహిణి దుర్మార్గగాధఅంతా వినిపించింది. మళ్లీఇద్దరూ ఒకళ్ళనొకళ్లు చూసుకుంటున్నప్పుడు ఎవరిదారినివారు వెళ్లిపోయారు.

ఈవిధంగా క్షీరిదారిలో కన్పించిన వాళ్లకల్లా తనమనస్సులో పీడిస్తున్న ఈసంగతియావత్తూచెప్పి చివరకు ప్రపుల్లహృదయంతోస్వచ్ఛంగా ఉన్నవారుణీతటాకపునీళ్ళల్లోమునిగింది. ఇహఇక్కడ యీపిన్నవాళ్ళంతా తమకుకన్పించిన వాళ్ళనల్లా అక్కడేనిలవేసి - 'దుర్భాగ్యురాలు రోహిణి చినబాబుగారి తోటలోకి రాకపోకలు సాగించింది. అనిచెప్పసాగారు. ఇలాఒకరినుంచి ఇద్దరినుంచి పదిమందికి - అలా అందరికి తెలిసిపోయిందీస గతి. సూర్యోదయ మవుతూఅవుతూ వుండగా క్షీరిమొట్టమొదట భ్రమరికి చెప్పినసంగతి - సూర్యాస్తమయ్యే లోగానే "రోహిణి గోవిందలాల్‌కు భార్యఅయిందట - అని ఇంటింటా మోగిపోయింది. కేవలం తోటలోకి రాకపోకలు అని ప్రారంభమైన ఈసంగతి క్రమంగా అంతులేని ప్రణయగాధగానూ - అక్కడనుంచి అలంకారాల విషయం

లోకి - ఇలాఎన్ని చిలవలూ - పలవలూ తాల్చిందో నేను....సవిస్తరంగా చెప్పలేను.

ఈసంగతి క్రమశః భ్రమరిదగ్గిరకు కూడావచ్చింది మొదట్లో వినోదినివచ్చి "నిజమేనటమ్మా?" అనిఅడిగింది. భ్రమరిశుష్కముఖంతో చెదిరిపోయిన మనస్సుతో "నిజమేమిటీ?" అంది. ఇహాఆమెపుష్పబాణాల్లాగా కనుబొమ్మలు రెండూవిరుచుకొని - మెరుపుతీగలాగా ఒక్క కటాక్షంవిసిరి - పిల్లవాణ్ణి వొళ్ళోకిలాక్కొని కూర్చోబెట్టుకుని "రోహిణి సంగతేఅడుగుతున్నది!" అంది.

భ్రమరి వినోదినికి సమాధానమేమి చెప్పలేక ఆమెపిల్లవాణ్ణి తన ఒళ్ళోకి లాక్కొని వాణ్ణిముద్దుకు ఏడిపించింది. వినోదిని వాడికి పాలిస్తూ తనఇంటికి వెళ్ళిపోయింది.

వినోదిని తర్వాత సురధునిదగ్గిరకువచ్చి "నేను చెబుతున్నాకదా? ఎలాగయినా చినబాబుగారిని కాస్త ఒకకంట కనిపెట్టేవుండు ఎన్నెన్నాచెప్పు నువ్వు ఎర్రిని దానివికాదు. మగవాళ్ళ మనస్సు కేవలం మాటల్ని పట్టి కనిపెట్టలేము కొంచెం రూపగుణాదులవసరం అంచేతనే చెల్లీ రోహిణి స్వభావం ఎలాంటిదో ఏం చెప్పగలం?" అంది,

"రోహిణి స్వభావం ఎలాంటిదేమిటి?" అందిభ్రమరి

సురధుని నుదిటిమీద కొట్టుకుని 'అయ్యోరాత! ఇంతమంది చెవిని పడ్డా ఇంకావినలేదానువ్వు? చినబాబుగారు రోహిణికి ఏడువేల రూపాయల నగలు ఇచ్చారట!" అంది.

భ్రమరికి ఒళ్లుమండిపోయింది సురధుని చస్తేబాగుండుననుకుంది మనస్సులో "అదినాకుతెలుసు, కాతాపుస్తకంతీసిచూశాను నీపేరునకూడా పధ్నాలుగువేల రూపాయలనగలు ఇచ్చినట్లురాసిఉంది" అంది.

సురధుని వెళ్ళిపోయాక - రామీ, శ్యామ, కామినీ, రమణీ శారదా ప్రమదా. సుఖదా, కమల, విమల, నిర్మల సురబాల. గిరిబాల. వ్రజబాల - ఇలాఎంతోమంది ఒక్కరొక్కరు ఇద్దరిద్దరూ ముగ్గురు ముగ్గురుగావచ్చి, విరహకాతరఅయిన భ్రమరిని పట్టుకుని 'నీభర్త రోహిణి ప్రణయాసక్తుడైనాడని చెప్పివెళ్లిపోయారు. చిన్నాపెద్దా విక్షతలేకుండా అందరూవచ్చి "ఆశ్చర్యమేముంది? చినబాబుగారి రూపంచూసి ఎవరు

మర్చిపోగలరు? రోహిణిరూపంచూసి ఆయనమాత్రం ఎలా మరిచిపోగలరు?" అనటంసాగించారు. కొంతమంది సాదరంగా, సరాగ గా, హాస్యంగా, కోపంగా కొంతమ ది దుఃఖంతోనూ - "నీరాతబాదు దరేమభ్రమరీ' అని భ్రమరికి చెప్పివెళ్లారు.

ఆఊళ్లో సుఖంగాకాపురం చేస్తున్నపిల్లభ్రమరి అమెసుఖాన్నిచూసి అందరూఅసూయతో చచ్చిపోతున్నవాళ్లే - "నల్లగాఉండే ఆమెకు ఇంత సుఖం! - ఇంతఐశ్వర్యం! దేవదుర్లభుడైనభర్త లోకంలోప వు ప్రీతిల్లూ! - బంగారానికి సుంగంధం అబ్బినట్లుకాదూ? ఊళ్లోవాళ్లు ఇంతఇది సహించలేకపోయారు. అంచేత ఒక్కొక్కళ్లేవచ్చి "ఇంకనీసుఖంశూన్యం అయింది భ్రమరీ!" అనిచెప్పివెళ్లిపోయారు భ్రమరి భర్తవిరహంతో కుమలిపోతోందనీ ఆమెకేవలం నిర్దోషిరాలనీ దుఃఖంలోవున్నబాలిక - అన్న సంగతిఎవ్వరికీ స్ఫురించలా.

భ్రమరి ఇంక సహించలేక తలుపు బిడాయించుకుని మేడమీదికి వెళ్ళి క్రిందపడి ఏడుస్తూ దొర్లసాగింది. భర్తను ఉద్దేశించి మనస్సులో— "మీదే నాకు సందేహం-విశ్వాసమూమీదే. ఇవాళ ఎవర్ని అడగను? నాకు సందేహం ఎందుకంటారేమో కాని మరి అందరూ చెబుతున్నారుగా? నిజం కాకపోతే ఇంతమంది ఎందుకుచెబుతారు? మీరిక్కడ లేకపోతే నా సందేహం తీర్చేవారెవరు? నా సందేహం తీరలేదు. అయితే ఎందుకు చావకూడదు? ఈ స దేహాన్ని ఇలా పెట్టుకుని బ్రతకాల్సిందేనా? నేను చావటం ఎందుకు? మీరు చప్పున తిరిగివచ్చేసెయ్యండిప్రభూ ఆ తర్వాత భ్రమరి నాతో చెప్పకుండా చచ్చిపోయిందని-నన్ను దూషించవద్దు" అని అనుకోసాగింది.

---

## 22

భ్రమరి అవస్థ ఎలాఉందో-రోహిణి అవస్థకూడా అలాగే ఉంది ఇప్పుడు. ఈ పంగతి ఊరంతా పొక్కింతర్వాత రోహిణి చెవినిమాత్రం ఎలా పడకుండా ఉంటుంది. గోవిందలాల్ తనకు ఏడువేలరూపాయల

నగలు ఇచ్చివెళ్ళినట్లు ఊళ్లో పుకారు వ్యాపించటం విన్నది. అసలు ఈ సంగతి పుట్టించిందెవరోమాత్రం రోహిణికి తెలియదు. కాని బహుశా భ్రమరే ఈ వార్త పుట్టించి వుంటుందని భావించింది - లేకపోతే ఇంత కడుపుమంట ఇంకెవరికి ఉంటుంది? భ్రమరే తనను చాలా క్లిష్టస్థితిలో పెడుతోందని అనుకుంది రోహిణి - ఆనాడు దొంగతనం చేసిందని అపవాదు - ఇవాళ మళ్ళీ ఈ అపవాదు, ఇంక ఈ ఊళ్లో ఉండలేను. కాని ఈ ఊరునుంచి వెళ్ళేముందు ఒక్కసారి భ్రమరిదగ్గిరకు వెళ్ళి - నాలుగు మాటలూ ఝాడించి మరీ వెళ్ళాలి అనుకుంది.

రోహిణి ఇరుగుపొరుగువారిళ్ళల్లో ఎక్కడినుంచో ఒక బెనారసు పట్టుచీరె. ఒకసెట్టు గిల్టునగలూ అడిగి తీసుకువచ్చింది. సాయంకాలం కాగానే అవన్నీ ఒక చిన్న మూటకట్టి తీసుకుని జమీందారుగారి అంతఃపురంలోకి వెళ్ళింది. యథాప్రకారంగా భ్రమరి ఒంటరిగా క్రిందపడుకుని ఏడుస్తోంది. మధ్యమధ్య కళ్ళు తుడుచుకుని పైకప్పుకేసి చూస్తూ ఆలోచిస్తోంది? రోహిణి ఆమెదగ్గిరకు వెళ్ళి మూట ప్రక్కన పెట్టుకుని కూర్చుంది. భ్రమరికి ఆశ్చర్యంవేసింది. రోహిణిని చూసేసరికి ఆమెవొళ్ళు విషజ్వాలలాగా భగ్గుమంది. ఇహ ఆపుంబ సహించలేక — "నువ్వు ఆనాడు దొంగతనం చేయటానికి మామగారిగదిలో ప్రవేశించావు. ఇవాళ నాగదిలోకికూడా ఆ ఉద్దేశ్యంతోనే వచ్చావా ఏం?" అంది.

రోహిణి మనస్సులో 'నీకు తలవంపులు కలిగించటానికివచ్చాను' అనుకుని పైకి - "ఇంకనాకు దొంగతనం చెయ్యాల్సినంత అగత్యం లేదు. నేనిప్పుడంత దరిద్రురాలను కాదు. చిన్నబాబుగారి దయవల్ల నాకింక తిండి బట్టలకు లోటులేదు. కాని లోకులనుకున్నంతగా మాత్రం లేదు" అంది.

"నువ్వు ఇక్కడినుంచి పో దూరంగా" అంది భ్రమరి.

రోహిణి ఆమాట వినిపించుకోకుండా, "లోకులనుకున్నంత ఇది మాత్రం కాదు. నేను ఏడువేల రూపాయల నగలు తీసుకున్నానని అనుకుంటున్నారు లోకులు. మొత్తంమీద మూడువేలరూపాయల నగలూ, ఈ చీరెమాత్రమే నాకు దక్కినవి. అవి నీకు చూపించటానికే వచ్చాను లోకులు ఏడువేలరూపాయల నగలని అనుకోవటం దేనికి?

అని రోహిణి ఆ మూటవిప్పి - బెనారస్ చీరె, గిల్టు నగలూ

భ్రమరికి చూపించింది. భ్రమరి చీదరించుకుని, ఆ నగలన్నీ నాలుగు వైపులకూ విరజిమ్మింది.

"బంగారం తొక్కకూడదు" అని రోహిణి మెదలకుండా మళ్ళీ ఆ నగలన్నీ పోగుచేసి మూటకట్టింది. ఆమూట తీసుకుని మెదలకుండా బైటికి వెళ్ళిపోయింది.

భ్రమరి క్షీరోదానయితే కొట్టింది కాని రోహిణినిమాత్రం ఒక్క దెబ్బఅయినా కొట్టలేకపోయింది. ఇదే మాకు చాలా విచారకరమైన విషయం స్త్రీల శరీరంమీద చెయ్యి చేసుకోకూడదని ఒప్పుకుంటా. కాని రాక్షసమీద పిశాచిమీద చెయి చేసుకోకూడదంటే మాత్రం ఒప్పుకోను. అయినా భ్రమరి రోహిణిని ఎందుకు కొట్టలేదో మాత్రం చెప్పగలను. భ్రమరి క్షీరోదాను ప్రేమిస్తోంది, కనుకనే ఆమెను కొట్టకలిగింది, రోహిణిని ప్రేమించటలేదు కనుకనే ఆమె వీపుమీద చెయ్యి వెయ్యలేకపోయింది. పిల్లలూ పిల్లలూ పోట్లాడుకుంటే తల్లి తన పిల్లలనే కొడుతుందికాని, పరాయివాళ్ళ పిల్లలను కొట్టదుగా?

---

## 23

ఆరోజున తెల్లవారగానే భ్రమరి భర్తకు ఉత్తరం వ్రాద్దామని కూర్చుంది. ఆమెకు వ్రాయటం, చదవటం గోవిందలాలే నేర్పాడు. కాని భ్రమరి వ్రాతకోతల్లో అంత ఆరితేరిన మనిషి కాలేకపోయింది. పూలు, బొమ్మలు, పశులవిషయంలోనూ, భర్తవిషియంలోనూ ఆసక్తమయిన భ్రమరి మనస్సు చదువు విషయంలోకాని గృహకృత్యాల విషయంలో కాని అంత శ్రద్ధ వహించలేకపోయింది, కాగితం తీసుకుని వ్రాయటానికి కూర్చుని దాన్ని కాస్సేపు ముడతలు లేకుండా చక్కగా చేసి, మళ్ళీ చివరకు అక్కడే పడేసేది. రెండు మూడురోజులు గడిచినా ఆ ఉత్తరం పూర్తికాలా. కాని ఇవాళ ఒక గంటలోపునే పెద్ద ఉత్తరం రాసింది భర్తకు.

"ఆరోజున రాత్రి తోటలోనుంచి రావటానికి ఆలస్యం ఎంచేత అయింది? అని అడిగితే మీరు స్పష్టంగా జవాబు చెప్పారుకాదు. రెండేళ్ల

పోయాక చెబుతానన్నారు. కాని దురదృష్టవశాత్తు ఆ సంగతి ముందు గానే విన్నాను నేను. వినటం అన్నమాటేమిటి? చూడనుకూడ చూశా, మీరు రోహిణికి ఇచ్చిన వస్త్రాలంకారాలు ఆమె వచ్చి స్వయంగా చూపించింది నాకు.

మీయందు నాకు అచంచలమైన భక్తిఅనీ, అనంతమైన విశ్వాసమని మీమనస్సుకు ఓకూతెలుసు, నాకుతెలుసు కాని అలాంటిదేమీలేదని ఇప్పుడు తెలుసుకున్నా. మీరునాభక్తికి యోగ్యులుగా ఉన్నన్నాళ్ళేనా భక్తి అయినా విశ్వాసమయినా. ఇప్పుడు మీమీద నాకు భక్తీలేదు, విశ్వాసమూ లేదు. మీ దర్శనంవల్ల నాకు సుఖంకూడా లేదు. మీరు ఇంటికి తిరిగివచ్చే ముందు దయఉంచి నాకు కబురుచెయ్యండి. నేను ఏడ్చి రాగాలెట్టి ఎలాగో అలా పుట్టింటికి చేరుకుంటాను" ఇదీ ఆమె రాసిన ఉత్తరం లోని సారాంశం.

గోవిందలాల్‌కు అ ఉత్తరం చేరేసరికి నెత్తిని పిడుగుపడ్డట్లయింది. ఆ దస్తూరీ, ఆ వ్రాసిన విధానం చూసేసరికే అది భ్రమరిరాసిన ఉత్తరమేనని విశ్వాసం కలిగింది, అయినా మళ్ళీ మనస్సులో చాలాసార్లు సందేహంకూడా కలిగింది. భ్రమరి తనకు ఇలాంటి ఉత్తరం రాయగలదని అతడు ఎన్నడూ ఊహించలా.

ఆ పోస్టులోనే మరికొన్ని ఉత్తరాలుకూడా వచ్చాయి ముందు భ్రమరి రాసిన ఉత్తరం తీసి చదివి - చాలాసేపు నిశ్చేష్టుడై ఉండిపోయాడు. తర్వాత మిగతా ఉత్తరాలుకూడా పరధ్యానంగా చదవటం మొదలెట్టాడు. వాటిల్లో బ్రహ్మానందఘోష్ రాసిన ఉత్తరంకూడా ఉన్న దొకటి. కవితాప్రియుడైన బ్రహ్మానంద్ రాసిన ఉత్తరం ఇది—

"సోదరా! రాజులకూ రాజులకూ యుద్ధంఅయితే, మధ్య సన్న జీవాల ప్రాణా లెగిరిపోతూ ఉంటాయి? మీ భార్య మీ విషయమై ఎంత ధాష్టీకంచేసినా చెయ్యవచ్చు. కాని బీదవాళ్ళం మామీద ఎందుకు చెయ్యటం? నువ్వు రోహిణికి ఏడువేలరూపాయల నగలు ఇచ్చావని ఆమె ఒక అపవాదు ప్రచారం చేసింది. ఇంకా ఎంత అసహ్యకరమైన విషయాలు ప్రచారం చేసిందో వ్రాయటానికి నాకు సిగ్గేస్తోంది. ఏమయితే నేను నన్ను ప్రార్థించేదేమిటంటే - నువ్వు వచ్చి దీనికి తగినదేదో చెయ్యమని ........లేకపోతే మేము ఈ ఊరునుంచి మకాం ఎత్తివేస్తాం"

నాలుగోనాడు గోవిందలాల్ వచ్చాడు. భ్రమరి పుట్టింటికి వెళ్లిందనీ ఆమెను మళ్ళీ తీసుకురావటానికి ఆమెకోసం ఇవాళ మేనా వెళ్తుందనీ విన్నాడు, గోవిందలాల్ అంతా గ్రహించాడు, లోలోపల చాలా అభిమానపడ్డాడు " ఎంత అపనమ్మకం! యేమీ తెలుసుకోకుండానే - యేమీ అడగకుండానే నన్ను విడిచి వెళ్లిపోయింది. నేవింక భ్రమరి ముఖం చూడను. భ్రమరి లేకపోతే ప్రాణాలు పోతాయా ఏం?" అనుకున్నాడు మనస్సులో.

ఇలా ఆలోచించి భ్రమరిని తీసుకురావటానికి మనుష్యులను పంపబోతున్న తల్లిని వద్దని వారించాడు. ఎందుకు వద్దంటున్నాడో ఆవిషయమేమీ బయట పెట్టలా. అతడి ఉద్దేశ్యం తెలుసుకుని కోడల్ని తీసుకురావటానికి కృష్ణకాంత్ ఇంకేమీ ప్రయత్నించలా.

---

# 25

ఇలా మూడు నాలుగు రోజులు గడిచిపోయాయి. ఎవరూ వెళ్ళి భ్రమరిని తీసుకురానూలేదు. ఆమె తనంతట తాను రానూలేదు. భ్రమరి చాలా స్పర్థ వహించింది కనుక ఆమెను కొంచెం ఏడిపించాల్సిందే అనుకున్నాడు గోవిందలాల్. భ్రమరి చాలా అనాలోచితమయిన పనిచేసింది కనుక అందుకయినా ఏడిపించాలి అనుకున్నాడు. శూన్యంగా ఉన్న తన గదికేసి చూసి ఒక్కొక్కసారి తనే ఏడ్చేవాడు. భ్రమరికి తనయందు కలిగిన అవిశ్వాసాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని కళ్ళనీళ్ళెట్టుకునేవాడు ఒక్కొక్కసారి. భ్రమరితో పోట్లాట అనిస్పృహకు వచ్చేసరికి ఏడుపువచ్చేది. మళ్ళి అంతలో కళ్ళనీళ్ళు తుడుచుకుని కోపంతెచ్చుకునేవాడు. కోపం తెచ్చుకుని ఆమెను మరచిపోవాలని ప్రయిత్నించేవాడు. మరచిపోవటమంటే సాధ్యమా ఏం? సుఖాన్ని మరిచిపోయినా స్మృతిమాత్రం మరపుకు రాదు. గాయం నయమయినా - అక్కడ పడినమచ్చ నయంకాదు, మనిషి పోయినా అతడిపేరు నిలిచే ఉంటుంది.

చివరకు దుర్బుద్ధి అయిన గోవిందలాల్ భ్రమరిని మరచిపోవటానికి రోహిణిని స్మృతికి తెచ్చుకోవటమే ఉత్కృష్టమైన ఉపాయం మనుకున్నాడు. అలౌకికమయిన రోహిణి సౌందర్య ప్రభ ఏనాడూ

గోవిందలాల్ హృదయాన్ని పిడిచిపెట్టలా గోవిందలాల్ పట్టుదలకొద్దీ దానికి స్థానమిచ్చేవాడు కాడు-కాని అది ఏనాడు అతణ్ణిమాత్రం వదిలి పెట్టలా. ఏ ఇంట్లోనయనా భూతాల బాధ జాస్తిఅయితే వాటిని ఏ మంత్రాలతోనో పోగొడుతారని నవలల్లో చదువుతూ ఉంటాం సాధారణంగా. రోహిణి అనే భూతం కూడా అలాగే రాత్రిం బగళ్ళు గోవిందలాల్ హృదయమందిరనులో బిచాణా వేసేసరికి అతడు దాన్ని వెళ్ళగొడుతూ ఉండేవాడు. చంద్ర సూర్యుల చాయలు కనుక నీళ్ళల్లో ఎలాఉంటాయో అలాగే గోవిందలాల్ హృదయంలో అహరహమూ రోహిణి ఛాయ ఉంటుంది. కాని రోహిణి మాత్రం లేదు. భ్రమరిని పూర్తిగా మరచి పోగలిగినట్లయితే అప్పుడు రోహిణిని జ్ఞప్తికి తెచ్చుకుందాం లేకపోతే ఈ దుఃఖం మరచిపోలేము అనుకున్నాడు గోవిందలాల్. చాలామంది చెడువైద్యులు క్షుద్రరోగాలు పోగొట్టటానికి కూడా ఉత్కటమైన విష ప్రయోగం చేస్తారు. గోవిందలాల్ కూడా క్షుద్రరోగోపశమనం కోసం ఉత్కట విషాన్ని ప్రయోగించటానికి ప్రవృత్తుడయినాడు. గోవిందలాల్ బుద్ధిపూర్వకంగా తనంతటతాను అనిష్టసాధనయందు ప్రవృత్తుడయినాడు.

రోహిణి విషయం మొదట్లో స్మృతిగామాత్రమే ఉండేది. తర్వాత అది దుఃఖంగా పరిణమించింది. దుఃఖంనుంచి వాంఛగా పరిణమించింది. గోవిందలాల్ వారుణి చెరువు గట్టున పుష్పవృక్షాలతో పరివేష్టితమైన మండప మధ్యములో కూర్చుని ఆ వాంఛకోసమె పరితపిస్తున్నాడు. వర్షా కాలం ఆకాశమంతా మబ్బులు దట్టంగా కమ్ముకున్నాయి. వర్షం మధ్య మధ్య బాగా కురుస్తోంది. కొంతసేపు మామూలు చినుకులు మాత్రమే పడుతున్నాయి--కాని వర్షం మాత్రం పోలేదు. చీకటి పడింది. సహజంగాఉండే రాత్రి అంధకారమూ, ఆ పైన మేఘాల అంధకారములో. వారుణి రేవు స్పష్టంగా కనిపించటంలా. ఒక స్త్రీ నీళ్ళల్లోకి మెట్లు దిగుతూఉండటం గోవిందలాల్ అస్పష్టంగా చూశాడు. రోహిణి ఆనాడు ఇలాగే మెట్లు దిగటం అతడికి జ్ఞాపకం వచ్చింది. వర్షంమూలంగా రేవు అంతా జారుడు జారుడుగా ఉంది—ప్రక్కకు కాలుజారి ఆ స్త్రీ నీళ్ళల్లో పడిందంటే పెద్ద ఆపద సంభవిస్తుందే అని ఆలోచించి గోవిందలాల్ గాభరా పడ్డాడు. ఆ పుష్పమండపములోనే కూర్చుని, "ఎవరు నువ్వు? ఇవాళ రేవులో దిగకు, చాలా జారుడుగా ఉంది, పడి పోతావు" అని కేకేశాడు.

ఆ స్త్రీ అతడి మాటలు స్పష్టంగా విన్నదో లేదో చెప్పలేము. వర్ష పుధ్వనిలో బహుశా ఆమెకు వినిపించలేదేమో: చంకనున్న బిందె మెట్ల మీద పెట్టి, మళ్ళీ మెట్లెక్కి పైకి వచ్చి మెల్లిమెల్లిగా గోవిందలాల్ ఉద్యానంకేసి నడిచింది. ఆ ఉద్యానం గేటు తెరిచి లోపలికి వెళ్లి గోవిందలాల్ దగ్గిరకు వెళ్లి ఆ మండపందగ్గిర నిలబడింది. గోవిందలాల్ ఇటు చూసేసరికి ఎదురుగా రోహిణి.

"తడుస్తూ తడుస్తూ ఇక్కడికి వచ్చావెందుకు రోహిణీ?" అని అడిగాడు.

"మీరు పిలిచారా నన్ను?"

"పిలవలేదు. రేపు జారుతోంది, దిగవద్దన్నాను. తడుస్తూ నుంచోటం దేనికి?"

రోహిణి ధైర్య చేసి మండపంలోకి వచ్చింది. "లోకులు చూస్తే ఏమనుకుంటారు?" అని అడిగాడు గోవిందలాల్.

"ఏమనుకోవాలో అదే అనుకుంటున్నారు, ఆ విషయం మీదగ్గిర చెబుదామని ఎంతో ప్రయత్నిస్తున్నా"

"ఆ విషయమై నేనూ అడిగి తెలుసుకోవాల్సింది కొంత వుంది. ఎవరు ఇది ప్రచారం చేసింది? ఈ నెపం మీరు భ్రమరిమీద వేస్తారు దేనికి?"

"అంతా చెబుతా. కాని ఇక్కడ నుంచుని ఎలా చెప్పటం?"

"ఇక్కడ వద్దులే నాతోరా"

అని గోవిందలాల్ రోహిణిని వెంటపెట్టుకుని అ తోటలోని బంగళాలోకి తీసుకువెళ్లాడు.

అక్కడ వాళ్లిద్దరూ యేమేమి మాట్లాడుకున్నారో - అదంతా చెప్పాలనే ఉద్దేశ్యం లేదు నాకు. కాని రోహిణి రూపాన్ని చూసి గోవిందలాల్ ముగ్ధుడైనట్లు తిరిగి ఇంటికివెళ్లేముందు రోహిణి గ్రహించిందని మాత్రం చెప్పగలను.

---

## 26

అందానికి ముగ్ధులవటమా? ఏం ఎవరుకారు? నేను సీతాకోక చిలుక సౌందర్యానికి ముగ్ధుణ్ని అయితే, నువ్వు బాగా వికసించిన గులా

బీరెమ్మ సౌందర్యానికి ముగ్ధుడిని అవచ్చు. అందులో తప్పేముంది? రూపం మోహంకోసమేగా అసలు జన్మించింది!

గోవిందలాల్ మొదట్లో ఇలాగే ఆలోచించాడు. పాపంయొక్క ప్రథమ సోపానంమీద అడుగుపెట్టిన పుణ్యాత్ములుకూడా ఇలాగే ఆలోచిస్తారు. గోవిందలాల్‌ని అధఃపతనంకూడా క్రమంగా చివరి మెట్టువరకూ దిగింది. ఎందుకువెళ్ళదు? రూపతృష్ణ అతడి హృదయాన్ని ఎన్నాళ్ళనుంచో శుష్కింపచేసింది అతడి అధఃపతనానికి నేను జాలిపడగలను కాని, దాన్ని సమర్థించనుమాత్రం సమర్థించలేను.

క్రమంగా రోహిణీ గోవిందలాల్ సంగతి కృష్ణకాంతుని చెవిని పడి దుఃఖితుడయినాడు గోవిందలాల్ ప్రవర్తనలో మాత్రం కళంక మున్నా ఆయనకు చాలా కష్టం తోస్తుంది. గోవిందలాల్‌ను కొంచెం మందలించాలని అనుకున్నాడు. కాని ప్రస్తుతం ఆయనకు అస్వస్థతగా వుండటంవల్ల పడకగది విడిచి బైటికి రావటంలా. గోవిందలాల్ ఆయన్ని చూడటానికి రోజూ వెడుతున్నాడు కాని, ఆయనచుట్టూ ఎప్పుడూ నౌకర్లూ వగైరా వుంటూనేవుంటారు. వాళ్ళందరిముందరా గోవిందలాల్‌తో ఏమీ మాట్లాడలేకపోయేవాడు. కృష్ణకాంత్‌కు జబ్బు క్రమక్రమంగా ఎక్కువ కాజొచ్చింది. ఈ జీవితం పరిసమాప్తికి చేరువలో ఉన్నట్లు - మృత్యువుదగ్గిర్నుంచి ఆహ్వానం వచ్చినట్లు తోచింది కృష్ణకాంత్‌కు. గోవిందలాల్ ఒకనాడు రాత్రి చాలా ప్రొద్దుపోయాక తోటలోంచి తిరిగి వచ్చాడు. కృష్ణకాంత్ ఆరోజునే గోవిందలాల్‌తో చెబుదామని మనస్సులో అనుకున్నాడు. గోవిందలాల్ చూడటానికి వచ్చాడు కృష్ణకాంత్ ప్రక్కనున్నవాళ్ళను బైటికి వెళ్ళమని ఆదేశించాడు. వారంతా లేచి వెళ్ళిపోయారు. గోవిందలాల్ కొంచెం తెల్లబోయి "మీరివాళ ఎలాగో ఉన్నారేం?" అని అడిగాడు. కృష్ణకాంత్ క్షీణస్వరంతో "ఇవాళ నాకు వంట్లో ఏమీ బాగాలేదు. నీవు ఇవాళ ఇంత ప్రొద్దుపోయిందేం?" అన్నాడు.

గోవిందలాల్ ఆ మాటకేమి సమాధానం చెప్పకుండానే కృష్ణకాంత్ చెయ్యి తన చేతుల్లోకి తీసుకుని నాడీనిదానం చెయ్యసాగాడు. చటుక్కున గోవిందలాల్ ముఖం ఎండుకుపోయింది. కృష్ణకాంతుని జీవితప్రవాహం అతి నెమ్మదిగా ప్రవహిస్తోంది. "నేను ఇప్పుడే వస్తు

న్నాను" అని చెప్పి గోవిందలాల్ అక్కడనుంచి లేచివచ్చి స్వయంగా వైద్యుడిఇంటికి వెళ్లాడు వైద్యుడు ఇతణ్ణి చూసి విస్మితుడైనాడు.

"మీరు మందుతీసుకుని త్వరగా రండి మహాశయా! పెదనాన్న గారి పరిస్థితి అంత బాగున్నట్లు తోచదు" అన్నాడు గోవిందలాల్ వైద్యుడు హడావుడిగా కావలిసిన మందులు తీసుకుని అతడివెంట పరుగు తీశాడు. కృష్ణకాంతుని గదిలోకి గోవిందలాల్ వైద్యుడితోసహా ప్రత్యక్ష మయేసరికి అతడు కొంచెం భయపడ్డాడు. వైద్యుడు చెయ్యిచూశాడు. "ఎలావుంది? ఏమన్నా అనుమానం తోస్తుందా ఏం?'' అని అడిగాడు కృష్ణకాంత్. "మానవశరీరమయింతర్వాత అనుమానం లేనిదెప్పుడు?" అన్నాడు వైద్యుడు.

కృష్ణకాంత్ గ్రహించి "నాకింక ఎంతసేపుంది గడువు?'' అన్నాడు

"మందుపుచ్చుకున్నాక చెబుతాను" అని వైద్యుడు మందునూరి కృష్ణకాంత్ ముందరపెట్టాడు. కృష్ణకాంత్ ఆ మందుగిన్నె తీసుకుని, ఒక్కసారి శిరస్సు తాకించుకుని, ఆ మందుఅంతా పీకదాన్లో పార పోశాడు.

వైద్యుడు విషణ్ణుడైనాడు. కృష్ణకాంత్ అది చూచి మీరు విచార పడకండి. మందు త్రాగి బ్రతికేంత వయస్సు లేదు నాకు. మందుకన్నే హరినామస్మరణే నాకు తరణోపాయం. మీరుహరినామస్మరణ చెయ్యండి వింటాను నేను'' అన్నాడు.

కృష్ణకాంత్ తప్ప ఇంకెవ్వరూ హరినామస్మరణ చెయ్యలేదు. కాని అందరూ భయభ్రాంతులైనారు; విస్మితులైనారు; స్తంభితులైనారు కృష్ణకాంత్ ఒక్కడే నిర్భయంగావున్నది! "నాతలంపిదిక్కున డ్రాయరు తాళంచెవిఉంది. బైటికి తియ్యి" అన్నాడు గోవిందలాల్‌తో కృష్ణకాంత్.

గోవిందలాల్ దిండు క్రిందనుంచి తాళంచెవి తీశాడు. డ్రాయరు తెరిచి నా వీలునామా పైకితియ్యి'' అన్నాడు కృష్ణకాంత్.

గోవిందలాల్ డ్రాయరు తెరిచి వీలునామా బైటకితీశాడు. "మన గుమాస్తాలనూ-ఊళ్లో పదిమంది పెద్దమనుష్యులనూ పిలిపించు''అన్నాడు కృష్ణకాంత్.

అప్పుడే మేనేజరు, గుమాస్తాలూ - ఛటర్జీ, ముఖర్జీ, బెనర్జీ భట్టా చార్య, ఘోష్, బోస్, మైత్రాలతో ఇల్లునిండిపోయింది.

"నా వీలునామా చదువు" అని కృష్ణకాంత్ ఒక గుమాస్తాని ఆజ్ఞాపించాడు.

గుమాస్తా చదివాడు.

"ఈ వీలునామా చింపేసి, కొత్త వీలునామారాయి" అన్నాడు కృష్ణకాంత్.

"ఎలా రాయాలి?" అని ప్రశ్నించాడు గుమాస్తా

"గోవిందలాల్ పేరుమాత్రం అందులోంచి తొలగించి ఆ స్థానంలో నా తమ్ముడి కోడలు భ్రమరిపేరుమాత్రం రాయి భ్రమరి తదనంతరం ఈ సగభాగం గోవిందలాల్‌కు చెందేటట్లురాయి."

అందరూ నిశ్చేష్టులైనారు. ఎవ్వరూ ఏమీ మాట్లాడలా. గుమాస్తా గోవిందలాల్ ముఖంకేసి చూశాడు.

గుమాస్తా వ్రాయటం ప్రారంభించాడు. వ్రాయటం పూర్తి అయాక కృష్ణకాంత్ సంతకం చేశాడు. సాక్షులు కూడా సంతకాలు చేశారు. గోవిందలాల్ తనంతటతానుకోరి వీలునామాతీసుకుని తానుకూడా సాక్ష్యం సంతకం చేశాడు.

వీలునామాలో గోవిందలాల్‌కు ఒక్క దమ్మిడీ కూడా రాయలా. భ్రమరికిమాత్రం సగభాగం.

ఆ రాత్రే హరినామస్మరణచేస్తూ తులసీపత్రశాయియై కృష్ణకాంత్ పరలోకగతుడైనాడు.

---

## 27

కృష్ణకాంతుని మరణవార్త ప్రజలకు కొంత సంక్షోభాన్ని కలిగించింది. దేవేంద్రుడే చనిపోయాడన్నారు కొందరు. దిగ్గజంలాంటివాడు పోయాడన్నారు కొందరు. పర్వతం కూలిపోయిందన్నారు మరికొందరు. కృష్ణకాంత్ ఎంత భోగపురుషుడో అంత మర్యాదకలవాడు కూడా. దీన దరిద్రులకు దానధర్మాలుచేస్తూ ఉండేవాడు. అంచేత అతడంటే అందరికీ అభిమానమే.

అందరికన్న ఎక్కువది భ్రమరి. ఇప్పుడు ప్రతిపనికీ భ్రమరి ఉండాల్సిందే. కృష్ణకాంత్ పోయినమర్నాడే గోవిందలాల్ తల్లి కోడల్ని తీసుకురావటానికి మనిషిని పంపింది. భ్రమరివచ్చి మామగారు పోయినందుకు మహాఏడ్చింది.

భ్రమరీ గోవిందలాల్ ఇద్దరూ మొట్టమొదట కలుసుకోగానె రోహిణివిషయమై పెద్ద ప్రళయంవచ్చినట్లు తగాదారావల్సిందేగా అంటే చెప్పలేను; కాని కృష్ణకాంత్ పోయాడనే దుఃఖములో ఆవిషయాలన్నీ అడుగునపడ్డాయి. భ్రమరికి గోవిందలాల్ మొదటకనపడగానే ఆమె పెదమామగార్ని తలుచుకొని ఏడుస్తున్నదల్లా—ఇతణ్ణిచూచి మరింత ఏడువసాగింది. గోవిందలాల్ కూడా కంటతడిపెట్టాడు.

అందేత ఎంతగొడవజరుగుతుందో అన్న ఆశంక ఈ ఏడుపుతో తుడుచుకుపోయింది. ఆసంగతి వారిద్దరు గ్రహించారు మొదటకన్పించగానే ఆవిషయాలేమీ ఎత్తకూడదని మనస్సులో ఇద్దరూ అనుకున్నారు. అందేత యింతగొడవ జరగాల్సిన అవసరంలేదు—అసలు అందుకిది సమయమూకాదు. కృష్ణకాంతుని శ్రాద్ధవిధులు పూర్తికానీ—తర్వాత ఎవరి మనస్సులో ఏమున్నదీ అప్పుడే బైటపడుతుంది. అలా ఆలోచించి తగిన సమయముకనిపెట్టి "భ్రమరీ నీతోనేనుమాట్లాడవలసిన సంగతులల్నాయి కొన్ని. అవిచెప్పాలంటే నాగుండె తరుక్కుపోతుంది. పితృశోకంకన్న అధికమైనశోకం ఏదైనాఉన్నదీఅంటే అదే ఆశోకంతో కుళ్ళిపోతున్నాను ఇప్పుడునేను. ఆసంగతులన్నీ ఇప్పుడునీకు నేనుచెప్పలేను. నేను శ్రాద్ధావిధులన్నీ పూర్తిఅయాక చెప్పవలసినవన్నీచెబుతా. ఈలోపున ఆవిషయాలను ఎత్తవలసిన అవసరంలేదు." అని భ్రమరికి చెప్పివుంచాడు గోవిందలాల్.

భ్రమరి అతికష్టంమీద అశ్రువులు సంబాళించుకొని - చిన్నప్పటి నుంచి అలవాటయిన దేవతలపేర్లన్నీ తలచుకొని "నేనూ చెప్పవలసిన సంగతులున్నాయి కొన్ని. మీకు అవకాశం లభించినప్పుడు అడగండి" అన్నది.

ఇంక సంభాషణ ఏమిజరగలా రోజులు ఎలాగో అలాగడిచి పోతున్నాయి, దాసీలుకాని, ఊళ్ళోవాళ్ళుకాని, బంధువులుకాని—'ఆకాశంలో మేఘం వ్యాపించింది' 'పువ్వులో పురుగు ప్రవేశించింది'-అందమయిన

ఈ స్త్రీ హృదయాంతరాళంలో కీటకం ప్రవేశించింది, అని తెలుసుకోలేనంత గుంభనంగా జరిగిపోయిన మార్పులే అవి. కాని కీటకం ప్రవేశించినమాట మాత్రం వాస్తవం. ఇదివరకున్న చిరునవ్వులు ఇప్పుడులేవు ఏం భ్రమరి నవ్వదా? గోవిందలాల్ నవ్వడా? నవ్వుతారు: కాని ఆనవ్వులులేవుఇప్పుడు కళ్లూకళ్లూ కలుసుకోగానే వాటంతటవే వచ్చేనవ్వులు లేవు ఇప్పుడు. ప్రేమవ్యక్తమయే ఆనవ్వులు లేవు ఇప్పుడు ఈసంసారం సుఖమయం-సుఖాకాంక్ష ఇంకా తీర్చరాలేదని వ్యక్తమయ్యే ఆనవ్వులు లేవు ఇప్పుడు. ఆచూపులు - భ్రమరి [illegible] చూచి "అబ్బ ఎంత అందం!" అనిఅనుకునేదో-గోవిందలాల్ ఎలాచూచి "ఎంతతెలివిలేటది" అని అనుకునేవాడో— ఆచూపులు లేవు ఇప్పుడు. గోవిందలాల్ స్థిరదృష్టిని ప్రసన్నమైన నేత్రాలనూ ఏదృష్టితో చూసి-ఈసముద్రాన్ని నేను ఈజీవితంలో ఈది ఒడ్డుకు చేరుకోలేనని భ్రమరి అనుకునేదో—గోవిందలాల్ ఏదృష్టితో ఆమెను చూస్తూ ఈప్రపంచాన్ని విస్మరించేవాడో ఆచూపులులేవు ఇప్పుడు. అప్పటి ప్రియమైన సంబోధనలు — భ్రమరీ—భ్రమరా—భోమరా—బొమ—భామీ—భొ—ఇలాంటివేమీ లేవు ఇప్పుడు. నిత్యనూతనములూ-స్నేహపూర్ణములూ సుఖపూర్ణములూ అయిన ఆపిలుపులేలేవు ఇప్పుడు. "ఇదిగో! ఓయ్, ఏమండోయి; మిమ్మల్నే—అని ఆమె పిలుపులూలేవు. ఆపరిహాసాలూ—వేళాకోళాలులేవు. అప్పుడు మాట్లాడుకునేతీరే లేదిప్పుడు. అప్పుడు మాటలకు వెతుక్కోవాల్సి వచ్చేదికాదు; ఇప్పుడు వెతుక్కోవాల్సివస్తోంది. మొదట్లో గోవిందలాలూ భ్రమరీ కలిసివుంటున్నరోజుల్లో ఎవరైనావచ్చి గోవిందలాల్‌ను పిలిచినా సుభంగా పట్టుకో గలిగేవారుకారు. భ్రమరిని పిలిస్తే పరికసల అంలేచివెళ్ళేదికాదు - ఇప్పుడో ఎవరో పిలుస్తున్నట్లున్నారే", అని వాళ్ళంతటవాళ్ళే లేచి వెడుతున్నారు. ఆ సంపూర్ణ చంద్రబింబాన్ని ఏదో మేఘంవచ్చి క్రమ్మేసింది. కార్తిక పూర్ణిమాచంద్రుడికి గ్రహణం సంప్రాప్తమయింది.

మధ్యాహ్న రవి కిరణాంతో నిండించిన ఆ హృదయంలో అంధకారం అలుముకుంది [illegible] గోవిందలాల్ ఆ అంధకారంలో [illegible] [illegible] ఆ ఘోరాంధకారం [illegible] [illegible] [illegible] మిత్రులకు [illegible] గంధాలు [illegible] ప్రతిష్ఠాపనమూ మృత్యువే. దుఃఖ

వినాశనమూ, దీనులను రంజింపజేసేగి, ఆపదలనుపోగొట్టేదీ మృత్యువు. ఆశాహీనుల్యులకు ఆశ, ప్రేమ విహీనులకు ప్రేమా మృత్యువే.

---

# 28

తర్వాత కృష్ణకాంతునికి శ్రాద్ధాదివిధులు భారీగానే జరిగాయి. పది వేలయినా ఖర్చు అయి ఉంటుందిరే అనుకున్నారు శత్రువులు కూడా. ఇహ మిత్రులైనవారు లక్షరూపాయలు ఖర్చు అయి వుంటుంది అనుకున్నారు. కృష్ణకాంతుని ఆస్తికి ఉత్తరాధికారులు మిత్రబృందం దగ్గర రహస్యంగా యాభైవేలు ఖర్చు అయిందని చెప్పారు. మేము చూసిన కాతా పుస్తకం లెఖ్ఖలనుబట్టి మొత్తం రు 32356-12 4 అయింది ఖర్చు

ఎంతఅయితే ఏం-కొన్నాళ్ళు చాలాహడావుడిగా గడిచిపోయాయి. శ్రాద్ధకర్త హరలాల్ వచ్చి శ్రాద్ధం నిర్వర్తించాడు.

ఆ శ్రాద్ధానికి చేసిన మామూలు భోజనపు ఏర్పాట్లు-పిండివంటల ఖర్చులు-పళ్ళ కయిన ఖర్చులూ అన్నీ చిత్రవిచిత్రంగా చెప్పుకోటం సాగించారు.

శ్రాద్ధం తాలూకు కోలాహలం తగ్గగానే వీలునామాను గురించిన కోలాహలం ప్రారంభమయింది హరలాల్ వీలునామా చదివి చూశాడు. గోలెక్కడం ముంది సాక్షులు-తాను ఏ గందరగోళం చేద్దామన్నా సాగేట్లుగా లేదు అంచేత అతడు శ్రాద్ధం పూర్తికాగానే స్వస్థానానికి తిరిగివెళ్లాడు.

వీలునామా చదివి వచ్చి గోవిందలాల్ "వీలునామా సంగతి విన్నావా?" అని అడిగాడు భ్రమరిని.

"ఏమిటి"

"నీకు సగభాగం"

"నాది-మీదికాదా?"

"ఇప్పుడు నీకూ నాకూ కొంచెం తేడా ఉంది, నాది కాదు నీదే"

"అలా అయినా మీదే"

"నీ ఆస్తిని నేను అనుభవించను"

"భ్రమరికి పెద్దపెట్టున ఏడుపువచ్చింది. కాని ఆమె అహంకారానికి వశీభూతురాలై-దుఃఖాన్ను దిగమ్రింగి "అయితే ఏం చేస్తారు?"అంది

"నాలుగురాళ్ళు సంపాయించుకుని రోజులు వెళ్ళబుచ్చుకునేందుకు ఏదయినా ఉపాయంఉంటే-అదిచేస్తాను"

"ఏమిటది?"

"ఊరూరా తిరిగి ఉద్యోగంకోసం సంప్రతిస్తాను"

"ఈ ఆస్తి మా పెదమామగారిది కాదు-మా మామగారిదే.

దానికి ఉత్తరాధికారులు మీరేకాని నేను కాదు. వారికి వీలునామా రాసే అధికారమేలేదు. అది చెల్లదు. మా నాన్న శ్రాద్ధానికి ఇక్కడకు వచ్చినప్పుడు ఈ సంగతి చెప్పి వెళ్ళాడు. ఆస్తి మీది, నాది కాదు''

"మా పెదనాన్నగారు మిథ్యావాదులు కారు. ఆస్తి నీదే కాని నాది కాదు. ఆయన ఆస్తి ఎప్పుడైతే నీకు రాసి యిచ్చాడో-అప్పుడది నీదే అవుతుంది, కాని నాది కాదు.''

"అలాంటి సందేహమే కనుకఉంటే నేను మీకు రాసియిస్తాను.''

'నీ దానాన్ని పరిగ్రహించి దానిమీద ఆధారపడి బ్రతకాలా నేను?''

"దానివల్ల వచ్చే నష్టమేమిటి? నేను మీకు దాసురాలినికానా ఏం?"

"ఇవాళ మాటలు రేపు ఉండవు భ్రమరీ!''

"ఏం చేశాను నేను? ఈ ప్రపంచంలో నేను మిమ్మల్ని తప్ప ఇంకేమీ ఎరగను. ఎనిమిదోయేట నా పెళ్ళి అయింది. ఇప్పుడు పదిహేడేళ్లు వచ్చాయి నాకు. ఈ తొమ్మిదేండ్లనుంచీ నేను మిమ్మల్ని తప్ప ఇంకేమీ ఎరగను. మిమ్మల్నిమాత్రమే ఎరిగున్నాను. నేను మీ పోషణలో ఉండేదాన్ని-మీ ఆటవస్తువులాంటి దాన్ని-నా వల్ల జరిగిన అపరాధమేమిటి?''

"ఆలోచించి చూసుకో''

"ఆసమయంలో పుట్టింటికి వెళ్లాను. పొరపాటు జరిగింది వెయ్యి అపరాధాలు జరిగాయి. నన్నుక్షమించండి. నేను మిమ్మల్ని తప్ప ఇంకేమీ ఎరగను అంచేత కోపం తెచ్చుకున్నాను.''

గోవిందలాల్ మాట్లాడలేదు చెదరిపోయిన ముంగురులతో అశ్రువిప్లుతా, వివశ ముగ్ధా అయిన ఆ పదిహేడేళ్ళ యువతి అతడికాళ్ళ ముందరపడి పొర్లుతోంది. గోవిందలాల్ మాత్రం మాట్లాడలేదు. అతడు

అనుకున్నాడు:—"ఈమె నల్లనిది-రోహిణి ఎంత అందకత్తె! ఈమెకు త్రైవితేటలూ వినయవిధేయతలూన్నాయి. ఆమెకు సౌందర్యం ఉంది. ఇన్నాళ్ళూ ఈమె గుణాల్ని సేవించా. ఇహ కొన్నాళ్ళు ఆమెరూపాన్ని ఆరాధిస్తాను. సారవిహీనమూ, ఆశాశూన్యమూ ప్రయోజనరహితమూ ఈ నా జీవితాన్ని నా యిష్టం వచ్చినట్లు గడుపుకుంటాను. మట్టికుండను ఏనాడు బుద్ధిపుడితే ఆ నాడే పగలకొట్టి పారేయవచ్చు".

భ్రమరికి జవాబు రాకపోయేసరికి 'ఏమంటారు?" అంది.

"నేను నిన్ను విడిచిపెట్టేస్తాను." అన్నాడు గోవిందలాల్.

భ్రమరి అతడి పాదాల్ని విడిచిపెట్టి లేచింది బైటికి వెళ్ళిపోతూ గుమ్మం తగిలి పడి మూర్చితురాలైంది.

---

## 29

" నే నేం అపరాధంచేశానని విడిచిపెట్టారు నన్ను ?" ఈమాట భ్రమరి గోవిందలాల్ ముఖం ఎదట అడగలేకపోయింది; కాని ఆసంఘటన జరిగింతర్వాత ప్రతిక్షణమూ" నాఅపరాధం ఏమిటి?" అని మనస్సులో ప్రశ్నించుకోసాగింది.

భ్రమరి అపరాధం ఏమిటా అని గోవిందలాల్ కూడా తన మనస్సును తరిచి చూసుకోసాగాడు. భ్రమరి మహాపరాధం చేసిందని అతడికొకనిశ్చయం మాత్రం కలిగింది ఏమిటా అపరాధం అన్నసంగతి మాత్రం అంతగా ఆలోచించలేదు. భ్రమరికి తనయందు అపనమ్మకం కలిగింది. అంచేతనే అంత కఠినంగా రాసిందా ఉత్తరం. పోనీ ఒకసారి తన ఎదుటపడి అందులో నిజానిజాలు తెలుసుకుందా? అదీలేదు. తాను ఎవరికోసమయితే ఇంతచేశాడో ఆమె అంత సులభంగా తనమీద అపనమ్మకం ఏర్పరుచుకుంది ఇదే ఆమె అపరాధం. సుమతి కుమతుల కథ పూర్వం రాశాను నేను. గోవిందలాల్ హృదయంలో అవి రెండూ కూర్చుని చేసుకున్న వాదోపవాదాలు విన్పిస్తాను.

"భ్రమరి మొదటి అపరాధం ఇదే; ఈ అపనమ్మకమే" అన్నది కుమతి.

"విశ్వాసయోగ్యులు కానివారిని విశ్వసించకపోవటంలో తప్పు ఏముంది? నువ్వు రోహిణితో కలసి ఏ ఆనందాన్నయితే అనుభవించావో- అది సందేహించదనేనా ఆమె అపరాధమంతా?" అన్నది సుమతి.

"నేను ఇప్పుడు అవిశ్వాసయోగ్యుణ్ణి అయినాను. కాని భ్రమరి విశ్వసించకపోయినప్పుడు మాత్రం నేను నిర్దోషినే"

"రెండు రోజులు వెనకయితే యేం, ముందయితే యేం-అపరాధం ఎటూ చేశావు. ఆ అపరాధాన్ని చెయ్యగలిగినవాడిని అపరాధి అని అనుకోవటం మహాపరాధమా?"

"భ్రమరి నన్ను దోషి అని అన్నది కనుకనే దోషినయినాను. ఎంత సాధువును కూడా దొంగ దొంగ అంటే దొంగ కాకుండామానడు".

"దొంగ అన్నవారిదే దోషం గాని, దొంగతనం చేసినవారిది దోషం కాదన్నమాట.

"నీతో నేను వాదిస్తూ కూర్చోలేను. భ్రమరి నా కెంత అవమానం చేసిందో చూడు. నేను ఊరునుంచి వస్తున్నానని వినికూడా ఆమె స్టేషంటికి వెళ్ళిపోలేమా?"

"ఆమె ఏదయితే భావించుకుందో దాని మీద ఆమెకు దృఢ విశ్వాసం కలిగి ఉంటుంది. అంచేతనే దానికి తగినట్లు ప్రవర్తించి ఉంటుంది. భర్త పరస్త్రీ నిరతుడైనప్పుడు ఏ పడి వ్రపభుక్త గుర్తుకువస్తే ఎవరు [illegible] గించుకోరు?

"ఆ అంధవిశ్వాసమే ఆమె [illegible]మ—ఇంకా ఇంతకన్న దోషం ఏం కావాలి?"

"ఈవిషయం ఆమెను ఒక్కసారి అడిగి చూశావా?"

"లేదు"

"నువ్వు ఏమీ అడగకుండానే ఇంత కోపం తెచ్చుకున్నావు. ఇంక భ్రమరి అంటావా—ఆమె బాలిక, అడిగి తెలుసుకోకుండా కోపగించుకున్నదని ఇంత గందరగోళమా? అదికాదు అసలు సంగతి. అసలు కోప కారణం ఏమిటో చెబుతావా?"

"ఏం చెప్పను?"

"అసలు సంగతి రోహిణి. రోహిణి ఎందికి పోయిలది మనస్సు: అంచేత నల్లగా ఉండే భ్రమరి మనస్సుకు నచ్చటంలా?"

"ఇన్నాళ్ళనుంచీ భ్రమరి ఎలా నచ్చింది మరి?

"ఇన్నాళ్ళనుంచీ రోహిణితో జత కుదరలేదు కనుక. ఒక్క రోజులో జరగా ఏదీ. సమయం వచ్చే సరికి అన్నీ వాటంతటవే సమకూరుతాయి. ఇవాళ తీవ్రంగా ఎండకాసిందని రేపు వర్షం కురవదు ఏం చేత? అంతే కాదు అసలు ఇంకో విషయం కూడా ఉన్నది" అన్నది సుమతి.

"ఇంకేమిటి?"

"కృష్ణకాంతుని వీలునామా ఆస్తి భ్రమరి పేర రాసిపోలే-అది నాకే ఉంటుందని ముసలాయనకు తెలుసు. భ్రమరి ఒక నెలలోపునే మళ్ళీ నీకా ఆస్తి రాసి ఇస్తుందనీ తెలుసు కాని నువ్వు చెడుమార్గాన సంచరిస్తున్నావని తెలిసి నిన్ను బాగుచేద్దామనే ఉద్దేశ్యంతో భ్రమరి కొంగుకు ముడివేసిపోయాడు నువ్వు ఇదంతా తెలుసుకోలేక భ్రమరి మీద కోపం తెచ్చుకున్నావు."

"అది నిజమే. నేను భార్య ఇచ్చే భత్యం తీసుకుని జీవించనా?"

"నీ ఆస్తి నువ్వు భ్రమరిచే ఎందుకు రాయించుకుని తీసుకోలా?"

"భార్య ఇచ్చిన దానంతో కాలక్షేపం చెయ్యనా?"

"అబ్బో! ఎంత పురుషసింహాదవంటేనూ! అయితే భ్రమరి మీద దావావేసి డిక్రీ పొంది పుచ్చుకోపోయావా? నీ [illegible] అన్నమాట నిజమేగా"

"[illegible] దావా వేయనా?"

"అయితే ఇంకేమి చేస్తావు? దేశాలమీద పోతావా?"

"ఆ ప్రయత్నంలో ఉన్నా"

"రోహిణిని కూడా వెంట తీసుకొని పెడతావా?" అంది సుమతి ఆ[illegible] సుమతి [illegible]మతులకు [illegible] సంఘర్షణ చెలరేగింది.

---

## [illegible]0

[illegible] గోవిందలాల్ తల్లి [illegible] గృహిణి అయినట్లయితే - ఆమె [illegible] ఏడిపోయేదని మా విశ్వాసం. కోడ[illegible] మానసికంగా నిస్పృదంకలిగిందని ఆమెగ్రహించింది.

ఆడవాళ్లు ఇలాంటివి సులభంగా గ్రహిస్తారు. ఆమెకనుక ఈసమయంలో మంచిమాటలతోనో, సదుపదేశంతోనో - స్త్రీబుద్ధి సులభములైన ఇతర ఉపాయాలతోనో దీనికి ప్రతీకార ప్రయత్నంచేసి ఉన్నట్లయితే మంచి ఫలితాలు కన్పించేవేమో। కాని గోవిందలాల్ తల్లి అంతవాకచక్యం కలస్త్రీకాదు. పైగా కోడలిమీద తానుఅధికారం చెలాయించవచ్చు ననే ఊహతో భ్రమరిలో కొంచెం విరోధంకూడ తెచ్చుకుంది.కొడుకుఉండగా కోడలికి ఆస్తి రాసివ్వటం ఆమెసహించలేకపోయింది. భ్రమరి గోవింద లాల్‌కు అభిన్నసంపత్తి అని తెలుసుకునీ గోవిందలాల్ ప్రవర్తన మం చిదికాదని తెలుసుకునీ, కృష్ణకాంత్‌రాయి గోవిందలాల్‌ను అదుపులో ఉంచటానికి భ్రమరికి ఆస్తిరాసియిచ్చి వెళ్ళాడని ఆమె ఊహకు ఒక్క సారి అయినా తట్టలా. కృష్ణకాంత్ చనిపోయేముందు కొంత మతిభ్రం శం కలిగి చెయ్యకూడనిపని చేశాడేమో అని అయినా ఆమె ఆలోచిం చలా, కోడలి సంసారంలో తనకు కేవలం భుక్తిమాత్రమే అధికారం ఉందనీ, కేవలం వీరితిండిమీద ఆధారపడి వుండేవాళ్ళలో తానూ ఒకతె అయివుండి జీవితం వెళ్ళబుచ్చవలసిందే అనిమాత్రమే ఆలోచించింది. అంచేత ఈసంసారాన్ని విడిచి ఎక్కడికయినావెళ్ళిపోవాలని నిశ్చయించు కుంది. అసలు భర్తృవిహీన అయిన కొడుకులంటే ఎంతోవాత్సల్యమూ, భర్తపోయిం దగ్గర్నుంచీ కాశీవెళ్లాలని అనుకుంటూనే ఉండేది. కాని స్త్రీసహజ మయిన పుత్రప్రేమవల్ల ఇన్నాళ్లనుంచి వెళ్ళలేకపోయిం దామె. ఇప్పుడా వాంఛ మళ్లీ ప్రబల మయింది.

ఆమెగోవిందలాల్‌ను పిలిచి "పెద్దవాళ్ళంతా ఒక్కొక్కరే స్వర్గ స్థులైనా . ఇహనాకుకూడా సమయం దగ్గరికు వచ్చింది పుత్రుడైననువ్వు చెయ్యవలసిన పనిచెయ్యినాయనా। ఇహనన్ను కాశీపంపించు"అనిచెప్పింది.

ఈప్రస్తావనకు గోవిందలాల్ చటుక్కున సమ్మతించాడు "పద నిన్ను నేనే తీసుకువెళ్లికాశీలో దింపించి వస్తాను'' అన్నాడు. దురదృష్ట వశాత్తూ ఆసమయానికి భ్రమరి ఒకసారి పుట్టింటికివెళ్ళింది. ఎవ్వరూ ఆమెను వద్దనిఅడ్డుపెట్టలేదు అంచేతభ్రమరికి తెలియకుండా గోవిందలాల్ కాశీయాత్రకు తగినసన్నాహాలన్నీ చెయ్యసాగాడు. అతడిపేర ప్రత్యే కంగా కొంతఆస్తిఉంటే దాన్నిరహస్యంగా అమ్మేశాడు తనవగ్గర బంగా రం వజ్రాలు - స్వంతం ఉంటే అవీ అమ్మివేశాడు ఇలా మొత్తంఅంతా

ఒక లక్షరూపాయలు సేకరించుకున్నాడు, ఈడబ్బుతో భవిష్యజ్జీవితం గడపాలని స్థిరీకరించుకున్నాడు.

అప్పుడిహ తల్లితోపాటు కాశీవెళ్ళాలని నిశ్చయించుకుని భ్రమరిని తీసుకురమ్మనమని మనిషినిపంపాడు. అత్తగారు కాశీపెడుతుందని విని ఆమె హడావుడిగా పరుగెకెత్తుకువచ్చింది. వచ్చి అత్తగారి కాళ్ళమీదపడి- ఏడుస్తూ "నేను చిన్నపిల్లను - నన్నుఒక్కతెనూ విడిచిపెట్టి వెళ్ళవద్దండి మీరు - సంసారబాధ్యతలు నాకేమాత్రం తెలియవు. ఈ సంసారం సముద్రం. ఈసముద్రాన్ని నేనొక్కతెను ఈదగలనా?'' అనిప్రాధేయపడింది. "నీఆడబిడ్డ ఉందిగా, అదినిన్ను నాలాగేఆదరిస్తుంది. - అదీగాక నువ్వా గృహిణివి అయినావుగా!" అన్నది అత్తగారు, భ్రమరికేమీ తెలియలా; ఏడవటం మొదలుపెట్టింది.

పెద్దఆపద ముందున్నట్లు గ్రహించింది భ్రమరి. అత్తగారు వదిలిపెట్టివెళ్ళింది. అమెనుపంపించిరావటానికి భర్తకూడా వెళ్ళుతున్నాడు. పంపటానికివెళ్లి వారుమళ్ళారారేమో! భ్రమరిగోవిందలాల్ కాళ్ళుపట్టుకుని "ఎన్నాళ్ళల్లో వస్తారో చెప్పివెళ్లండి" అనిఏడ్చింది.

"చెప్పలేను రావాలని ఇచ్ఛకూడాలేదు" అన్నాడు గోవిందలాల్.

భ్రమరి కాళ్ళువదలి లేచినుంచుని—"భయమేమిటి? విషం త్రాగుతాను" అని అనుకుంది.

తర్వాత ప్రయాణానికి ముహూర్తంపెట్టుకున్న రోజువచ్చింది. హరిద్రాగ్రామంనుంచి కొంతదూరం పాలకీమీదకాని మేనామీదకాని వెళ్ళి రైలుఅందుకోవాలి. పెద్దపెద్దకావిడిపెట్టెలూ, ట్రంకులూ, పరుపుచుట్టలూ కూలివాళ్ళు చేరేస్తున్నారు. వారితోకూడా వెళ్లవలసిన దాసదాసీలు తలలు దువ్వుకుని. తెల్లబట్టలు కట్టుకొని తాంబూలాలు నములుతూ, వాకిలిదగ్గర నుంచున్నారు. ఇరుగుపొరుగుపిల్లలు తొంగితొంగిచూస్తున్నారు. గోవిందలాల్ తల్లిగృహదేవతకు నమస్కరించి, మిగిలినవారిని యథోచితంగా పలకరించి కన్నీళ్ళుకారుస్తూ మేనాఎక్కింది. అందరూ కంటతడిపెట్ట సాగారు, ఆమె మేనాఏక్కి ముందుకు సాగింది.

గోవిందలాల్ అక్కడచేరినవారి నందరినీ యథోచితంగా పలకరించి. గదిలోపడుకుని ఏడుస్తున్న భ్రమరితో చెప్పిరావటానికి వెళ్ళారు

దుఃఖవివశురాలైన భ్రమరిని చూసేసరికి - తనుచెప్పతలచు కున్నవన్ని చెప్పలేక నేను అమ్మను పంపిరావటానికి వెడుతున్నాను భ్రమరీ!" అన్నాడు.

భ్రమరి కన్నీళ్ళు తుడుచుకుని. "ఏం అమ్మ. అక్కడ ఉండిపోతారు! మీరు వస్తారుకదా!" అని అడిగింది.

ఈ ప్రశ్న అడిగేప్పుడు ఆమెకళ్ళనుంచి నీరు శ్రవించటంలేదు. ఆమె కంఠస్వరంలోని స్థైర్యాన్ని, గాంభీర్యాన్నీ - ఆమె పెదవులమీది స్థిరప్రతిజ్ఞనూ చూసి గోవిందలాల్ కొంచెం విస్మితుడయినాడు. చటుక్కున సమాధానం చెప్పలేకపోయాడు. భర్త మెదలకుండా ఊరుకోవటం చూచి "సత్యమొక్కటే ధర్మమనీ, సత్యమే సుఖమనీ మీరేనేర్పేరునాకు. ఇవాళ మీరునాకు నిజంచెప్పండి. నేను మీ ఆశ్రితురాలిని, నన్నుమీరు వంచించ వద్దు—ఎప్పుడువస్తారు?" అన్నది భ్రమరిమళ్ళీ.

"అయితే నిజంగావిను. తిరిగిరావాలనే ఇచ్ఛలేదునాకు" అన్నాడు గోవిందలాల్.

"ఎందుకులేదుఇచ్ఛ చెప్పివెళ్ళకూడదూ?"

"ఇక్కడఉంటే నువ్వుదయతలచి పడవేసే అన్నానికి దాసుడనై ఉండాల్సివస్తుంది"

"దానివల్ల నష్టమేమిటి? నేను మీ పాదదాసిని"

"నాపాద దాసివి కనుక అయితే నేను ప్రవాసం నుంచి ఎప్పుడు వస్తానా అని ఎదురుచూస్తూ కిటికీదగ్గరే కూర్చుని ఉండేది. కాని అలాంటి సమయంలో పుట్టింటికి పోయి కూర్చోదు."

"అందుకు మీ పాదాలను ఎన్నిసార్లు పట్టుకున్నా - ఈ అపరాధం ఒకటే తొలగిపోదా:"

"ఇంకా అలాంటివిమరో నూరు అపరాధాలు అవుతాయి నువ్వు ఇప్పుడు ఆస్తికి అధికారిణివి."

"కాదు? నేను ఈసారి పుట్టింటికివెళ్ళి మానాన్న సహాయంతో ఏం చేసుకువచ్చానో చూడండి."

అని భ్రమరి ఒక కాగితం తీసుకువచ్చి చూపించి అతడి చేతికిచ్చి 'చదవండి' అన్నది.

గోవిందలాల్ చదివి చూశాడు. దానపత్రం అది, భ్రమరి తనపేర ఉన్న ఆ సిసనంతా సరియైనవిలువగల స్టాంపుమీద రాసి రిజిష్టరీ చేయించింది. గోవిందలాల్ అది చదివి "నువ్వు చెయ్యవలసిన పని చేశావు నువ్వు. కాని నీకూ నాకూ సంబ ధం ఏమిటి? నేను నీకు నగలుఇస్తే నువ్వు ధరించవచ్చు. నువ్వు ఆస్తి రాసిఇస్తే నేను అనుభవించాలా - ఈ సంబంధం లేదు మనకు" అని గోవిందలాల్ అతి విలువయిన ఆ దాన పత్రం ముక్కలు ముక్కలుగా చించి పారేశాడు.

"ఇదిమీరు చింపివెయ్యటం వృథాఅనిచెప్పాడు మానాన్న. గవర్నమెంటు దగ్గిర దీనికి నకలు ఉంటుంది," అన్నది భ్రమరి.

"ఉంటే ఉండనీ. నేను వెడుతున్నాను."

"ఎప్పుడు వస్తారు?"

"రాను అసలు"

"ఎందుకని? నేను మీ భార్యను, మీ శిష్యురాలిని, ఆశ్రితురాలిని, మీచేత పోషింపబడేదానిని మీ దాసురాలిని - రాకపోవటం ఎందుకని?'

"రావాలనే ఇచ్ఛలేదు."

"ధర్మమయినా లేదా?"

"నాకు అదీ లేదనుకుంటా"

భ్రమరి అతికష్టంమీద కన్నీళ్లు ఆపుకుంది. చేతులు రెండూ రెండూ జోడించి అవిచలిత కంఠంతో "అయితే వెళ్ళండి వెళ్ళగలిగితే. తిరిగి రావద్దు అపరాధం లేకపోయినా నన్నుత్యజించ దలచుకుంటేత్యజించండి. కాని పైన దేవతలున్నారని మాత్రం జ్ఞాపకం ఉంచుకోండి. నాకోసం మీరు దుఃఖించవలసిన రోజుకూడా వస్తుంది మరచిపోకండి' ఈ ప్రపంచంలో అకృత్రిమమైన ప్రేమ ఎక్కడుందా అని మీరు వెతుక్కునే రోజువస్తుందని గుర్తుఉంచుకోండి. దైవసాక్షిగా - నేను పతివ్రతనయితే - మనోవాక్కాయకర్మలతో మీ పాదభక్తురాలినే కనుక అయితే మళ్లీ మీ దర్శనం అవుతుంది నాకు. ఆ ఆశతోనే ప్రాణాలు నిలబెట్టుకుంటాను నేను. ఇంక వెళ్ళండి. ఇంక రాను అని చెప్పాలని మనసు ఉంటే చెప్పండి. కాని మీరు తప్పక వస్తారని చెబుతున్నాను నేను. వచ్చి మళ్లీ భ్రమరీ అని పిలవనూ పిలుస్తారు. మళ్లీ నాకోసం దుఃఖించనూ దుఃఖిస్తారు. ఈ మాట అబద్ధమయితే దేవతలే అబద్ధం

అనుకోండి. మీరు వెళ్ళండి, నాకు దుఃఖంలేదు. మీరు నా వారే కాని రోహిణివారు మాత్రం కారు.'' అని భ్రమరి భక్తితో భర్తపాదాలకు ప్రణమిల్లి - మెల్లగా గదిలోకి వెళ్లి లోపల తలుపులు గడియవేసుకుంది.

---

# 31

ఈ కథ ప్రారంభానికి పూర్వమే భ్రమరికి ఒక కొడుకుపుట్టి పురిటి ఇంట్లోనే చనిపోయాడు. ఇవాళ భ్రమరి గదిలోకివెళ్ళి తలుపు లోపల బిగించుకుని-ఏడురోజులు మాత్రమే బ్రతికిపోయిన ఆ పిల్లవాడి కోసం - ఏడవసాగింది. కిందపడి దుమ్ములో పొర్లాడుతూ ఎడతెగని నిట్టూర్పులతో—"నా బంగారపుబొమ్మ, మా తండ్రే - ఇవాళ ఎక్కడు న్నావు నాయనా ! నువ్వే బ్రతికి వున్నట్లయితే నన్ను విడిచిపెట్టటం ఎవరికి సాధ్యమయ్యేది ? నీ మీద నా ప్రేమ పోయిందనుకో - నామీద నీ ప్రేమ ఏమయిపోయింది ? నేను కురూపినే, కాని నిన్ను కురూపి అని ఎవరనగలరు ? నీ కంటె అందమైనవాళ్ళు ఎవరున్నారు? ఒక్క సారి కనిపించు తండ్రీ ! ఇంత విపత్సమయంలో కూడా ఒక్కసారి కనిపించు తండ్రీ ! చనిపోతే ఇంక కనిపించకూడదా?" అని ఏడ్వ సాగింది.

భ్రమరి మళ్ళీ చేతులు జోడించి, ఊర్ధ్వముఖియై భగవంతుని ఉద్దేశించి—"పదిహేడళ్ళయినా నిండని ఈ వయస్సులోనే నాకు ఇంత దుర్దశ ఏ అపరాధంవల్ల సంభవించిందో చెప్పలేవాప్రభూ! నాపుత్రుడు చచ్చిపోయాడు; నాభర్త పరిత్యజించాడు. నాకుపదిహేడేళ్ళే' ఈవయస్సు లో నేను నాభర్తను ప్రేమించటంవినా ఇంకేమీ ప్రేమించి ఎరుగను. నాకు ఇహలోకంలో ఇంక ఏవాంఛాలేదు. ఇంకేదయినా కాంక్షించాలని కూడా ఎరుగను. నేను అంతచిన్నవయస్సులోనే ఆ ప్రేమనుంచి నిరాశ్రు రాలను ఎందుకయినాను?" అనిప్రశ్నింపసాగింది:

భ్రమరి ఏడ్చి ఏడ్చి - దేవతలంతా అతినిష్ఠురులు అని సిద్ధాంతీక రించుకుంది. దేవతలే నిష్ఠురులైనప్పుడు ఇంక మనుష్యులు ఏంచేస్తారు? ఏడవనుమాత్రం ఏడుస్తారు. భ్రమరికూడ ఏడవనుమాత్రం ఏడ్చింది.

ఇక్కడ గోవిందలాల్ భ్రమరిదగ్గరనుంచి మెల్లిగా వీధిగుమ్మం దాకా వచ్చాడు. నేను యథార్థం చెబుతున్నాను—గోవిందలాల్ కూడా కళ్ళనీళ్ళు తుడుచుకుంటూనే వచ్చాడు. బాలికలకు అతిసహజమైన ఏప్రేమ ఏనిష్కపటత్వమూ, ఏఉద్వేగమూ ప్రతిమాటలోనూ వ్యక్తమవుతూ వుంటుందో—అప్రవాహంలో రాత్రింబవళ్ళు ఎలాకొట్టుకు పోతాయో ఆప్రేమను భ్రమరిదగ్గిరపొంది గోవిందలాల్ ఇన్నాళ్లూ సుఖవంతుడయి నాడు. ఇప్పుడతడికి ఈవిషయమే జ్ఞాపకంవచ్చింద. తానుత్యజించినది-ఇంకపృధివిలో లభించదని అనిపించింది-"తానుచేసినపని ఇంకత్రిప్పు కోటానికి వీల్లేనిది। ఇప్పుడు ఇంక వెళ్లాలిసిందే. ప్రయాణమైనవాడిని ఇంక వెళ్ళితీరాల్సిందే, బహుశా ఇంక తిరిగిరాడం ఉండదు; ప్రయాణ మైనాను—ఇంకవెళ్ళాలి" అని ఆలోచించుకున్నాడు.

ఆ సమయములో గోవిందలాల్ కాళ్ళు వెనక్కితిరిగి - తలుపులు బిగించుకునిఉన్న భ్రమరిదగ్గిరకువెళ్ళి "నేను మళ్ళీవచ్చాను భ్రమరీ" అని అనిఉన్నట్లయితే అంతా తుడుచుకుపోయేది. అలా చేద్దామ అన్న కోరిక గోవిందలాల్‌కు చాలాసార్లుకలిగింది. ఇచ్ఛకలిగినా అలా చేయ లేక పోయాడు వాంఛకలిగి కొంచెం సిగ్గుకూడా కలిగింది. "ఇంత తొందరదేనికి? ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడేరావచ్చు" అనుకున్నాడు. భ్రమరియెదుట గోవిందలాల్ అపరాధి. మళ్ళీ భ్రమరియెదుట పడేందుకు ధైర్యంచాలలా అతడికి. ఏమయితేనేం—ఒకస్థైర్యం కలిగించుకునే టంత జ్ఞానం కలుగలేదు. ఏ మార్గానవెళ్లాలో ఆ మార్గాన్నే వెళ్లాడు. ఆలోచనలన్నీ కట్టిపెట్టి - వీధిగుమ్మంలోకి వచ్చి -- అలంకరింపబడి సిద్ధంగాఉన్న గుర్రాన్ని ఎక్కుతూనే కొరడాతో ఒక్కదెబ్బ కొట్టాడు. వెడుతూవెడుతూవుండగా దారిలో అతడి హృదయంలో రోహిణి సౌంద ర్యరేఖలు వికసితములయినాయి.

---

# 32

గోవిందలాల్ తల్లితోకూడా కులాసాగా కాశీ చేరినట్లు - హరిద్రా గ్రామంలోని వారి ఇంటికి ఉత్తరం వచ్చింది; భ్రమరికి ప్రత్యేకంగా

ఉత్తర. మేమీ రాలేదు. అభిమానంకొద్దీ భ్రమరి కూడా ఉత్తరమేమీ రాయలా. ఉత్తరాలూ అవీ ఆఫీసుకు రావటం మొదలెట్టాయి.

ఒకటి రెండు నెలలు గడిచాయి. ఉత్తరాలుమాత్రం వస్తూనే ఉన్నాయి. చివరకు ఒక రోజున గోవిందలాల్ కాశీ నుంచి యింటికి బయలుదేరినట్లు వర్తమానం వచ్చింది.

భ్రమరి ఈ సంగతి విని - తల్లితో అలా అని చెప్పి మభ్యపెట్టి గోవిందలాల్ ఎక్కడికో వెళ్ళివుంటాడని-గ్రహించింది ఇంటికి తిరిగి వస్తాడనే విశ్వాసం లేకపోయిందామెకు.

ఈలోపుగా భ్రమరి చాటుగా రోహిణివిషయాలన్నీ ఆచూకీ లాగుతూనేఉంది. రోహిణిఇంట్లో వంటచేస్తూఉంటుంది. స్నానంచేస్తుంది, నీళ్లుతీసుకొస్తూఉంటుంది. భోజనం చేస్తుంది అన్నవిషయాలు తప్పకొత్త సంగతులు ఏమీతెలియటంలా. రోహిణికి జబ్బుగాఉందని తెలిసింది ఒక రోజున ఇంట్లోముసుగెట్టుకుని పడుకుంది-బైటకురాలేదుట! బ్రిహ్మానంద ఘోషే స్వయంగా వంటచేసుకున్నాడట!

తర్వాత మళ్లీ ఒకరోజున రోహిణికి కొంచెం కులాసాగానేఉంది కాని పూర్తిగా నయంకాలేదని తెలిసింది, శూలరోగం చికిత్స చేయించు కోలేదు. రోహిణి ఆరోగ్యం కోసమని తారకేశ్వరం వెళ్ళిబలియిచ్చివస్తుం దట! చివరకు వెళ్ళిందనికూడా వర్తమానం వచ్చింది, ఒంటరిగానే వెళ్లింది. కూడాఎవరు వెడతారు?

మూడునాలుగు నెలలుగడిచినాయి కానిగోవిందలాల్ మాత్రింతిరిగి రాలా. అయిదారు నెలలు గడిచినాకూడా తిరిగిరాలేదతడు. భ్రిమరి ఏడుపు అంతులేకుండా ఉంది. ఇప్పుడెక్కడున్నారో, ఏలా ఉన్నారో కబురు తెలిస్తే బ్రతికిపోతాను. ఆ కబురు కూడా తెలియకపోలేమెలా? అని మాత్రం మనస్సులో అనుకుంది. చివరకు ఆడుబిడ్డను పిలిచి - మీ అమ్మకు తప్పకుండా కొడుకు సంగతి తెలిసిఉంటుందని - ఉత్తరం గాయించింది. అత్తగారికి గోవిందలాల్ సంగతులు తెలుస్తునేఉన్నాయి. "అతడు ప్రయాగ, మధుర, జయపూర్ అన్నీ తిరిగి చివరకు ఢిల్లి చేరు కున్నాడు. అక్కడినుంచి మళ్ళీ త్వరలోనే బయలుదేరి ఎక్కడికో వెళ్ళ నున్నాడు. ఎక్కడా స్థిరంగా ఉండటం లేదు'' అని రాసింది అత్తగారు

ఇటు చూస్తే రోహిణీ మళ్లీ తిరిగి రాలా - ఆమె ఎక్కడికి వెళ్ళిందో ఆ భగవంతుడికే తెలియాలి. నా మనస్సులోని సందేహాన్ని ఈ పాపముఖితోమాత్రం బైట పెట్టను - అనుకుంది భ్రమరి. కాని ఆమె ఇంక సహించలేక ఏడుస్తూ ఆడబిడ్డను పిలిచి చెప్పి మనా ఎక్క పుట్టింటికి వెళ్ళిపోయింది.

అక్కడికి వెళ్లాక గోవిందలాల్ సంగతి ఇక్కడికి తెలియటం దురూహ్యమని గ్రహించి మళ్లీ తిరిగి వచ్చింది. వచ్చాక హారిద్రా గ్రామం లో కూడా భర్త సంగతి ఏమీ తెలియకపోయేసరికి మళ్లీ అత్తగారికి ఉత్తరం రాయించింది'' "గోవిందలాల్ సంగతులేవీ మళ్లీ తెలియలేదు అత ఏప్పుడు ఎక్కడుందీ తెలియదు." ఏ సంగతులూ తెలియుటలేదు. అని రాసిందిఈ సారి అత్తగారు. ఇలాగే మొదటి సంవత్సరం గడిచిపో యింది. మొదటి సంవత్సరం చివరి రోజుల్లో భ్రమరి జబ్బుపడి మంచ మెక్కింది ఎన్నడూ వాడని పువ్వు వాడిపోసాగింది.

---

# 33

భ్రమరికి జబ్బుగా ఉందని తెలిసి ఆమె తండ్రి చూడటానికి వచ్చాడు. ఆతడిపేరు మాధవనాధసర్కార్. వయస్సు షుమారు నలభై యేళ్లు. అతడు చూడటానికి చాలామంచివాడులా కనిపిస్తాడు ఆతడి ప్రివర్తనను గురించి ప్రజల్లో చాలాఅభిప్రాయ భేదాలున్నాయి. కొంత మంది అతణ్ణిచాలా మెచ్చుకుంటారు మరికొందరు అతడంత దుర్మార్గుడు పృధ్విలో మరొకరు లేడంటారు. అతడుచాలా అసాధ్యుడన్న సంగతి మాత్రం అందరూ ఒప్పుకుంటారు. - అతణ్ణి మెచ్చుకునేవాళ్లుకూడా అతడంటే భయపడతారు.

మాధవనాధ్ కుమార్తె పరిస్థితి చూసి చాలా దుఃఖించాడు శ్యామ వర్ణంతో అందంగా తీర్చి దిద్దినట్టుండేది ఆమె శరీర సౌష్టవం. ఇప్పుడు ముఖం ఎండుకుపోయింది. శరీరం చిక్కి మెడక్రింద ఎముకలు బైటికి కన్పిస్తున్నాయి. చక్రాలాంటి కళ్ళు లోతుకు దించుకు పోయినాయి. భ్రమరి కూడా చాలా సేపు ఏడ్చింది. చివరకు ఇద్దరూ దుఃఖాన్ని ఆపు

కున్నాక-"నాకింక రోజులు సమీపించాయి, అనిపిస్తోంది నాన్నా! నా చేత కొన్నైనా ధర్మ కార్యాలు చేయించు. నేను చిన్నదాన్నయితేమాత్రం ఏం రోజులు నిండాక? రోజులు నిండాక ఇంక ఆలస్యం చెయ్యటం దేనికి? నాదగ్గిర చాలా డబ్బు ఉంది. నేను నోములు వ్రతాలూ చేస్తాను. ఇవన్నీ ఎవరు చేయిస్తారు? నాకు ఈ యేర్పాట్లన్నీ నువ్వు చేయించు నాన్నా!'' అన్నది భ్రమరి. మాధవనాథ్ సమాధానం ఏమీ ఇవ్వలేక - సహింప రాని బాధ కలిగి వీధిసావిడిలోకి వచ్చేశాడు, అక్కడే చాలాసేపు కూర్చుని దుఃఖించాడు. కేవలం దుఃఖించటమే కాదు. గుండెలు పగిలే ఆ దుఃఖంఅతడి హృదయంలో క్రోధంగా పరిణమించింది. "నాకుమార్తెమీద ఇంత అత్యాచారం చేసిన వారిమీద-ప్రతీకారంగా అంతటిఅత్యాచారాన్ని చేసేవాళ్లు ఈ జగత్తులో ఎవ్వరూలేరూ?" అని ఆలోచిస్తూవుండగా అతడి హృదయం కంపించటానికి బదులు విపరీతమైన కోపంతో ఉడు కెత్తిపోయింది. అప్పుడతడు కళ్లు ఎర్రగా చింతనిప్పుల్లా చేసుకుని "నా కుమార్తెను ఇంతగా సర్వనాశనం చేసిన వాళ్లను నేను కూడా అలాగే సర్వనాశనం చేస్తాను'' అని ప్రతిజ్ఞచేశాడు,

తర్వాత మాధవనాథ్ కొంతవరకు శాంతించి మళ్లీ అంతఃపురం లోకి కుమార్తె దగ్గిరకువెళ్లి "నువ్వు వ్రతాల విషయం చెప్పావుకదూ, నేనూ అదే ఆలోచించాను అమ్మా! ఇప్పుడు నీ శరీరం చాలా జబ్బుగా ఉంది. వ్రతాలు చెయ్యటం ప్రారంభిస్తే ఉపవాసాలు కూడా చెయ్యాల్సి ఉంటుంది. నువ్వు ఇప్పుడు ఉపవాసాలు చెయ్యగల స్థితిలోలేవు. కొంచెం శరీరం నయమయాక—''

"ఈ శరీరం ఇంకా నయమవుతుందా?''

"నయమవుతుందమ్మా - నయంకానంత ఏముంది? నీకిక్కడ కొంచెమైనా వైద్యం జరగలేదు. మామగారు లేరు. అత్తగారు లేదు, దగ్గిర ఎవరూ లేరు. ఎవరు చేయిస్తారు వైద్యం? నువ్వు ఇప్పుడు నాతో రా. నిన్ను నా యింట్లో ఉంచుకుని వైద్యం చేయిస్తాను. ఇక్కడ నే నింకా రెండు రోజు లుంటాను తర్వాత ఇద్దరం కలిసి రాజగ్రామం వెడదాం'' అన్నాడు.

రాజగ్రామం భ్రమరి పుట్టిల్లు.

కుమార్తె దగ్గిరనుంచి బయలుదేరి మాధవనాథ్ ఆఫీసులోకి

వెళ్లాడు. అక్కడ మేనేజరును పిలిచి, "ఏమిటి? బాబుగారి దగ్గరనుంచి ఏమయినా ఉత్తరాలు వచ్చాయా?" అని అడిగాడు.

"ఏమీరాలేదు" అన్నాడతడు.

"ఇప్పు డాతడు ఎక్కడున్నాడు?"

"వారిసంగతులేమీ చెప్పలేము మేము. వారు అసలు కబుర్లేమీ అందచెయ్యటం లేదు."

"ఈ సంగతులు ఎవర్ని కనుక్కుంటే తెలుస్తాయి?"

"ఆసంగతి తెలిస్తే మేమూ తెలుసుకునేవాళ్ళమె వారి తల్లివగ్గిర నుంచి కబుర్లు ఏమయినా తెలుస్తాయేమోనని కాశీ మనిషిని పంపాము. కానిఅక్కడి నుంచి కూడా ఏమీ వర్తమానం తెలియలా. బాబుగారు ప్రస్తుతం అజ్ఞాతవాసంలో ఉన్నారు" అన్నాడు, మేనేజర్.

---

# 34

మాధవనాథ్ కుమార్తె దుఃస్థితిచూసి, దీనికి ప్రతీకారం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. ఈ అనిష్టానికి గోవిందలాలూ రోహిణి ఇద్దరే మూలకారణం. వాళ్లిద్దరూ ఎక్కడున్నారో ముందు వెతకి కనుక్కోవాలి. లేకపోతే దుర్మార్గానికి తగిన శిక్షజరగదు. భ్రమరి కూడా చచ్చిపోతుంది.

వాళ్ళు ఎక్కడో దాక్కున్నారు. ఏ ఉపాయాలతో వాళ్ళను పట్టుకుందామని ఆలోచించుకున్నాడో - అవన్నీ వ్యర్థమైనాయి. కాని నేనే కనుక వాళ్ళను పట్టుకోకపోతే, ఎందుకింక నా పౌరుషం?" అనుకున్నాడు.

ఈ స్థిరసంకల్పంతో మాధవనాథ్ కృష్ణకాంత్‌రాయ్ ఇంట్లోంచి పైకి వచ్చాడు. హరిద్రా గ్రామంలో పోస్టాఫీసు ఒకటుంది. మాధవనాథ్ కర్రచేతపుచ్చుకుని, తాంబూలం నములుతూ మెల్లగా నిరీహుడైన పెద్దమనిషిలాగా అక్కడికివెళ్ళి ప్రత్యక్షమయినాడు.

పోస్టాఫీసు - ఒక చిన్న పూరిగుడిసె - నెలకు పదిహేను రూపాయలు జీతం పుచ్చుకుంటున్న ఒక డిప్యూటీ పోస్ట్‌మాస్టర్ ఉన్నాడు.

విరిగిపోయిన ఒక మామిడిచెక్కల టేబిల్‌మీద కొన్ని ఉత్తరాలూ ఫైల్సూ. ఒకదాంట్లో కొంచెం జిగురూ, ఒక త్రాసూ, పోష్టాఫీసు ముద్రలూ పెట్టుకుని పోస్టుమాస్టరుగారు గంభీరంగా ప్యూన్‌మీద తన అధికారం చలాయిస్తున్నాడు. డిప్యూటీ పోస్టుమాస్టరుగారి జీతం పదిహేను రూపాయలూ, ప్యూన్ జీతం ఏడు రూపాయలును. అంచేత ఏడు అణాలకు, పదిహేనణాలకు ఎంత వ్యత్యాసం ఉందో - పోస్టు మాస్టరు గారికీ నాకూ కూడా అంతే తేడా కాని - అంతకన్న ఎక్కువ లేదనుకుంటాడు ప్యూన్ కాని పోస్టుమాస్టరు మాత్రం నే నొక డిప్యూటీని - వాడొక బంట్రోతు నేను వాడికి యజమానినీ దేముణ్ణీ కూడా. వాడికీ నాకూ భూమ్యాకాశాలకున్నంతదూరం ఉంది. ఆ విషయం నిర్ధారణ చేసుకోటానికే పోస్టుమాస్టరుగారు ఎప్పుడూ పాపం వాడిని తర్జన భర్జన చేస్తూ ఉంటాడు. వాడూ తగిన సమాధానమే ఇస్తూ ఉంటాడు. మాస్టరుగారు ఉత్తరాలు తూకం వేస్తూ ఉన్నాడు. మధ్య మధ్య ప్యూన్‌ను గద్దిస్తూ ఉన్నాడు ఈ సమయంలో మాధవనాథ్ ప్రశాంతంగా, చిరునవ్వు ముఖంతో అక్కడికి వచ్చాడు. ఆ పెద్దమనిషిని చూసి, పోస్టుమాస్టరు బంట్రోతుతో వాగుతున్న వాగుడు కట్టిపెట్టి ఆయనకేసి నోరుతెరుచుకొని చూస్తూకూర్చున్నాడు. పెద్దమనిషిని గౌరవించాలి - అనితోచింది అతడి మనస్సుకు - కాని ఎలా గౌరవించాలో మాత్రం తాను నేర్చుకున్న చదువులోలేదు. కనుక అది జరగలేదు.

మాధవనాథ్‌కు అతడొక కోతిలా కన్పించాడు. నవ్వుతూ "బ్రాహ్మలా?" అని అడిగాడు.

"ఆ నువ్వు - మీరో?" అన్నాడు పోస్టుమాస్టరు.

మాధవనాథ్ వస్తున్న నవ్వు నాపుకుని తలవంచి చేతులు జోడించి "ప్రాతఃప్రణామాలు" అన్నాడు.

"కూర్చోండి" అన్నాడు పోస్టుమాస్టరు.

మాధవనాథ్ కొంచెం ఇరుకున పడ్డాడు. పోస్టుమాస్టరు కూర్చోండి అని అయితే అన్నాడు కాని కూర్చోటం ఎక్కడ? మాస్టరు గారికి పాతవి మూడు కోళ్లు మాత్రమే ఉన్న కుర్చీ ఒకటి ఉంది. అందులో ఆయన కూర్చుని ఉన్నాడు, అంతకు తప్ప అక్కడ మరో కుర్చీ ఏమీ లేదు.

అప్పుడు పోస్టుమాస్టరు గారి బంట్రోతు హరిదాస్ విరిగిపోయిన స్టూల్ మీద నున్న కాగితాలూ - గట్రాకిందకుదించి మాధవనాధ్‌కు కూర్చోటానికి ఇచ్చాడు. అతడు దానిమీద కూర్చుని: "ఏమోయ్! ఎలా ఉన్నావ్? నిన్నెప్పుడో చూశానల్లే ఉందే?'' అన్నాడు.

"చిత్తం నేను ఉత్తరాలూ అవీ ఇస్తూ ఉంటానండి ''

"అదే ఎరుగుదును, కాస్త పొగాకు చూస్తావా హుక్కాలోకి. మాధవనాధ్ పొరుగు ఊరువాడు. అతడెప్పుడూ ఈ హరిదాస బైరాగి ప్యూన్‌ను చూడలేదు. ఈ బైరాగీ కూడా ఆయన్ని ఎప్పుడూ చూడలా. బాబుగారు సరదా అయినవాడు. తలచుకుంటే ఏదైనా బక్షీష్ ఇవ్వక పోడు - అని అనుకుని హరిదాస్ హుక్కా వెతుక్కు రావటానికి పరుగెత్తాడు.

మాధవనాధ్‌కు హుక్కా తాగే అలవాటు లేదు - హరిదాస్‌ను అక్కడినుంచి పంపటానికే హుక్కా తెమ్మని పురమాయించాడు.

బంట్రోతు అక్కడినుంచి వెళ్ళగానే మాధవనాధ్ పోస్టుమాస్టరుతో—"మిమ్మల్ని ఒక మాట అడగాలని వచ్చాను'' అన్నాడు.

పోస్టుమాస్టరు తనలోతాను నవ్వుకున్నాడు. అతడు వంగదేశీయుడు. వాళ్ళది విక్రమపూర్. ఇతర విషయాలు ఏమీ తెలియకపోయినా తన పనిలో తాను ఘటికుడు. ఏ విషయమై తెలుసుకోటానికి ఈయన వచ్చాడో గ్రహించాడు. "ఏం సంగతి మహాశయా?'' అని అడిగాడు.

"బ్రహ్మానంద్‌ని ఎరుగుదురా మీరు?"

"ఎరుగను-ఆఁ ఎరుగుదును-ఉహూఁ అంతబాగా ఎరగను"

"మీ ఆఫీసుకు బ్రహ్మానందఘోష్‌కు ఉత్తరాలు ఏమయినా వస్తూ ఉంటాయా?''

"మీకు అతడితో మాటలులేవా?

"ఉండనీ ఉండకపోనీ - ఈవిషయం మీనుంచి తెలుసుకుందామని వచ్చాను.''

పోస్టుమాస్టర్ అప్పుడతను డిప్యూటీ అనేపదవిని స్పృహకు తెచ్చుకుని అతిగాంభీర్యంతో - కొంచెం కోపంకూడా తెచ్చుకుని "పోస్టాఫీసు విషయాలు మేము బైటపెట్టకూడదని నియమంఉంది" అని మళ్ళీ ఉత్తరాలు తూకం వెయ్యసాగాడు.

"మాధవనాథ్ తనలోతాను నవ్వుకొని, పైకి "మీరు అలాంటి మాటలెప్పుడూ చెప్పరని తెలుసుబాబూ! అందుకోసమే కొంచెం మీరే దయినా ముట్టచెప్పి వెడదామనుకున్నాను. ఇప్పుడు నేను అడిగినదాని కల్లా సరియైన సమాధానం చెప్పండి" అన్నాడు.

అప్పుడు పోష్టుమాష్టరు మొహం ఇంతచేసుకొని "ఏమిటో అడగండి?" అన్నాడు.

"ఏముంది? ఇదే బ్రహ్మానంద్ కు ఉత్తరాలుఏవయినా వస్తున్నాయా ఈ ఆఫీసుకు?"

"వస్తూవుంటాయి"

ఎన్నాళ్ళయిందీ వచ్చి?

"ఇప్పుడు చెప్పినదానికి ఇంకా డబ్బుయివ్వనేలేదు, ముందుదానికి ఇవ్వాల్సినడబ్బు పైకి తియ్యండి - తర్వాత మరో ప్రశ్నవెయ్యండి" పోష్టుమాష్టర్ కు కొంతడబ్బు ఏదయినాయిచ్చి వెళ్ళాలనేవుంది మాధవీనాథ్ కు కాని ఆతడి ప్రవర్తనకు కోపంవచ్చింది, "బాబూ! మీరు పొరుగూరి వారిలా కన్పిస్తున్నారు - నన్నెరుగుదురా?" అన్నాడు. పోష్టుమాష్టరు తలతిప్పుతూ - ఎరుగను. నేను మాఆఫీసు సంగతులు వాళ్ళకీ వీళ్ళకీ చెబుతానా? ఏవరుమీరు? అన్నాడు

"నాపేరు మాధవనాథ్సర్కారు - మాదిరాజగ్రామం. నాపేరు చెబితే మా ఊళ్ళో ఎంతహడలో తెలుసా?"

పోష్టుమాష్టరు భయపడ్డాడు. మాధనాథ్ పేరు వినిఉన్నాడు. అతడి దోర్దండ ప్రతాపాన్ని వినిఉన్నాడతడు. అంచేత మెదలకుండా ఊరుకున్నాడు.

"నేను నిన్ను అడిగినదానికల్లా—నిజమయిన సమాధానంచెప్పు ఏమి మోసగించకు. మోసగించావంటే నీకు ఏమి ఇవ్వను, ఒక్కపైసా కూడా ఇవ్వను, కాని ఏమిచెప్పక అబద్ధంకనుక చెప్పావంటే నీఇంటికి నిప్పుఅంటిస్తాను. నీపోష్టాఫీసు లూటీచేయిస్తాను—నువ్వే నీఆఫీసులో సొమ్ము దొంగతనం చేశావని కోర్టులో ప్రమాణంచేస్తాను, ఏం? ఇహ చెబుతావా?"

పోష్టుమాష్టర్ వణికిపోతూ - "మీరు కోప్పడతారెందుకు? నేను మిమ్మల్ని ఎరగను. మీరు మామూలుమనుష్యులనుకుని అలాచెప్పాను.

మీరు వచ్చారు గనుక ఏదిఅయినా అడగండి దానికి సమాధానం చెబు తాను'' అన్నాడు.

"బ్రహ్మానంద్‌కు ఎన్నాళ్ళకోసారి వస్తూఉంటాయి ఉత్తరాలు?"

ఇంచుమించు ప్రతినెలా వస్తూఉంటాయి. సరీగ్గా గుర్తులేదు?''

"అయితే రిజిష్టరుచేసిన ఉత్తరాలే వస్తాయా?''

"అఁ ఇంచుమించు చాలాఉత్తరాలు అలాగేవస్తాయి?"

"ఏ ఆఫీసునుంచి రిజిష్టరు అయినట్లువస్తాయి?''

"జ్ఞాపకంలేదు''

"మీఅఫీసులో ఓకరశీదు ఉండదా"?

పోష్టుమాష్టరు రశీదు వెతకి బైటకితీశాడు. చదివి ప్రసాద్‌పూర్ అనిచెప్పాడు.

"ప్రసాద్‌పూర్ ఏజిల్లాలోదో కాస్తమీలిష్టుచూడు"

పోష్టుమాష్టరు వణుకుతూ అచ్చులిష్టుతీసిచూసి "యశోజిల్లాలోది" అన్నాడు.

చూడు ఇంకా ఎక్కడినుంచి అతడిపేర రిజిష్టరు ఉత్తరాలు వచ్చాయో-ఆరసీదులన్నీ చూడు.

పోష్టుమాష్టరు అన్నీచూశాడు. ఇప్పటివరకు అతడికివచ్చిన ఉత్త రాలన్నీ ప్రసాద్‌పూర్‌నుంచే. మాధవనాద్ వణుకుతున్న పోష్టు మాష్టరుచేతిలో పదిరూపాయల నోటుఒకటిపెట్టి శెలవు పుచ్చుకున్నాడు. అప్పటికి ఇంకా హరిదాస బైరాగిరాలేదు. మాధవనాథ్ హరిదాస్‌కు ఇవ్వ మనిచెప్పి మరోరూపాయికూడా అక్కడఉంచి వెళ్ళాడు. పోష్టుమాష్టరు అదికూడా భుక్తంచేసుకున్నాడని చెప్పనక్కర్లేదు.

---

## 35

మాధవనాథ్ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ తిరిగివచ్చాడు. రోహిణీ గోవిందలాల్‌ల అధఃపతనగాధ ఆ నోటా ఆ నోటా విన్నాడు మాధవనాథ్, రోహిణీ గోవిందలాలూ ఎక్కడో రహస్యంగా ఒక్క-

చోటే కలిసిఉండి ఉంటారని నిశ్చయించుకున్నాడాయన మనస్సులో. బ్రహ్మానందుని పరిస్థితికూడా ఆయనకంతా తెలిసిందే-రోహిణి తప్ప ఆత డికి ఇంక నా అన్నవా ళ్ళెవ్వరూ లేరని తెలుసు. అంచేతనే ఇప్పుడు పోస్టాఫీసుకు వెళ్ళి ప్రతి నెలా బ్రహ్మానందుని పేర రిజిష్టర్ ఉత్తరాలు వస్తున్నసంగతి తెలుసుకుని వచ్చాడు. రోహిణీ, లేదా గోవిందలాలో అతడికి ప్రతి నెలా అయ్యే ఖర్చు పంపిస్తూ ఉంటారని తెలుసుకున్నాడు ప్రసాద్‌పూర్ నుంచి ఉత్తరాలు వస్తున్నాయి కనుక వాళ్ళిద్దరూ ప్రసాద్ పూర్‌లో కాని, లేదా అక్కడికి దగ్గరలోఉన్న మరో ఊళ్ళోకాని ఉండి ఉంటారని గ్రహించాడు. కాని ఆ నిశ్చయాన్ని మరింత దృఢంచేసుకో టానికి ఇంటికి తిరిగి రాగానే పోలీస్ స్టేషనుకు ఒక మనిషిని పంపాడు. 'ఒక కానిస్టేబిల్‌ను పంపండి. కొంత దొంగసొమ్మును పట్టించి పంపగల ననుకుంటున్నాను' అని సబినస్పెక్టరుకు రాసి పంపించాడు.

సబినస్పెక్టరు మాధవనాథ్‌ను బాగా ఎరిగున్నాడు, అతడంటే భయపడతాడు కూడా. ఉత్తరం రాగానే నిద్రాసింహుడనే కాన్‌స్టేబుల్‌ను పంపించాడు.

మాధవనాథ్ నిద్రాసింహునిచేతిలో రెండురూపాయలుపెట్టి, "నువ్వేమీ అడ్డుచెప్పకుండా నేను చెప్పినట్లల్లాచెయ్యి. ఈచెట్టుకిందకువెళ్ళి దాక్కో. కాని ఇక్కడనుంచిచూస్తే కనపడేటట్లుగా మాత్రం నుంచో చెట్టుక్రింద అంతకన్న ఇంకేమీ చెయ్యనవసరంలేదు" అనిచెప్పాడు. నిద్రాసింహుడు అందుకు ఒప్పుకుని వెళ్ళిపోయాడు మాధవనాథ్ అప్పుడిహ బ్రహ్మా నంద్‌కు కబురుచేశాడు. అతడుదగ్గరకు వచ్చికూర్చున్నాడు. అప్పుడింక ఎవరూలేరు అక్కడ.

పరస్పరం కుశలప్రశ్నలు వేసుకున్నారు "మీరుస్వర్గీయులైన మావియ్యంకుడిగారికి ఎంతోఆత్మీయులు. ఇప్పుడు వాళ్లెవరూలేరు. మా అల్లుడుకూడా పరదేశంలో ఉన్నాడు. మీకేఆపదవచ్చినా మేమే కనిపెట్టి ఉండాలికదా, అంచేతనే మీకు కబురుచేశాను" అన్నాడుమాధవనాథ్.

బ్రహ్మానందుని ముఖంవాడిపోయింది. "ఆపదఏమిటి మహాశయా!" అన్నాడు. మాధవనాథ్ గంభీరంగా "మీరు ఆపదలోనే ఉన్నారు నిజంగా" అన్నాడు.

"ఆపదేమిటి?"

"ఆపత్సమూహం. మీదగ్గిరఏదో దొంగనోటువున్నదని పోలిసు లెలా తెలుసుకున్నారో గట్టిగాతెలుసుకున్నారు.''

బ్రహ్మానంద్‌కు మిన్నువిరిగి మీదపడ్డట్లయింది. "అదేమిటి? నా దగ్గర దొంగనోటా?''

"దొంగలుకారని తెలుసుమీకు, ఇతరులెవరోమీకు దొంగనోటు ఇస్తే, మీకుతెలియక తీసుకుని ఉంటారు"

" అదేమిటి మహాశయా! నాకు నోటు ఎవరిస్తారు ?"

మాధవనాథ్ అప్పుడు కంఠస్వరం తగ్గించి, "నేను అంతా తెలుసుకున్నాను - పోలీసులు కూడా తెలుసుకున్నారు. నిజానికి పోలీసుల దగ్గరే నే నీ సంగతంతా విన్నాను. దొంగనోటు ప్రసాద్‌పూర్ నుంచి వచ్చింది. ఇదిగో చూడు! ఒకపోలీస్ కాన్‌స్టేబిల్ నీకోసం వచ్చి నుంచు న్నాడు - నేను అతడికి ఏదో కాస్త ఇచ్చి ప్రస్తుతానికి దూరంగా ఆపి ఉంచాను."

అని మాధవనాథ్ అప్పుడు చెట్టుకింద మీసాలున్న నల్లటి పోలీసు స్వరూపాన్ని చూపించాడు.

బ్రహ్మానంద్ గజ గజ వణకి పోసాగాడు. మాధవనాథ్ కాళ్ళు రెండూ పట్టుకుని "మీరు రక్షించండి" అని రాగా లెట్టాడు.

"భయంలేదు ఈసారి ప్రసాద్‌పూర్‌నుంచి ఏ ఏ నంబర్లు ఉన్న నోట్లు వచ్చాయో చెప్పు చూస్తాను. పోలీసులు నా దగ్గర ఆ దొంగనోట్ల నంబర్లు ఉంచి వెళ్ళారు. అది ఒకవేళ ఆ నంబరు నోటుకాకపోతే భయ మెందుకు? నంబరు మార్చటం ఎంతసేపు? ఇప్పటివరకూ ప్రసాద్‌పూర్ నుంచి వచ్చిన ఉత్తరాలు తీసుకురా-నంబర్లు చూస్తాను''

బ్రహ్మానంద్ ఎలా వెడతాడు? కాన్‌స్టేబిల్ చెట్టు కింద ఉన్నాడు- భయమేస్తోంది.

"భయమేమీలేదు. నేనుకూడా మనిషినిపంపుతాను. అన్నాడు మాధవనాథ్. అతడిఆదేశానుసారం ఒకదర్వాన్ బ్రహ్మానంద్‌తోకూడా వెళ్ళాడు. బ్రహ్మానంద్ రోహిణిరాసిన ఉత్తరాలు తీసుకుని చక్కా వచ్చాడు. ఆవుత్తరాల్లో మాధవనాథ్ ఏవిఏవి అయితే వెతుకుతున్నాడో అన్నిటినీ పొందాగలిగాడు.

ఉత్తరాలన్నీచదివి, బ్రహ్మానంద్‌ను వెనక్కి పంపుతూ "రణనం బరు నోట్లుకావు. ఏంభయంలేదు. నువ్వుఇంటికివెళ్ళు. నేనుకానిస్టేబుల్ను పంపించేస్తాను" అన్నాడు.

బ్రహ్మానంద్ నిర్జీవశరీరంలోకి మళ్ళీ ప్రాణాలువచ్చినాయి, ఎగరోజుతూ అక్కడనుంచి పరుగుతీశాడు.

మాధవనాథ్ చికిత్సకోసం కూతుర్ని తనయింటికి తీసుకువెళ్లాడు. ఆమెచికిత్సకు అనువైన వైద్యుణ్ణిఒకణ్ణి ఏర్పాటుచేసి, తానుకలకత్తా వెళ్లాడు. భ్రమరి ఎంత అభ్యంతరపెట్టినా మాధవనాథ్ వినిపించుకోలా. త్వరలోనే వస్తానని కూతుర్ని ఒప్పించివెళ్ళిపోయాడు.

కలకత్తాలో నిశాకరదాస్ అని మాధవనాథ్‌కు ఒక ఆత్మీయుడున్నాడు. నిశాకరుడు వయస్సులో మాధవనాథ్‌కన్న ఏ డెనిమిదేళ్ళ చిన్న నిశాకరుడు ఉద్యోగమేమీ చేస్తూ ఉండడు పిత్రార్జితమైన ఆస్తి ఉంది. సంగీతంలోమాత్రం కొంచెం సాధన చేస్తుంటాడు, పనిలేదని చెప్పి ఎప్పుడూ అక్కడికీ అక్కడికీ పర్యటన చేస్తూవుంటాడు. మాధవనాథ్ అతడిదగ్గరకు వచ్చి కలుసుకున్నాడు. ఇతర విషయాలన్నీ మాట్లాడుకున్నాక "ఎలా వున్నావోయ్, ఎక్కడికయినా ప్రయాణమై వస్తావా?" అని అడిగాడు నిశాకరుని.

"ఎక్కడకు?"

"యశో జిల్లాకు"

"అక్కడికి యెందుకు?"

"నీలిమందు కొనాలి"

"పద"

అప్పుడిహ అవసరమైన ఏర్పాట్లు చేసుకుని స్నేహితులిద్దరూ ఒకటి రెండు రోజుల్లో యశో జిల్లాకు అభిముఖంగా ప్రయాణం సాగించారు, అక్కడి నుంచి ప్రసాద్ పూరు వెడతారు.

సన్నగిల్లిన చిత్రానది మెల్లిమెల్లిగా ప్రవహిస్తోంది. ఆ నది ఒడ్డున అసంఖ్యాకంగా ఉన్న. మామిడి, రావి, కడిమి, ఖర్జూరచెట్లు—చిన్నచిన్న తోటల్లో కోయిలలూ, గోరింకలూ మొదలైన పక్షులు కుహూ ధ్వానాలు చేస్తున్నాయి. దగ్గిరలో ఊరు అనేది లేదు. ఒక్క కోసెడు దూరంలో

ప్రసాద్‌పూర్ అని ఒక చిన్న వర్తకస్థానం మాత్రం ఉంది. ఇక్కడ మనుష్య సంచారం తక్కువగా ఉండటం చూసి, నిస్సందేహంగా పాప కృత్యాలకు అనువైన ప్రదేశమని భావించి, పూర్వం యూరపియన్ దొర ఒకాయన ఇక్కడ నీలిమందు తయారుచెయ్యటం మొదలెట్టాడు. ఇప్పుడు ఆ నీలితోటలన్నీ ధ్వంసమైనాయి. ఆ దొరగారి గుమాస్తాలూ, మేనేజర్లూ అందరూ వీలైనచోట్లకుచేరి, ఏదో సంపాయించుకు బ్రతుకుతున్నారు సుఖంగా. ఒక బెంగాలీ జాతీయుడు అ జన మాన్యప్రాంతంలో ఉన్న మేడనుకొని, దాన్ని చక్కగా అందంగా తయారుచేయించాడు. కుర్చీలూ సోఫాలూ, అద్దాలూ, పూలగుత్తులతో ఆ ఇల్లుచిత్రవిచిత్రంగా అలంకృతమై ఉంది. ఆ మేడ రెండో అంతస్తులో ఉన్న పెద్దగదిలో ప్రవేశిద్దాంమనం. గదిలో అందమైన చిత్రాలెన్నో ఉన్నాయి. సభ్యతా విరుద్ధమైన చిత్రాలు కూడా ఉన్నాయి—అవి వర్ణించతగినవికావు ఒక మెత్తని సోఫామీద కూర్చుని, మీసాలున్న ఒక మహమ్మదీయుడు తంబురాశ్రుతులు చేస్తున్నాడు, ప్రక్కనే కూర్చుని ఒక యువతి 'టింగ్ టింగ్' మని తబలను మ్రోగిస్తోంది. దానితోపాటు చేతుల నున్న బంగారపు గాజులు కూడా, ధన్ ధన్ మని చప్పుడౌతున్నాయి. ప్రక్కనే గోడను ఉన్న పెద్ద అద్దాలలో ఈ ఇద్దరి ప్రతిబింబాలు కన్పిస్తున్నాయి. ప్రక్క గదిలో కూర్చుని ఒక యువకుడు నవల చదువుకుంటూ - మధ్యలో తలుపులు తెరిచి ఉన్న గుమ్మంలో కూర్చుని ఉన్న యువతి చేస్తున్న పనిని కూడా చూస్తున్నాడు.

---

# 36

తంబురాను శ్రుతిచేసి. గడ్డం ఉన్న ముసల్మాన్ తీగెలు మీటుతున్నాడు. ఆ తీగెల ధ్వనీ, తబలా ధ్వని ఆ ఉస్తాద్‌జీ పాండిత్యం వల్ల ఏకం కాగానే, ఆయన నల్లటి మీసాల అంధకారంలోంచి తెల్లటి దంతాలను బైటపెట్టి వృషభదుర్లభమైన కంఠస్వరంతో రాగాలాపన ప్రారంభించాడు. రాగాలాపం రకరకాలుగా మారుతున్నకొద్దీ, అతడి పెదవులు బహు వికారంగా తిరగసాగినాయి. ఆ యువతి కూడా అతడు పళ్ళు పటపటలాడించగానే ఆ వృషభదుర్లభమైన కంఠస్వరంలో తన కోమల

కంఠాన్ని కూడా కలిపి, పాట ప్రారంభించింది. ఆ రెండు కంఠాల కలయిక వల్ల ఒక విచిత్రమైన సంగీతం ఉద్భవించినట్లవుతోంది. ఇక్కడే తెర వేద్దామనిపిస్తోంది. అపవిత్రమూ, అదర్శనీయమూ అయినదీ మేము చూపతలచుకోలేదు. మరీ చెప్పతగినదానినే చెబుతాము. కాని అయినా ఆ అశోక, వకుల, కురవక కుంజమధ్యంలో తుమ్మెదల రొద, కోయిల గానమూ, ఆ చిన్న నదీ తరంగాలమీద సంచరిస్తున్న రాజహంసల కలకల నాదమూ, ఆ మల్లికా మధుమాలతీ మొదలైన పుష్పాల మధుర సౌరభమూ, ఆ గదిలోని నీలకాంతమణులమీద ప్రసరిస్తున్న సూర్యకాంతి తాలూకు అపూర్వమైనశోభ, వెండి పూలతొట్లలో, అమర్చబడిన పుష్పాల శోభ ఆ గృహానికి అందంతెస్తున్న వస్తువుల ఉజ్జ్వల రూపమూ, ఆ గాయకుల సంగీత నినాదమూ - వాటినన్నిటినీ మాత్రం కొంచెం ఉల్లేఖించాను. తదేకమనస్సుతో ఆ యువతి ఓరచూపులను చూస్తున్నఆతడి హృదయంలో ఈ కటాక్ష మాధుర్యం వీ టన్నిటినీ మించిన శోభను కలగిస్తోంది.

ఆయువకుడు గోవిందలాల్ - ఆయువతిరోహిణి ఈఇల్లు గోవిందలాల్ కొన్నాడు ఇక్కడేవీరు ఉండటం

చటుక్కున రోహిణి తబల అపస్వరం పలికింది. ఉస్తాద్ జీ తంబురాతీగె తెగింది. కంఠం జీరవోయింది, పాట ఆగిపోయింది, గోవిందలాల్ చేతిలోనినవల పడిపోయింది. ఆసమయంలో, ఆసంతోషగృహంలో ఒక అపరిచిత యువకుడు ప్రవేశించాడు. మనం ఎరుగుదుము అతడ్ని—నిశాకరదాస్అతడు.

---

# 37

రెండోఅంతస్తు రోహిణి నివాసస్థలం. ఘోషాలో ఉంటుంది ఆమె. క్రింది అంతస్తులో నౌకర్లూ దాసీలూ ఉంటారు, జనసంచారంలేని ఈ ప్రదేశంలో గోవిందలాల్‌ను కలుసుకోటానికి ఎప్పుడూ ఎవరూ రారు, ఒకవేళ ఎప్పుడైనా అక్కడఉండే వర్తకుడెవరైనావస్తే, బాబుగారికోసం పైకికబురువెడుతుంది. అతడు క్రిందికిదిగివచ్చి కలుసు

కుంటాడు. అంచేత బాబుగారికి క్రింద అంతస్తులో ప్రత్యేకంగా ఒక గది వుంది.

క్రిందిఅంతస్తు గుమ్మందగ్గిరకు వచ్చినిలబడి "ఎవరండీఇక్కడ?" అని అడిగాడు నిశాకరదాస్.

గోవిందలాల్‌కు సోనా, రూపా అనిఇద్దరు దాసీలున్నారు ఆకంఠ స్వరంవిని ఇద్దరూ గుమ్మం దగ్గిరకువచ్చి నిశాకరునిచూసి ఆశ్చర్య పోయారు. నిశాకరుని చూడగానే ఎవరో పెద్దమనిషి అయివుంటాడని స్పష్టంగా తెలుస్తోంది. నిశాకరుడుకూడా వేషభూషాదుల్లో కొంచెం డాబు సరి చేసుకునేవచ్చాడు, అలాంటిమనిషి ఆప్రాంతాల్లో ఎన్నడూలేడు— అతణ్ణిచూచి నౌకర్లంతా ఆనోటా ఆనోటావిని గుసగుస లాడుకోసాగారు.

"తమరు ఎవరికోసంవచ్చారు?" అని అడిగిందిసోనా.

"మీకోసమే. ఓ పెద్దమనిషి మిమ్మల్ని కలుసుకోటానికి వచ్చారని బాబుగారికి కబురు పంపించు"

"పేరు ఏమనిచెప్పను"

"పేరుతో అవసరమేముంది. ఒకపెద్దమనిషి అనిచెప్పు"

ఏపెద్దమనుష్యులనీ బాబుగారు కలుసుకోడనీ, ఆయన స్వభావం అలాంటిది కాదనీ నౌకర్లందరికీ తెలుసు. అంచేత కబురుపంపడానికి నౌకర్లంత ఇష్టంఉన్నట్లు కన్పర్చలా. సోనావెనకా ముందాడసాగింది. "మీరు అనవసరంగా వచ్చారు, బాబుగారు ఎవర్నీకలుసుకోరు" అన్నదిరూప.

"అయితే మీరుఉండండి కబురుపంపకుండానే పైకివెడతానునేను"

నౌకర్లు చిక్కునపడ్డారు "వద్దుబాబూ మానౌకరీలు పోతాయి" అన్నారు.

నిశాకరుడు ఒకరూపాయి పైకితీసి, "ఎవరుకబురు పంపితే వాళ్ళకీ రూపాయి" అన్నాడు.

సోనాఆలోచించ సాగింది. రూపఆమెను తోసివేసి నిశాకరుడి చేతిలో రూపాయి తీసుకుని కబురుచెప్పటానికి మేడమీదికి వెళ్ళింది.

ఆమేడచుట్టూ పూలతోట ఉన్నదొకటి; అదిఎంతో అందంగాఉంది; "నేను ఈతోటలో తిరుగుతూఉంటాను. అడ్డుచెప్పకు పైనుంచి కబురు

రాగానే నన్నుపిలిస్తే వస్తాను" అనిచెప్పిసోనాచేతిలో మరోఏపాయి పెట్టాడు.

రూపబాబుగారి దగ్గరకు వెళ్ళేసరికి ఆతడు ఏదోపనితొందరలో ఉన్నాడు. నిశాకరుడు వచ్చినసంగతి అతడికిచెప్పటానికి వీల్లేకపోయింది నిశాకరుడు తోటలోతిరుగుతూ తిరుగుతూ ఒక్కసారి పైకిచూసేసరికి ఒక అతిలోక సౌందర్యవతి కిటికీ లోంచితనవకేసి చూస్తూ ఉండటంకనిపించింది.

రోహిణి నిశాకరునిచూసి, "ఎవరీతడు? చూడటానికి ఈప్రాంతపు మనిషికాదల్లేఉన్నాడు. వేషభాషల్ని పట్టిచూస్తే ఎవరో గొప్పవాడిలా ఉన్నాడు, చూడటానికి అందంగాకూడా ఉన్నాడు. -గోవిందలాల్ కంటేనా? ఉహూఁ కాదు కాదు గోవిందలాల్ చాలాఎరుపు - కానీ ఇతనిముఖమూ, కళ్లూఅందంగాఉన్నాయి విశేషించి కళ్ళు - ఆహా, ఏమి కళ్లు! ఇత డెక్కడినుంచి వచ్చాడు! హరిద్రాగ్రామంలోని మనిషికాడు. అక్కడ అందర్నీ ఎరిగిఉన్నాను! అతడితో రెండు మాటలు మాట్లాడనా! నష్ట మేమిటి? నే నెప్పుడూ గోవిందలాల్ విషయమై విశ్వాసఘాతకురాలిని కాను" అని అనుకుంది.

రోహిణి ఇలా అనుకుంటూండగా నిశాకరుడు పైకి చూసేసరికి నాలుగు కళ్ళు కలుసుకున్నాయి. కళ్ళు కళ్ళు ఏమి మాట్లాడుకున్నాయో తెలియదు. తెలిసినా చెబుదామనే ఇచ్ఛలేదు - కాని మాట్లాడుకున్నట్లు మాత్రం విన్నాం మేము.

ఇలాంటి సమయంలోనే అవకాశం చూసుకుని "ఒక పెద్దమనిషి మిమ్మల్ని కలుసుకోవటానికి ఎదురు చూస్తున్నారు" అని చెప్పింది రూప బాబుగారితో.

"ఎక్కడనుంచి వచ్చాడు?" అని అడిగాడు బాబుగారు

"ఆ సంగతి తెలియదు."

"ఆసంగతి తెలుసుకోకుండా కబురెందుకు తీసుకునివచ్చావ్?"

తిట్టేట్టుగా ఉన్నారని గ్రహించి, రూప తన తెలివితేటలను ఉప యోగించి, "ఆ మాట అడిగితే. బాబుగారివగ్గరే చెబుతానన్నా రాయన" అన్నది.

"అయితే వెళ్ళికలుసుకోటానికి వీల్లేదనిచెప్పు"

ఈ ఆలస్యమవటంచూసి గోవిందలాల్ కలుసుకోటానికి అంగీ

కరించి ఉండదని గ్రహించాడు నిశాకర్. దుష్కార్యాలు చేసేవాడితో మర్యాద ఎందుకు? నాఅంతట నేనే పైకి ఎందుకు వెళ్ళకూడదు?

ఇలా ఆలోచించుకుని ఆదాసీది రావటంకోసం ఎదురుచూస్తూ కూర్చోకుండానే నిశాకరుడు మళ్లీ ఇంట్లోకివెళ్ళాడు సోనా, రూపా ఇద్దరిలో ఎవరూలేరు కింద. అప్పుడిహ నిరుద్వేగంగా మెట్లు ఎక్కి, గోవిందలాలూ, రోహిణీ ఆపాటకుడూ ఉన్నచోటుకువెళ్ళి ప్రత్యక్ష మయినాడు. రూప అతడ్నిచూసి, ఈబాబుగారే మిమ్మల్ని కలుసుకోవా లనుకుంటున్నది అని చూపించింది.

గోవిందలాల్ మహామండిపడ్డాడు, కాని చూస్తే పెద్దమనిషి "ఎవరు తమరు?" అని ప్రశ్నించాడు.

"నా పేరు రాసవి హారదేవ్"

"ఊరు?"

"వరాహనగర్"

గోవిందలాల్ కూర్చోమనడని తెలుసుకుని నిశాకరుడు ఠీవిగా కూర్చున్నాడు.

"మీరు ఎవరికోసం?"

"మీ కోసమే"

"మీరు మా ఇంట్లోకి జబర్దస్తీగా రాకుండా కాస్సేపు ప్రతీక్షిస్తూ కూర్చున్నట్లయితే - నన్ను కలుసుకోటానికి అవకాశం లేదన్న సంగతి తెలుసుకునేవారు"

"కావలసినంత అవకాశం ఉండటం చూస్తున్నాను. నేను మరో స్వభావంగలవాడినయినట్లయితే బెదిరించి తిట్టివెళ్ళిపోయేవాణ్ణి. మేడమీదికి వచ్చేవాణ్ణికాను. నేనెటూవచ్చా కనుక నేను చెప్పుకునేవి రెండు మూడు మాటలు వింటే ఆపదగట్టెక్కి పోతుంది"

"వినకుండా ఉండాలనే నా అభిలాష. అయినా ఒకటి రెండు మాటల్లో పూర్తిచెయ్యగలిగితే చెప్పివెళ్ళిపోండి"

రెండు మాటల్లోనే చెబుతాను. మీ భార్య భ్రమరిదాసి ఆమె ఆస్తిని కౌలుకు ఇవ్వటానికి నిశ్చయించుకున్నారు."

తంబురాకు కొత్త తీగె అమరుస్తున్న గాయకుడు, ఒకచేతితో తీగె బిగిస్తూ, ఒకచేత్తో వేలుచూపించి 'ఒకమాట అయిపోయింది' అన్నాడు.

"ఆ కౌలు నేను తీసుకోబోతున్నాను" అన్నాడు నిశాకరుడు. ఆ పాటకుడు పరోవేలు ముడిచి "రెండు మాటలయిపోయినాయి"అన్నాడు.

"అందుకోసం హరిద్రాగ్రామంలో మీ ఇంటికి వెళ్ళాను నేను"

"రెండు మాటలూ కాకుండా మూడో మాటకూడా అయిపోయింది అన్నాడు గాయకుడు.

"ఉస్తాద్‌జీ స్వరాలు లెఖ్కపెడుతున్నారాయేం?" అన్నాడు నిశాకరుడు.

ఉస్తాద్‌జీ కళ్ళెర్రచేసుకుని "బాబుగారూ, మీరీఅమర్యాదస్తుణ్ణి పంపించి వెయ్యండి" అన్నాడు గోవిందలాల్‌తో.

కాని బాబుగారప్పుడు పరధ్యానంగాఉండి సమాధానంచెప్పలా.

"మీభార్య ఆస్తినిమాకు కౌలుకుఇవ్వటానికి ఒప్పుకున్నారు కాని, మీఅంగీకారం కావాలిఇంకా. ఆమెకు మీచిరునామా కూడాతెలియదు. ఉత్తరాలు రాయటాని కయినా ఇష్టపడలేదు. అంచేత మీఅభిప్రాయం తెలుసుకోవాల్సినభారం నామీదనేపడింది. నేనుఎంతోప్రయత్నించి మీచిరునామా తెలుసుకుని, మీఅనుజ్ఞ తీసుకోటానికి వచ్చాను".

గోవిందలాల్ సమాధానమేమీ చెప్పలా. చాలాపరధ్యానంగా ఉన్నాడు, చాలారోజు లయాక భ్రమరిపేరు విన్నాడు. ఆ తన భ్రమరి! ఇంచుమించు రెండు సంవత్సరాలయింది!

నిశాకరుడు కొంతవరకు గ్రహించాడు. "మీకుయిష్టమయి నట్లయితే మీకేమీ అభ్యంతరం లేనట్లు ఒక్కపంక్తిరాసిఇవ్వండి. అలాచేస్తే ఇంకనేను లేచివెడతాను"

గోవిందలాల్ సమాధానమేమీ చెప్పలేదు, మళ్ళీచెప్పాలని గ్రహించాడు నిశాకరుడు ఈసారి అన్నివిషయాలూ స్పష్టంగాచెప్పేశాడు. గోవిందలాల్ ఈసారి మనస్సు లగ్నంచేసి ఆసంగతులన్నీ విన్నాడు. నిశాకరుడి మాటలన్నీ అబద్ధాలని పాఠకులకు తెలుసు; కానిఆసంగతి గోవిందలాల్ గ్రహించ లేకపోయాడు. మొదటచూపిన కోపాన్ని పరిత్యజించి "నాఅనుమతితీసు కోవటంఅనవసరం ఆస్తినాభార్యది, కాని నాదికాదు. ఆ సంగతి తెలుసుననుకుంటాను. ఆమె కౌలుకు ఎవరికి ఇచ్చుకోవాలని ఉన్నా నా అభ్యంతర మేమీలేదు. నేను ఏమీ రాయను. ఇంక మీరు నన్ను విడిచి వెడతారనుకుంటా" అన్నాడు.

అంచేత తప్పనిసరిగా నిశాకరుడు అక్కడనుంచి లేవాల్సివచ్చింది అతడు క్రిందికి దిగివచ్చాడు. గోవిందలాల్ ఉస్తాద్‌జీని "కొంచెం పాడండి" అని అడిగాడు.

ఉస్తాద్ బాబుగారి అనుజ్ఞపొంది పల్లీతంబురాశ్రుతిచేసి, "ఏంపాడమంటారు ? అని అడిగాడు.

"మీ ఇష్టం!" అని గోవిందలాల్ తబలా తీసుకున్నాడు గోవిందలాల్ తబలా వాయిద్యం ఇదివరకే కొంత నేర్చుకుని ఉన్నాడు; ఇటీవల అది మరింత బాగా వృద్ధిచేసుకున్నాడు. కాని ఇవాళ ఉస్తాద్‌జీ స్వరంతో అతడి వాయిద్యం శ్రుతి కలవలేదు. ప్రతితాళమూ తప్పుపోయింది. ఉస్తాద్‌జీకి విసుగువచ్చి తాంబురా ప్రక్కనుపెట్టి, పాట ఆపుచేసి, "ఇవాళ నేను చాలా అలిసిపోయాను" అన్నాడు. అపుడు గోవిందలాల్ సితార్ ఒకటి తీసుకుని వాయించటానికి ప్రయత్నించాడు. కాని 'ట్యూన్' మరిచిపోసాగాడు. సితార్ ప్రక్కనుపెట్టి నవల చదవటం మొదలెట్టాడు కాని చదివినది అర్థం కావటంలా. అప్పుడిహ పుస్తకం మూసేసి పడకగదిలోకి వెళ్లాడు. రోహిణి కన్పించలా అక్కడ, కాని సోనా దాసీది మాత్రం అక్కడే ఉంది. "నేను కాసేపు నిద్దరోతాను నాఅంతటనేను నిద్రలేచేంతవరకూ ఎవరూనన్ను లేపవద్దు "అనిగుమ్మంలోనించి సోనాతో చెప్పాడు,

ఇలాచెప్పి గోవిందలాల్ పడకగది తలుపులు మూసేశాడు. అప్పటికి ఇంచుమించు ప్రొద్దుపోకింది.

తలుపులుమూసి గోవిందలాల్ నిద్రపోలేదు. మంచంమీదకూర్చుని రెండుచేతులతో ముఖంకప్పిపుచ్చుకుని ఏడవసాగాడు

ఎందుకేడుస్తున్నాడో మాత్రం తెలియదు భ్రమరికోసం ఏడుస్తున్నాడో, తనకోసమే ఏడుస్తున్నాడో తెలియదు. బహుశా ఇద్దరికోసము కూడానేమో !

మా దృష్టిలో ఏడవటంతప్ప గోవిందలాల్‌కు మరోఉపాయం లేదు. భ్రమరికోసం ఏడవటానికి అవకాశంఉంది. కాని భ్రమరిదగ్గరకు తిరిగి వెళ్ళటానికి ఉపాయంలేదు. హరిద్రాగ్రామంలో ఇంకముఖం చూపించటానికి వీల్లేదు. హరిద్రాగ్రామంమార్గం కంటకావృతమై ఉన్న దిప్పుడు ఏడవటంకన్న మరోఉపాయంలేదు.

# 38

నిశాకరుడు గొప్పవాడిలాగావచ్చి కూర్చునేసరికి, రోహిణి ప్రక్కగదిలోకి వెళ్ళిపోవాల్సివచ్చింది. అంటే కనుచాటు అయిందన్న మాటేకాని చెవికిమాత్రంకాలేదు. వీళ్ళుమాట్లాడుకున్నదంతా చెవిఒగ్గి విన్నది పైగాగుమ్మానికిఉన్న తెరకొంచెం తొలగించి నిశాకరుని చూడ సాగింది. పరదాచాటునుంచి ఓరచూపుతో తనకేసి ఒకరుచూస్తూ ఉండ టం నిశాకరుడుకూడా చూశాడు

నిశాకరుడు-అదే-రాసవిహార్ హరిద్రాగ్రామంనుంచి వచ్చాడని రోహిణి విన్నది. రూపదాసీకూడా రోహిణిలాగానే అన్నిమాటలూ అక్కడనుంచుని వింటున్నది నిశాకరుడు లేచివెళ్ళగానే రోహిణి పరదా చాటునుంచి ముఖంపైటికిపెట్టి రూపను ఇలారమ్మని చేత్తోసంజ్ఞచేసింది. రూపదగ్గరకు రాగానే దానిచెవిలో "చెప్పినట్లల్లా చెయ్యగలవా? బాబు గారికి తెలియకుండా అన్నివిషయాలూ రహస్యంగా ఉంచాలి. నేనుచెప్పిన దంతా బాబుగారికి తెలియకుండా చేశావంటే నీకు అయిదురూపాయలు 'ఈనాం' ఇస్తాను" అనిచెప్పింది

'ఇవాళ నిద్రలేచి ఎవరిముఖం చూశా చెప్మా? చూస్తున్నా కదా— ఇవాళడబ్బువచ్చేరోజు। జీవనాళ్ళకురెండు డబ్బులు రావటమే మంచిది. అనుకుంది రూప; పైకి మీరుచెప్పిందల్లాచేస్తా. ఏమిటాజ్ఞ'' అన్నది.

ఈ బాబుగారితోకూడా క్రిందికి దిగివెళ్ళు. ఆయన మానాన్నగారి ఊరునుంచివచ్చారు. అక్కడనుంచి ఏకబురూ రాకపోవటం మూలంగా ఎంతో బెంగపెట్టుకుని ఏడుస్తున్నా. మాఊరునుంచి ఎవరో మనిషి వచ్చాడంటే వాళ్ళని ఒకసారి మావాళ్ళకబుర్లు ఒకటిరెండు అడుగుదా మనుకున్నా బాబుగారు కోపంవచ్చి ఆయన్ని వెళ్ళిపొమ్మన్నారు నువ్వు వెళ్ళి ఆయన్ని కూర్చోపెట్టు బాబుగారుక్రిందికిదిగివచ్చినా చూడకుండా ఉండేచోటున కూర్చోపెట్టు. వారేకాదు; ఇంకెవరూ చూడకూడదు. నేనుకొంచెం రహస్యంగా వెడతాను. కూర్చోటానికి ఒకవేళ ఇష్టపడక పోతే దీనంగా బ్రతిమాలు'' అన్నది.

రూపకు బక్షీస్ వాసన తగిలింది కనుక, 'చిత్తం' అంటూ పరుగు తీసింది.

నిశాకరుడు ఏఉద్దేశ్యంతో గోవిందలాల్‌ను మోసగించటానికి వచ్చాడో చెప్పలేము. కాని అతడు క్రిందకివచ్చి చేసిన ప్రవర్తనను తెలివి కలవాడు కనుక చూస్తే, అతడిమీద ఎంతో అపనమ్మకం కలుగుతుంది. అతడు లోపలకు వచ్చే గుమ్మంతాలూకు తలుపులూ గడియలూ ఎంతో సావధానంగా పరిశీలిస్తున్నాడు. ఆసమయంలో దాసిది రూపా వచ్చి ప్రత్యక్షమయింది,

"హుక్కా ఇష్టమేనా తమకు?" అన్నది రూప.

"బాబుగారు యివ్వలేదు, నౌకర్లదగ్గిర ఎలా త్రాగుతాను?"

"ఆజ్ఞాపిస్తే అదోలెక్కలోదికాదు—ఒకరహస్యమైన సంగతి ఉన్నది. కొంచెం చాటుగాకూర్చోండి."

రూప నిశాకరుని వెంటబెట్టుకుని నిర్జనగృహంలోకి తీసుకు వెళ్ళింది నిశాకరుడేమీ అభ్యంతరం చెప్పకుండా వెళ్ళాడు. నిశాకరుని అక్కడ కూర్చోపెట్టి రోహిణి చెప్పిన సంగతులన్నీ చెప్పేసిందిరూప.

నిశాకరుడు ఆకాశంలోని చంద్రుణ్ణి చేతులుచాచి పట్టుకోగలిగాడు తనకోరిక సిద్ధించటానికి అతిసహజమైన ఉపాయమేమిటా అని ఆలోచిస్తున్నాడు. "మీయజమాని నన్ను తరిమేశాడు., నేను ఆయనఇంట్లో దాక్కొని ఎలాఉండగలను?" అన్నాడు.

"చిత్తం, ఆయనేమీ తెలుసుకోలేరు. ఈగదిలోకి ఆయనెప్పుడూ రారు."

"రాకపోవచ్చు. కాని మీఅమ్మగారు క్రిందికిరాగానే, బాబుగారు ఆమె ఎక్కడకి వెడుతున్నదో చూద్దామనివెనువెనుకనేవస్తే, ఏదోవిధంగా మీఅమ్మగారిని నాదగ్గరచూస్తే నాస్థితి ఏమవుతుందో చెప్పు?"

రూప మెదలకుండా ఊరుకున్నది. నిశాకరుడు చెప్పసాగాడు, "ఈమైదానంలో ఈగదిలోపెట్టి నన్ను ఖూనిచేసి, ఈతోటలోపాతిపెట్టినా నాకు దిక్కూమొక్కూ ఎవరూలేరు. అప్పుడు నువ్వే కొట్టగలవు రెండు దెబ్బలు. అంచేత యీలాంటిపని నేను చెయ్యను, ఇదినావల్లకాదని మీ అమ్మగారికి స్పష్టంగాచెప్పేసెయ్. మరోమాటకూడాచెప్పు, ఆమె పింతండ్రి కొన్ని అతిముఖ్యమైన విషయాలు ఆమెతోచెప్పమని నాతో చెప్పాడు నేను ఆమాటలు మీఅమ్మగారితో చెప్పాలని చాలాతొందర

పడుతున్నాను. కాని మీబాబుగారు నన్ను తరిమివేశాడు. నాకు చెప్ప టానికి వీల్లేక పోయింది. వెడుతున్నానునేను''

రూపఆట్టేచూసింది; అయిదురూపాయలు చెయిజారిపోతున్నాయి. సరేపోనీ, ఇక్కడకూర్చోకపోతే బైట కాస్తదూరంలో కూర్చోలేరూ?" అన్నది.

"నేనూ ఆసంగతే ఆలోచిస్తున్నా. వచ్చేప్పుడు మీ ఈ బంగ ళాకు దగ్గిరలోనే నదిఒడ్డున మెట్లుకట్టిన రేవు ఒకటి ఉంది. దానికి దగ్గిర లోనే రెండు వకుళవృక్షాలు చూసివచ్చాను. గుర్తుఉన్నదా. ఆచోటు?''

"ఉన్నది''

"నేను వెళ్ళి అక్కడ ఉంటాను. ప్రొద్దుకూకింది. బాగా చీకటి పడిందంటే అక్కడ కూర్చుంటే అంతగా ఎవ్వరూ చూడలేరు. మీ అమ్మగారు అక్కడికి రాగలిగిందంటే అన్ని విషయాలూ తెలుసుకో గలరు. ఆయన ఒకవేళ చూసినా నేను పరుగెత్తి ప్రాణాలు రక్షించుకో గలను, గదిలోపెట్టి ఆయన నన్ను కోడిని చంపినట్లు చంపితే! నే నం దుకు అంగీకరించలేను."

గత్యంతరంలేక రూపరోహిణి దగ్గిరకెళ్ళి నిశాకరుడు చెప్పిన మాటలన్నీ నివేదించింది ఇప్పుడు రోహిణి మనస్సులోని అభిప్రాయ మేమిటో చెప్పలేము. మనుష్యులు తమ మనస్సులోని విషయాలే తాము తెలుసుకోలేరే. అలాంటప్పుడు రోహిణి మనస్సులోని భావం ఇదీ అని ఎలా చెప్పగలం? రోహిణి బ్రహ్మానందుని ఎంత ప్రేమిస్తూ ఉంటుం దంటే - అతడి కబుర్లు తెలుసుకోవాలనే తహతహలో దిక్కుతోచనిది అవుతూ వుంటుంది. ఈ సంగతి మేము దాచటంలేదు. బహుశా ఇంకో సంగతికూడా ఉండిఉండొచ్చు. కొంచెం ఒకర్నొకరు చూసుకోటాలూ, అవీ అయినాయి. నిశాకరుడు అందగాడని రోహిణి చూసింది, మనుష్యు లలో నిశాకరుడు మానసత్వం ప్రధానంగా కలవాడై ఉండటం కూడా కని పెట్టింది రోహిణి. నేను గోవిందలాల్ విషయంలో విశ్వాసఘాతకు రాలినికాలేను అనేదృఢసంకల్పం కూడా ఉంది ఆమె మనస్సులో. కాని విశ్వాసహాని అనేది ఒకటి. ఈ సంగతి మరొకటి, ఆమహాపాపిష్ఠురాలు "అజాగ్రత్తగా ఉన్న మృగం దొరికితే ఏ బోయవాడు బాణాన్ని ఎక్కు పెట్టి దాన్ని కొట్టకుండా ఉంటాడు" అని అనుకుంది మనస్సులో. ఆన

దైఉండి జయించదగిన పురుషుడు కంటపడినప్పుడు, ఏఆడది అతణ్ణి జయించాలని కాంక్షించకుండా ఉంటుంది? పులి ఎద్దులను చంపుతుంది. కాని చంపినవాటినన్నిటినీ తినదు. స్త్రీలు పురుషుల్ని జయిస్తారు. అంటే కేవలం జయపతాకాన్ని ఎగరవేయటానికే. వేట కేవలం వేటకోసమేకాని ఆ వేటాడినదాన్ని భుజించటానికి కాదు అనేకమంది పక్షులను చంపుతారు. కేవలం చంపాలనే - చంపి అవతల పారేస్తారు. అందులో ఏం ఆనందం ఉందో తెలియదు. "ఈ విశాల నేత్రాలుకల మృగం ఈ ప్రసాదపురంఅనే అడవికి వచ్చినప్పుడు ఆ మృగాన్ని బాణంవేసి కొట్టకుండా ఎందుకు విడిచిపెట్టాలి?" అని కూడా ఆలోచించి ఉండవచ్చు ఆ పాపాత్మురాలు. ఆమె పాపహృదయంలో ఏం ఆలోచనకలిగిందో తెలియదు. కాని ఈ ప్రదోషకాలం పూర్తికాగానే రహస్యంగా చిత్రానదీ రేవుకు నిశాకరుడి దగ్గరకువెళ్ళి పింతండ్రి కబుర్లు తెలుసుకోటానికి అంగీకరించింది.

రూపవచ్చి ఆ సంగతి నిశాకరుడితో చెప్పింది నిశాకరుడు విని సంతోషంతో మెల్లగా అక్కడనుంచి లేచివెళ్ళాడు.

---

# 39

రూపవెళ్ళిపోయాక నిశాకర్ సోనానిపిలిచి "మీబాబుగారిదగ్గిర ఎన్నాళ్ళనుంచి ఉంటున్నావ్?" అనిఅడిగాడు.

"ఇక్కడకు వచ్చినప్పటి నుంచీ"

"అయితే కొద్దిరోజులనుంచే — ఏంవస్తుంది?"

"నెలజీతం మూడురూపాయలు - తిండీ. బట్ట"

"ఇంతతక్కువ జీతంలో మీలాంటి నౌకర్లకు ఏంగడుస్తుంది? ఆమాటవిని సోనానౌకరీని తిట్టుకుంది "ఏంచెయ్యను? ఇక్కడమరో చోట నౌకరీదొరుకుతుందా?"

"నౌకరీకేంభాగ్యం? మాఊరుకనుకవస్తే నీకాలోపంఉండదు అయిదూ, పదిరూపాయల జీతం సునాయాసంగా దొరుకుతుంది"

"దయఉంచి మీతోకూడాతీసుకు వెళ్ళండి"

"తీసుకువెళ్ళకేం? ఇలాంటియజమాని దగ్గరఉద్యోగం పమయి కుంటావామరి?"

"యజమాని మంచివాడేగాని యజమానురాలు మాత్రం మహా పాపిష్ఠురాలు".

"ఆసంగతినేను చూచాయగా గ్రహించాను. నాకోనువ్వురావటం నిశ్చయమేనా?"

"నిశ్చయంకాక పోవటమేమిటి?

"కానివచ్చేలోపుగా నీయజమానికి ఒక ఉపకారం చేసిరా. కాని చాలా జాగ్రత్తగా చెయ్యవలసినపని. చెయ్యగలవా?"

"మంచిపనయితే ఎందుకుచెయ్యను?"

"మీ యజమానివిషయంలోమాత్రం మంచిదేకాని యజమానురాలి విషయంలో మంచిదికాదు."

"అయితే ఇప్పుడే చెప్పండి? ఆలస్యం చెయ్యటంవల్ల లాభంలేదు. అందుకునేను పూర్తిగా ఒప్పుకుంటాను"

"చిత్రానదిరేవులో రాత్రికి నన్ను రహస్యంగావచ్చి కలుసుకోటానికి ఎదురుచూస్తూ కూర్చుంటాను అనిమీయజమానురాలు కబురుచేసింది. అర్థమయిందా? నేను ఒప్పుకున్నాను మీ యజమానికళ్ళు విప్పాలనికాయి అని నాఉద్దేశ్యం. నువ్వునెమ్మదిగావెళ్ళి ఈసంగతి మీ యజమానికి చెప్పి రాగలవా?"

"ఇప్పుడే — ఆపాపం పోగొట్టితే బ్రతుకురాను"

"ఇప్పుడుకాదు. ఇప్పుడునేనువెళ్ళి రేవుదగ్గిర కూర్చునిఉంటాను. నువ్వుజాగ్రత్తగాఉండు. మీయజమానురాలు అక్కడకు బయలుదేరిరావటం చూడగానేవెళ్ళి మీయజమానితోచెప్పు. రూపకుపమితె రియహాడదు. తర్వాతనన్ను వచ్చికలుసుకుందువుకాని"

"చిత్తం" అని సోనా నిశాకరుని పాదధూళి తీసుకుని శిరస్సున ఉంచుకుంది. అప్పుడిహ నిశాకరుడు తాపీగా మత్తగజంలాగా నడుస్తూ చిత్రానదీ తీరానఉన్న మెట్లమీదకువెళ్ళి కూర్చున్నాడు. చీకటో నక్షత్ర కాంతిలో మిలమిలలాడుతూ చిత్రానది నిశ్శబ్దంగా ప్రవహిస్తోంది. నాలుగు వైపులా కుక్కలూ, నక్కలూ మొరుగుతున్నధ్వని. ఎక్కడోదూరంగా పడవమీదకూర్చొని, పల్లెవాళ్ళు పాటలుపాడుతున్నారు. ఇంతకుతప్ప

ఆవిజన ప్రవేశంలో మరోధ్వనిలేదు ఎక్కడా. నిశాకరుడు ఆపాటవిం టూ, గోవిందలాల్ మేడ రెండో అంతస్తు గదిలోంచి కిటికీలనుంచి బైటికిపడుతున్న వెలుతురునుచూస్తూ కూర్చున్నాడు. "నేనెంత ఘాతుకుణ్ణి! ఒక్క స్త్రీని నాశనంచేయటానికి ఎంత పన్నాగం పన్నాను! ఘాతుకత్వం మాత్రమేమిటిలే, దుష్టులను శిక్షించటం అవశ్యకర్తవ్యం స్నేహితుడి కుమార్తెను రక్షించటంకోసం ఈపని చేస్తానని స్నేహితుడి దగ్గర ఒప్పుకున్నాను కనుక, తప్పకుండా చేసితీరుతాను. ఇందులో నామనస్సుకు సంతోషం ఏమీలేదు. రోహిణి పాపిష్ఠురాలు పాపానికి శిక్షవిధిస్తాను. పాపస్రోతస్సుకు అవాంతరం కల్పిస్తాను. ఇందులో ఆసంతోషంమాత్రం ఎందుకో చెప్పలేకుండా ఉన్నాను. సరియైన మార్గాన వెడితే ఇంత ఆలోచించేవాణ్ణికాదేమో! కంటకమార్గంలో సంచరించాల్సివచ్చింది కనుకనే ఇంతగుంజాటన కలుగుతోంది. పాపపుణ్యాలకు శిక్షవిధించటానికి ఎవర్నినేను? నాపాపపుణ్యాలకు శిక్షవిధించేవారెవరో అతడే రోహిణికికూడా విచారకర్త. బహుశా ఆతడే నన్నీపనికి వినియోగించాడేమో చెప్పలేను. ఏంచెప్పగలను.''

"త్వయా । హృషీకేశ । హృది । స్థితేన
యథా । నియుక్తోఽస్మి । తథా । కరోమి"

ఇలా ఆలోచిస్తూ ఉండగానే జాముప్రొద్దుపోయింది రాత్రి.అప్పుడు చప్పుడుకాకుండా మెల్లిగా అడుగులు వేసుకుంటూ రోహిణివచ్చి దగ్గర నిలబడటంచూశాడు నిశాకరుడు. ఆనిశ్చయాన్ని మరింత దృఢంచేసుకోటానికి "ఎవరునువ్వు?" అని ప్రశ్నించాడు.

రోహిణికూడా ఆలాగే తననిశ్చయాన్ని ధృఢంచేసుకోటానికి "నువ్వెవరవు?'' అని అడిగింది.

"నేను రాసవిహారిని''

"నేను రోహిణిని''

"ఇంతరాత్రి అయింది ఏంచేత?''

"కొంచెం ఎవ్వరికీ తెలియకుండా ఉండాలని ఇప్పటిదాకా రాలేకపోయాను. ఎవరెక్కడనుంచి చూస్తూవుంటారో ఏంచెప్పగలం? అందువల్ల మీకుచాలాకష్టమయిం దనుకుంటా"

"కష్టంఅవనీ, కాకపోనీనువ్వుబహుశా మరిచి పోయావేమో అని చాలాభయం వేసింది మనస్సులో"

"నేనుమరిచి పోయేస్వభావం కలదాన్నిఅయితే నాస్థితియిలాఎందుకుంటుంది? ఒకవ్యక్తిని మరిచిపోలేకనే ఈఊరువచ్చాను. ఇహఇప్పుడు నిన్నుమరిచిపోలేకనే ఈచోటుకువచ్చాను''

ఇలాఅంటూవుండగానే వెనకనుంచి ఎవరోవచ్చి రోహిణిగొంతు గట్టిగా పట్టుకున్నారు. రోహిణిత్రుళ్ళిపడి "ఎవరునువ్వు?''అని అడిగింది.

గంభీరస్వరంతో "నీపాలిటియముడిని" అని సమాధానం ఇచ్చారు ఎవరో.

అతను గోవిందలాల్ అనిగుర్తుపట్టిందిరోహిణి. అప్పుడిహఆపద నెత్తిన పడ్డట్టుగ్రహించి నాలుగువైపులా అంధకారాన్నిచూసి భయకంపితస్వరంతో "విడవండి విడవండి నేనుదురుద్దేశ్యంతో రాలేదు ఇక్కడికి నేనుఏవుద్దేశ్యంతో వచ్చానో,అంతగా కాకపోతే ఈబాబుగారిని అడగండి

ఇలాఅని రోహిణి నిశాకరుడు కూర్చున్నచోటును చేత్తోనిర్దేశించి చూపించి ది. చూస్తే అక్కడఎవరూలేరు. నిశాకరుడు గోవిందలాల్ను చూసి, కనురెప్పపాటులో ఎక్కడికో పారిపోయాడు. రోహిణివిస్మితురాలై "ఏమటి? ఎవరూలేరేఎక్కడా?'' అన్నది.

"ఇక్కడ ఎవరూలేరు. నాతోకూడా ఇంటికిరా" అన్నాడు గోవిందలాల్.

రోహిణి విషణ్ణహృదయంతో మెల్లి మెల్లిగా గోవిందలాల్తో కూడా యింటికి తిరిగి వెళ్ళింది.

---

## 40

గోవిందలాల్ ఇంటికితిరిగివచ్చి "ఎవ్వరూ మేడమీదికిరావద్దు" అనినౌకర్లను ఆజ్ఞాపించాడు.

ఉస్తాద్జీ ఇంటికివెళ్లిపోయాడు.

గోవిందలాల్ రోహిణిని ఏకాంతంగా పడకగదిలోకి తీసుకువెళ్ళి తలుపులుబిగించాడు. రోహిణిఎదురుగా - నదీప్రవాహానికి చలిస్తూ ఉండే

ప్రబ్బలితీగెలాగా వణికిపోతున్నది. గోవిందలాల్ మృదువుగా "రోహిణీ!" అని పిలిచాడు.

"ఎందుకు?" అన్నది రోహిణి

నీతోమాట్లాడ వలసిన సంగతులున్నాయి కొన్ని.

"ఏమిటి?"

"నవ్వునాకు ఏమవుతావ్?"

"ఏమీకాను. మీపాదాలదగ్గిర ఉండనిచ్చినన్నాళ్లూ దాసీని లేకపోతే ఏమీకాను"

"పాదాలమీదనుంచి నెత్తినెక్కించుకున్నాను. రాజైశ్వరమూ, రాజ సంపద, నిష్కళంకమైన చరిత్ర, త్యజించరాని ధర్మాన్నీనీకోసం త్యజించాను నేకోసంఇవన్నీ త్యజించి 'అరణ్యవాసి' నిఅయానే-ఎవరవునువ్వు? నీకోసం భ్రమరి-ప్రపంచంలో సాటిలేనిది. విచారంలోసుఖం, సుఖంలో అతృప్తీ, దుఃఖంలో అమృతమూ అయిన - భ్రమరిని కూడా పరిత్యజించాను కదా ? ఎవరవు నువ్వు ?"

ఇలా అని గోవిందలాల్ దుఃఖాన్నీ, కోపాన్నీ ఆపుకోలేక రోహిణిని ఒక్క తన్నుతన్నాడు.

రోహిణి చతికిలపడింది. మారు మాట్లాడకుండా ఏడవసాగింది. కాని కళ్ళనీళ్ళను గోవిందలాల్ చూడలేదు.

"లేచి నుంచో రోహిణీ!" అన్నాడు, గోవిందలాల్.

ఆమె లేచి నుంచుంది.

"నువ్వు ఒకసారి చచ్చిపోదామని ప్రయత్నించావు. ఈ సారి చచ్చేటంత సాహసం ఉందా?"

రోహిణి అప్పుడు చచ్చిపోదామనుకుంటున్నది. భయకంపిత స్వరంలో "ఇప్పుడుమాత్రం చావకుండా ఉందామని ఎందుకనుకుంటాను? మొహాన రాసిపెట్టి ఉన్నదేదో జరిగిపోయింది" అన్నది.

"అయితే నుంచో కదలకు"

రోహిణి అలాగే నుంచుంది.

గోవిందలాల్ పెట్టెతెరిచి పిస్తోలు పైకితీశాడు. దట్టించే ఉన్నది పిస్తోలు.

ఆ పిస్తోలు తీసుకువచ్చి రోహిణి కెదురుగా పట్టుకుని "ఏం చచ్చి పోతావా?'' అన్నాడు

రోహిణి ఆలోచించసాగింది. అనాయాసంగా వారుణీ తటాకంలో మునిగి చనిపోదామని వెళ్ళినరోజును ఈనాడు మరిచిపోయింది రోహిణి ఆదుఃఖమూలేదు. ఆసాహసమూలేదు ఇప్పుడు'' చావటం ఎందుకు? లేదా ఈయన విడిచిపెడదాడు,విడిచిపెట్టనీ. ఈయన్ని ఎన్నడూ మరిచిపోలేనని చెప్పి చావటం ఎందుకు? దుఃఖస్థితిలో పడ్డప్పుడు ఈయన్ని జ్ఞాపకం తెచ్చుకుంటాను. ప్రసాదపురంలో సుఖదినాలను జ్ఞప్తికితెచ్చుకుంటాను. అదొక సుఖం! అదొకఆశ! చావటం ఎందుకు?'' అనుకుంది,

"చావను. చంపవద్దునన్ను పాదాలదగ్గర ఉండనీయకపోతే వదిలి వెయ్యండి". అన్నది రోహిణి.

అని గోవిందలాల్ పిస్తోలు పైకితీసి రోహిణి ముఖంమీదికి గురి పెట్టాడు.

"చంపవద్దు, చంపవద్దు. నాది నూత్నయౌవనము, నూత్న సుఖ మూను. అది ఇంక మీకు చవిచూపను. మీ మార్గానికి అడ్డుకూడారాను. ఇప్పుడే వెళ్ళిపోతాను. నన్ను చంపవద్దు" అని ఏడ్చింది రోహిణి.

గోవిందలాల్ పిస్తోలు 'ఢఀ'మని మ్రోగింది తర్వాత పెద్దధ్వని తర్వాత అంతా అంధకారము. రోహిణి ప్రాణాలు కోల్పోయి నేలమీద పడింది.

గోవిందలాల్ పిస్తోలు క్రిందపారేసి గబగబా ఇంట్లోంచి బైటికి వెళ్ళిపోయాడు.

ఆ ధ్వని విని రూప మొదలైన భృత్యవర్గమంతా చూడటానికి పరుగెత్తుకుంటూవచ్చారు దళాలన్నీ త్రుంచివేసిన పద్మంలాగా రోహిణి మృతశరీరం నేలమీద దొర్లుతోంది. గోవిందలాల్ ఎక్కడా పత్తాలేదు.

---

## 41

ఆరాత్రే చాకీదార్ పోలీస్‌స్టేషన్‌కువెళ్ళి ప్రసాద్ పూర్‌బంగళాలో ఖూనీజరిగిందని రిపోర్టు ఇచ్చాడు. అదృష్టంకొద్దీ స్టేషన్ దగ్గరలోలేదు. అయికోసులదూరంలో ఉంది. ఇనస్పెక్టరు వచ్చేసరికి మర్నాడు జాము

ప్రొద్దెక్కింది అతడువచ్చి ఆచూకీతీయటం ప్రారంభించాడు. మామూలుగా పత్రికనేలనుకుని ఉన్నగదినీ, శవాన్నీ పరీక్షించి రిపోర్టుపంపించాడు. తర్వాత శవాన్నికట్టివేసి బండిమీదఎక్కించి చౌకీదారుతో హాస్పటల్‌కు పంపించాడు. తర్వాత స్నానంచేసి భోజనాదికాలు ముగించుకుని ఇహ అపరాధిని వెతకటంలో ప్రవృత్తుడయినాడు. ఎక్కడున్నాడుఅపరాధి? గోవిందలాల్ రోహిణినికాల్చగానే ఇంట్లోంచిబైటికి వెళ్ళినవాడు మళ్ళీరానే లేదు. ఒకరాత్రి ఒకపగలూ అవకాశం వచ్చేసరికి గోవిందలాల్ ఎంత దూరంఎక్కడికి వెళ్ళాడో ఎవరుచెప్పగలరు? ఎవ్వరూచూడలేదుఅతడ్ని. ఎటువైపుగా పారిపోయాడోకూడా ఎవ్వరికీతెలియదు. అతడిపేరుకూడా ఎవ్వరూఎరగరు. గోవిందలాల్ ప్రసాద్‌పూర్‌లో తనపేరూ, ఊరూఎన్నడూ బైటపెట్టలా. అక్కడచునీలాల్‌దత్త అనేపేరుతో వ్యవహరించాడు. అత డేఊరునుంచి వచ్చాడోకూడా ఎరగరునౌకర్లు ఇనస్పెక్టరు కొన్నిరోజుల పాటుపీరినీ, వారినీపట్టుకుని వాఙ్మూలాలు తీసుకోసాగాడు. గోవిందలాల్ ఆచూకీ ఏమాత్రంచిక్కలేదు చివరికతడు అపరాధిపరారయినాడు అని రిపోర్టుదాఖలు చేశాడు.

అప్పుడు యశోహర్‌నుంచి ఫిచుల్‌ఖాన్ అనేడిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ పంపబడ్డాడు. ఫిచుల్‌ఖాన్ అనుసంధాన ప్రణాళిక మేమువిపులంగా చెప్ప వలసినఅవసరంలేదు. వెతకగా వెతకగా కొన్నిపుత్తరాలు పట్టుకున్నాడు. వాటిమూలంగా అతడుగోవిందలాల్ అసలుపేరు ఊరు, నిర్ణయించాడు. అతడు కష్టపడి మారువేషంవేసుకుని హరిద్రాగ్రామంకూడా వెళ్ళాడని వేరే చెప్పనక్కర్లేదు కానిగోవిందలాల్ హరిద్రాగ్రామంవెళ్ళాలా అంచేత ఫిచుల్‌ఖాన్ గోవిందలాల్‌ను పట్టుకోలేక తిరిగివచ్చాడు.

ఇహనిక్కడ - నిశాకరుడు భయంకర మృత్యుసమానమైన ఆఅర్ధ రాత్రి ఆపదలోచిక్కుకున్న రోహిణిని విడిచిపెట్టి ప్రసాదపూర్ బజా రులోతనుతీసుకున్నఇంటికివచ్చేశాడు అక్కడమాధవీనాధ్‌కుఅతడికోసం ఎదురు చూస్తున్నాడు మాధవీనాధ్ గోవిందలాల్‌కు సుపరిచితుడు అవటం వల్లస్వయంగా అతడివగ్గిరకు వెళ్ళలేదు ఇప్పుడు నిశాకరుడువచ్చి అన్నీ వివరంగా చెప్పేశాడు మాధవీనాధ్‌విని "మంచిపని జరగలేదుబాయీ? ఒకవేళనీ జరగవచ్చు" అన్నాడు. దీనికిపరిణామం ఎలావుంటుందో తెలుసు కోటానికి ఇద్దరూ ప్రసాద్‌పూర్‌లో ప్రచ్ఛన్నంగా అతిజాగరూకతతో నివ

సించసాగారు. చునీలాల్ దత్త తన భార్యను ఖూనీచేశాడని ఉదయం కాగానే విన్నారు. వాళ్లు ఎంతో భయపడ్డారు; దుఃఖితులూ అయినారు గోవిందలాల్ కోసం భయం; కాని చివరకు ఇన్‌స్పెక్టరు ఏమీ చేయలేక పోవటం గమనించారు. గోవిందలాల్ జాడ ఏమీ తెలియలా. అప్పుడిహ వారు ఒక విధంగా నిశ్చింతులై. అతివిషణ్ణభావంతో స్వస్థానానికి బయలు దేరారు.

---

# 42

భ్రమరి చనిపోలేదు. ఎందుకు చనిపోలేదో మాత్రం తెలియదు. ఈ ప్రపంచంలో అతిదుఃఖదాయకమయిన విషయిమిదే. ఏమిటంటే చావ తగిన వయస్సులో ఎవరూ చనిపోరు. అందరూ అకాలంలోనే మరణి స్తారు. భ్రమరి మరణించకపోవటానికి కూడా కారణం బహుశా ఇదే అయి ఉంటుంది. ఏమయితేయేం భ్రమరి ఉత్కటమైన వ్యాధినుంచి కొంతవరకు కోలుకుంది. పుట్టింట్లో ఉన్నది భ్రమరి. మాధవనాథ్ గోవిందలాల్ విషయమై తెచ్చిన కబురు, ఆయన భార్య అతి రహస్యంగా పెద్దకూతురుకు భ్రమరి అక్కకు చెప్పింది. ఆమె అతి రహస్యంగా అ సంగతి భ్రమరితో చెప్పింది. "ఇప్పుడాయన హరిద్రాగ్రామంవచ్చి ఇంట్లో ఎందుకు ఉండకూడదూ? అలా అయితే ఏ ఆపదా ఉండదనుకుంటా" అన్నది భ్రమరి అక్క అయిన యామిని.

"ఆపద ఎలా ఉండకుండా ఉంటుంది?" అన్నది భ్రమరి.

"అతడు ప్రసాద్ పూర్‌లో పేరుమార్చుకుని ఉంటూ ఉండేవాడు. అతడే గోవిందలాల్ బాబు అన్న సంగతి ఎవరికీ తెలియదు."

"పోలీసులు హరిద్రా గ్రామం కూడా వారిని వెతుక్కుంటూవచ్చా రని వినలేదా ఏం? అలాంటప్పుడు ఇంక తెలియకుండా ఎలా ఉంటుంది?"

"పోనీ తెలియనీ—అయినా ఇక్కడకు వచ్చి, నీ ఆస్తి స్వాధీనం చేసుకున్నాడంటే డబ్బు చేతినిండా వస్తుంది. పోలీసులు డబ్బుకులొంగు తారని చెప్పాడు నాన్న."

"ఆ సలహా వారి కెవరిస్తారు? ఆసలహా ఇవ్వటానికి వారెక్కడ కన్పిస్తారు నాకు? నాన్న ఒకసారి వెదకి వా రెక్కడున్నదీ ఆచూకీ

తీశాడు—మరోసారి వెతికితే మళ్ళీ కనుక్కోలేడూ?'' అని ఏడవసాగింది భ్రమరి.

"పోలీసులు ఎంతో ఆచూకీ తీయగలవాళ్ళు. వాళ్ళే రాత్రింబగళ్ళు వెతికి వెతికి ఆయన ఎక్కడున్నదీ తెలుసుకోలేనప్పుడు ఇహ నాన్న మాత్రం ఎలా వెతికి పట్టుకోగలడు? కాని గోవిందలాల్‌బాబు తనంతట తానే హరిద్రాగ్రామం వస్తాడని తోస్తుంది నాకు. ప్రసాద్‌పూర్‌లో ఆ సంఘటన జరగగానే. అతడు హరిద్రాగ్రామంలో కన్పించినట్లయితే— అతడే ఆ ప్రసాద్‌పూర్‌లో ఉన్న బాబు కూడా-అని లోకులకు నమ్మకం కలిగేది. ఇందుకనే బహుశా అత డిన్నాళ్ళదాకా రాకుండాఉండిఉంటాడు. ఇహ రావచ్చు అని నమ్మకం కలుగుతోంది."

"నా కేమాత్రం నమ్మకం లేదు."

"ఒకవేళ వచ్చాడేమో"

"ఒకవేళ వస్తే వారికి శుభం కలుగుతుంది. వారు రావాలని నేను భగవంతుణ్ణి మనోవాక్కాయ కర్మలతో ప్రార్థిస్తున్నాను దానివల్ల వారు ఏ ఆపదా లేకుండా ఉండకలిగితే - వారు ఈ జన్మలో హరిద్రా గ్రామం రాకుండా ఉన్నాసరే. భగవంతుడు వారికి అలాంటి బుద్ధిపుట్టించాలి."

"నా ఉద్దేశ్యంలో నువ్వు అక్కడ ఉండటమే మంచిది చెల్లీ! అతడు చేతిలో డబ్బు లేకపోయేసరికి ఏ రోజున అక్కడికి వస్తాడో ఏం తెలుసు? మేనేజరు గుమాస్తాల మీద నమ్మకంలేక వాళ్ళతో కలుసుకోక పోతే? నువ్వు కనపడక పోయేసరికి అతడు తిరిగి వెళ్ళిపోతాడు మళ్ళీ"

"నా కిదో వ్యాధి. ఎప్పుడు చస్తానో ఎప్పుడు బ్రతుకుతానో!— నేను అక్కడ ఎవరి ఆశ్రయంలో ఉండను?"

"అడిగావంటే - అంతగా కాకపోతే - మేమే ఎవరమో వచ్చి ఉంటాం. ఏమయినా నువ్వు అక్కడే ఉండటం నీ కర్తవ్యం'' భ్రమరి ఆలోచించి "సరే నేను హరిద్రాగ్రామం వెడతాను. రేపే నన్ను పంపించమని అమ్మతో చెప్పు. ఇప్పుడు మీ రెవ్వరూ రానక్కర్లేదు. కాని నాకు ఆపద సంభవించినప్పుడు మాత్రం మీరు వచ్చి కన్పించండి."

"ఆపద ఏమిటి భ్రమరి?"

"ఒకవేళ వారు వస్తారేమో?'' అని ఏడవసాగింది భ్రమరి.

"అయితే ఇహ ఆపద ఏమున్నది భ్రమరీ? నువ్వు పోగొట్టుకున్న ధనం మళ్ళీ ఇంటికివస్తే-అంతకన్న ఆహ్లాదకరవిషయం ఇంకేముంది?''

"ఆహ్లాదమా అక్కా! ఆహ్లాదవిషయం ఏముంది ఇంక నాకు?'' భ్రమరి ఇంక మాట్లాడలేదు. ఆమె మనస్సులోని సంగతి యామిని ఏ మాత్రం గ్రహించలేదు. హృదయ విదారకమైన భ్రమరి ఏడుపును యామిని ఏమాత్రం అర్థం చేసుకోలేకపోయింది భ్రమర మానసనేత్రాల్తో గిర్రన తిరుగుతున్న చిత్రాలలాగా - ఈ సంఘటన ఎలా పర్యవసిస్తున్నదో మాత్రం చూడగలిగింది. యామిని అది ఏమాత్రం చూడలేక పోయింది, గోవిందలాల్ హంతకుడు అన్న సంగతి భ్రమరి మరిచి పోలేదు.

---

# 43

భ్రమరిమళ్లీ అత్తవారింటికి వెళ్ళింది. భర్తవస్తాడేమో అని నిత్య మూఎదురు చూడసాగింది. కానిఅతడు మాత్రంరాలేదు రోజులూ, నెల లూ గడిచిపోతున్నాయి - కానిభర్తమాత్రంరాలేదు ఏకబురూకూడా తెలి యలేదు ఇలాగే మూడోసంవత్సరం గడిచిపోయింది, గోవిందలాల్ రాలేదు నాలుగోసంవత్సరం గడిచింది - అయినారాలేదు. గోవిందలాల్ ఇటుచూస్తే భ్రమరికివ్యాధి ఎక్కువకాసాగింది. ఉబ్బసంరోగం-ఆరోజు కారోజు శరీరం కృశిస్తోంది.—ఇహ ఈజన్మలో కన్పడడేమో అని పిస్తోంది.

తర్వాత అయిదోసంవత్సరం గడుస్తుండగా ఓపెద్ద గందరగోళం బయలుదేరింది. గోవిందలాల్ పట్టుపడినట్లు హరిద్రాగ్రామానికి వార్త వచ్చింది. గోవిందలాల్ బైరాగివేషంలో బృందావనంలో ఉంటున్నాడనీ, అక్కడే పోలీసులు పట్టుకుని అతణ్ణి యశోహర్‌కు తీసుకువచ్చారనీ—అక్కడ అతడివిచారణ జరగుతుందనీ వార్తవచ్చింది.

ఈ సంగతి పుకారుగావిన్నది భ్రమరి ఆపుకారుకు ఆధారంఇది· గోవిందలాల్ భ్రమరి దివాన్‌జీకి "నేను జైల్లోవడ్డాను. నాపిత్రార్జితమైన ఆస్తినుంచి, నన్ను రక్షించటానికి డబ్బుఖర్చుపెట్టం మీ అందరికీ

సమ్మతమైతే ఇదేసమయం నేనందుకు యోగ్యుణ్ణికాదు. నాకు బ్రతకాలనే వాంఛలేదు! అయినా ఉరిశిక్షపడకుండా ఉండాలనే ఈబిక్ష. పుకారుగా ఈసంగతి ఇంట్లో తెలియపరచండి, కాని నేను ఉత్తరం రాసినసంగతి మాత్రం బైటపెట్టకండి.'' అనిఉత్తరంరాశాడు, దివాన్‌జీ ఉత్తరంసంగతి బైటపెట్టలేదు.—కాని ఇలాపుకారుగా వున్నదనిమాత్రం అంతఃపురం లోకి కబురు చేశాడు.

భ్రమరి యీసంగతి వినగానే తండ్రిని తీసుకురమ్మని మనిషిని పంపింది. భ్రమరి అతడికి యాభై వేలరూపాయల నోట్లుతీసియిచ్చి, సజల నేత్రాలతో "ఇప్పుడిహ ఏంచెయ్యాలో చెయ్యినాన్నా;—నేను ఆత్మ హత్య చేసుకునేంత అవసరం రాకుండాచూడు'' అన్నది.

మాధవీనాధ్‌కూడా ఏడుస్తూ"నిశ్చింతంగా ఉండమ్మా! నేను ఇప్పుడే యశోహర్‌కు వెడుతున్నాను. ఏమీ బెంగపెట్టుకోవద్దు. గోవిందలాల్ ఖూనీచేసినట్లు ప్రమాణమేమీలేదు. నేను నలభై ఏనిమిదివేలరూపాయలూ ఖర్చుకాకుండా తీసుకురాగలననీ, నాఅల్లుణ్ణి మళ్ళీ ఈఊరు తీసుకురాగల్గు ననీ ప్రతిజ్ఞచేసి వెడుతున్నాను'' అన్నాడు.

మాధవనాథ్ అప్పుడే యశోహరుకు ప్రయాణమైనాడు. ప్రమాణాలు కావలసినన్ని ఉన్నాయని విన్నాడు. ఇన్‌స్పెక్టరు ఫిచుల్‌ఖాన్ కేసు ఆచూకీ తీసి సాక్షులను తయారుచేశాడు. రూపా, సోనా మొదలైన సాక్షులు - ప్రస్తుతస్థితి తెలిసినవాళ్ళెవరైతే ఉన్నారో - వాళ్ళలో ఎవరినీ వెతకలేక పోయాడతడు. సోనా నిశాకరుడిదగ్గరఉన్నది. రూప ఏదేశంపోయిందో ఎవరికీ తెలియదు. ప్రమాణాలకున్న ఈ దురవస్థ గమనించి కొంచెం డబ్బుయిచ్చి ఫిచుల్‌ఖాన్ ముగ్గురు సాక్షులను సృష్టించాడు. సాక్షులు మేజిస్ట్రేట్ దగ్గర - "గోవిందలాల్ - అనే చునీలాల్ రోహిణిని స్వహస్తాలతో పిస్తోలుపెట్టి కాల్చటం మేము స్వయంగా చూశాము. మేము అప్పుడు అక్కడకు సంగీతం వినటానికి వెళ్లాం-" అని చెప్పారు. మేజస్ట్రేట్ గారు ఒక యూరపియన్. మంచి పరిపాలనా దక్షత కలవాడని గవర్నమెంటు వారిచే ప్రశంశలను పొందినవాడు. అతడు సాక్ష్యంమీద ఆధారపడి గోవిందలాల్‌ను సెషన్స్ విచారణకు అప్పగించాడు. మాధవ నాథ్ యశోహర్‌కు చేరుకునే సరికి, గోవిందలాల్ అప్పుడు జైల్లో నానా

అవస్థలూ పడుతున్నాడు. మాధవనాధ్ వచ్చి ఈ సంగతులన్నీ వివరంగా తెలుసుకుని విషణ్ణుడైనాడు.

అతడు సాక్షులపేరూ, విలాసమూ తెలుసుకుని వాళ్ళ ఇళ్ళకు వెళ్ళాడు. వారితో "బాబూ! మేజిస్ట్రేట్‌గారి దగ్గర ఏంచెప్పారో చెప్పారు. ఇప్పుడు జడ్జీగారి దగ్గిర మరొక విధంగా చెప్పాలి. అంటే మాకు ఏమీ తెలియదని చెప్పాలన్నమాట. ఇదిగో అయిదేసివందల రూపాయలు తీసుకోండి. యజమాని విడుదలైతే మరో అయిదేసివందలు యిస్తాను'' అని చెప్పాడు.

"వాగ్దానం భంగం చేయటంవల్ల చస్తామేమో!" అన్నారు సాక్షులు.

"భయం లేదు. నేను డబ్బు ఖర్చుపెట్టి సాక్షులద్వారా ఫిచుల్‌ఖాన్ మిమ్మల్ని కొట్టిపీడించి మేజస్ట్రేట్ దగ్గరతప్పుడు సాక్ష్యం ఇప్పించాడని రుజువు చేయిస్తాను"

సాక్షులు పద్నాలుగు జన్మల ఈ మధ్య ఒక్కసారిగా ఎప్పుడూ వెయ్యిరూపాయలు చూసి ఎరగరు. వెంటనే ఒప్పుకున్నారు.

సెషన్స్ విచారణ రోజు వచ్చింది. గోవిందలాల్ బోనులో ఉన్నాడు. మొదటి సాక్షి ముందుకువచ్చి ప్రమాణం చదివాడు. వకీల్ అతడ్ని ప్రశ్నించటం మొదలెట్టాడు. "నువ్వు ఈ గోవిందలాలును అనగా చునీలాల్‌ను ఎరుగుదువా?"

"ఏదీలేదే - ఎరిగినట్లు గుర్తు లేదు''

"ఎప్పుడయినా చూశావా?''

"లేదు''

"రోహిణిని ఎరుగుదువా?"

"ఏ రోహిణి"

"ప్రసాద్‌పూర్ బంగాళాలో ఉండేది-ఆరోహిణి"

"మా తాత ముత్తాతలు కూడా ఎన్నడూ ప్రసాద్‌పూర్ బంగళాకు వెళ్లి ఎరగరు"

"రోహిణి ఎలా చచ్చిపోయింది?"

"ఆత్మహత్య చేసుకున్నదని విన్నాం"

"ఖూనీ సంగతి ఏమయినా తెలుసా?''

ఏమీ తెలియదు"

వకీలు అప్పుడు ఈ సాక్షి మేజస్ట్రేట్ దగ్గిర ఇచ్చిన వాజ్మూలాన్నిచదివి, సాక్షికివినిపించి "నువ్వు మెజిస్ట్రేట్‌గారి దగ్గర ఈ సంగతులన్నీచెప్పావుకదూ?" అని అడిగాడు.

"ఆఁ చెప్పాను"

"ఏమీ తెలియకపోతే మరిఎందుకు చెప్పావు?"

"చావుదెబ్బలమూలంగా ఫిచుల్‌ఖాన్ కొట్టటంలో ఇంక నా శరీరంలో ఏమీ మిగల్చలా"

అని సాక్షి కాస్సేపు ఏడ్చాడు. నాలుగయిదు రోజులక్రితం అన్నదమ్ములతో భూమి విషయంలో పేచీలు వచ్చి కొట్టుకున్నారు. వీపుమీద వాటిగుర్తులు ఉన్నాయి సాక్షి ఏమీ బిత్తరపోకుండా ఆగుర్తులన్నీ ఫిచుల్‌ఖాన్ కొట్టినదెబ్బల గుర్తులని జడ్జీగారికిచూపించాడు.

వకీలుతెల్లబోయి రెండోసాక్షినిపిలిచాడు. ఆసాక్షికూడా ఇలాగే చెప్పాడు!అతడు వీపుమీద వాతపెట్టుకుని కట్టుకట్టుకుని వచ్చాడు - వెయ్యి రూపాయలకోసం ఎన్నైనా చేయగలడు - అది జడ్జిగారికి చూపించాడు.

మూడోసాక్షికూడా ఇలాగేచేశాడు. అప్పుడిహ జడ్జీగారు సాక్ష్యం రుజువు కాకపోయేసరికి దోషిని వదిలేశాడు. ఫిచుల్‌ఖాన్ విషయంలో చాలా అసంతుష్టుడై అతడి ప్రవర్తన విషయమై విచారించి తెలుసుకోవలసినదని మేజస్ట్రేట్‌కు సలహా యిచ్చాడు.

విచారణ సమయంలో సాక్షులంతా ఇలాతనపక్షం సహించటం చూసి గోవిందలాల్ విస్మితుడైనాడు తర్వాతజనంలో మాధవీనాథ్‌ను ఎప్పుడైతే చూశాడో అప్పుడంతాగ్రహించాడు. విడుదలఅయినాకూడా అతడు మళ్లీఒకసారి జైలుఆవరణలోకి వెళ్ళాల్సివచ్చింది - అక్కడ జైలర్ విడుదల ఆర్డరు చూపిస్తేనే విడిచిపెడతాడు అతడు మళ్ళీజైలులోకి వెడుతున్నపుడు మాధవీనాధ్ అతడిదగ్గరకువచ్చి చెవులో "జైల్లోంచివిడుదలకాగానే నన్నుకలుసుకో నేను ఫలానాచోటఉంటాను" అనిచెప్పాడు.

కానిగోవిందలాల్ జైల్లోంచి విడుదలఅయాక మాధవీనాథ్ దగ్గిరకు వెళ్లలేదు ఎక్కడకు వెళ్లాడో ఎవరికీ తెలియదు మాధవీనాథ్ అతడికోసం నాలుగయిదు రోజులువెతికాడు కానిఎక్కడా అంతుచిక్కలా.

గత్యంతరంలేక చివరకు ఒక్కడూ హరిద్రాగ్రామానికి తిరిగి వచ్చాడు,

---

# 44

మాధవనాథ్ వచ్చి, "గోవిందలాల్ విడుదలయినాడు. కాని ఇంటికి మాత్రంరాలేదు, ఎక్కడకివెళ్ళాడో ఎంతవెదికినా అంతుచిక్కలేదు" అనిచెప్పాడు భ్రమరితో మాదవీనాథ్ ప్రక్కకు తప్పుకోగానే భ్రమరి చాలాయేడ్చింది. కాని ఎందుకేడ్చిందో మాత్రం చెప్పలేదు .

ఇక్కడ గోవిందలాల్ విడుదలకాగానే ప్రసాద్‌పూర్ వెళ్ళాడు వెళ్ళిచూస్తే ప్రసాద్‌పూర్ బంగాళాలో ఎవ్వరూలేరు. ఒక్కవస్తువులేదు బంగాళాలోవున్న ద్రవ్యసామాగ్రి అంతా నలుగురయిదుగురు, లూటీ చేసితీసుకువెళ్ళి అమ్ముకున్నారని విన్నాడు. మేడ ఒక్కటే మాత్రమే ఉన్నదక్కడ; తలుపులూ, ద్వారబంధాలు దగ్గరనుంచి బైటికి ఎత్తుకు పోయినారెవరో ప్రసాద్‌పూర్‌లో ఒకటిరెండు రోజులుండి, ఇంట్లో మిగిలిన ఇటుకలూ. కొయ్యలూ అతిచవకగా ఒకవ్యక్తికిఅమ్మి-ఆవచ్చిన డబ్బుతీసుకుని కలకత్తా వెళ్ళిపోయాడు.

కలకత్తాలో అజ్ఞాతంగా అతిసామాన్యపౌరుడిలాగా రోజులు వెళ్ళ పుచ్చుతున్నాడు. గోవిందలాల్ ప్రసాద్‌పూర్‌లో వచ్చిన డబ్బు చాలా కొద్ది. అది ఒక సంవత్సరంలో ఖర్చు అయిపోయింది. ఇంక రోజులు గడిచే ఉపాయం కనపడలా. అప్పుడిహ—ఆరు సంవత్సరాల అనంతరం భ్రమరికి ఒక ఉత్తరం రాద్దామని అనుకున్నాడు మనస్సులో.

గోవిందలాల్ కలం, కాగితం తీసుకుని భ్రమరికి ఉత్తరం రాద్దా మని కూర్చున్నాడు. మేము యధార్థం చెబుతున్నాం - గోవిందలాల్ ఉత్తరం రాయటానికి ప్రారంభించి ఏడ్చాడు. ఏడుస్తూ ఏడుస్తూ ఉండగా భ్రమరి ఇంకా ఈనాటికి బ్రతికిఉందనటానికి ఆధారమేముంది? ఎవరికి రాయను ఉత్తరం? అని తోచింది మనస్సుకు మళ్ళీ" ఒకసారి రాసి చూద్దాం. ఆమె జీవించిలేకపోతే ఉత్తరం తిరిగి వస్తుందిగా భ్రమరి ఉన్నదీ లేనిదీ అలాచేస్తేతెలుస్తుంది" అనుకున్నాడు.

ఏంరాయను? అనిగోవిందలాల్ ఎంతసేపు ఆలోచించాడో చెప్ప లేము ఆ తర్వాత చివరకు 'దోషమేమీ లేకపోయినా ఆజన్మాంతం వదిలేసిన ఆమెకు జరిగిన సంగతిరాస్తే వచ్చేనష్టమేముంది?' అని ఆలోచించు కున్నాడు చివరకు ఇలారాశాడు ఉత్తరం:-

"భ్రమ రీ!

ఆరుసంవత్సరాల అనంతరం ఈపామరుడు నీకుమళ్ళీఉత్తరం రాస్తున్నాను. చదవాలని బుద్ధిపుడితే చదువు లేదా చదవకుండానే చించి పారెయ్

నాలదృష్టంలో జరిగిన సంఘటనలన్నీ నువ్వువినేఉంటావను కుంటా అదినాకర్మఫలం అనిఅంటే నీమనస్సులో ఉన్నమాట నేను చెబు తున్నానని అనుకోవచ్చునువ్వు ఎందుకుకాదు నేనునీదగ్గర ఈనాడు భిక్షకుణ్ణి

నేను ప్రస్తుతం దరిద్రుణ్ణి. మూడేళ్లు భిక్షమెత్తి రోజులు వెళ్ళ బుచ్చాను తీర్థప్రదేశాలలో ఉండేవాణ్ణి కనుక అక్కడ భిక్ష దొరికేది. ఇక్కడ భిక్ష దొరకదు. అంచేత భుక్తి గడవక చచ్చిపోతున్నాను,

నేను వెళ్లేందుకు ఒక చోటు ఉంది కాశీలో ఉన్న మా అమ్మ దగ్గరకు, అమ్మ అక్కడ చనిపోయింది అని నీకుతెలుసుననుకుంటా. అంచేత ఇహ వెళ్ళేందుకు ఎక్కడా స్థానమూ లేదు,భుక్తీలేదు.

అంచేత హరిద్రాగ్రామం వచ్చి ఈమలిన ముఖం చూపిద్దామను కున్నాను. లేకపోతే భుక్తిదొరకదు, అపరాధం లేకుండా నిన్ను పరిత్య జించి, పర స్త్రీ నిరతుడనై స్త్రీ హత్య కూడా చేసినవాడికి-నాకు ఇంక సిగ్గు ఏమిటి? భుక్తి కూడా లేనివాడికింక సిగ్గెందుకు? నేను నీతో విరో ధం పెట్టుకున్నాను - నువ్వు నాకు మళ్లీ ఆశ్రయాన్ని ఇవ్వగలవా?

కడుపు కక్కుర్తికోసం నీ ఆశ్రయాన్ని కోరుతున్నాను! ఇస్తా లేదా?"

ఉత్తరం పూర్తిచేసి ఎన్నెన్నో ఆలోచించి ఆ ఉత్తరం పోస్టులో వేశాడు గోవిందలాల్ పోస్టులో ఆలస్యంకాకుండానే భ్రమరికి చేరిందా, ఉత్తరం.

ఉత్తరం రాగానే భ్రమరి దస్తూరి గుర్తుపట్టింది, వణుకుతున్న చేతుల్తో కవరువిప్పి పడకగదిలోకి వెళ్ళి భ్రమరి తలుపులు బిగించుకుంది. ఏకాంతంగా కూర్చుని కన్నీటిధారలను తుడుచుకుంటూ ఉత్తరం చదవ సాగింది, ఒకసారి, రెండుసార్లు, పందసార్లు, వెయ్యిసార్లు చదివింది. ఆరోజున ఇంక భ్రమరి తలుపులు తెరవలేదు భోజనానికి రమ్మని పిలవ టానికి వచ్చినవారితో "నాకు జ్వరం వచ్చింది, భోజనంచెయ్యను'' అని చెప్పింది. భ్రమరికి తరచు జ్వరం వస్తూఉంటుంది. ఆమాట అందరూ నమ్మారు,

మర్నాడు - జాగరణతో భ్రమరి మంచంమీదినుంచి లేచేప్పటికి అప్పటికి నిజంగానే జ్వరం వచ్చింది భ్రమరికి. కాని మనస్సు నిర్వికా రంగా, స్థిరంగా ఉంది. ఉత్తరానికి సమాధానం ఏంరాయాలో అంతకు పూర్వమే నిశ్చయించుకుంది. అది ఒకసారికి వెయ్యిసార్లు ఆలోచించు కునే నిశ్చయించుకుంది కనక ఇహ ఇప్పుడు మళ్ళీ ఆలోచించాల్సిన పని లేదు. పదాలుకూడ ఏవేవి ఉపయోగించాలో నిశ్చయించుకుంది.

"సేవికా'' అన్నమాట వ్రాయలేదు. కాని భర్త సర్వావస్థలలోనూ పూజ్యుడే; అందుచేత "శతసహస్ర వందనములతో-ముఖ్యమైన విజ్ఞప్తి'' అని వ్రాసింది.

తర్వాత వ్రాసినదిది "మీఉత్తరంచేరి ది. ఆస్తిమీది నాదిఅయినా దాన్నిమీకు వ్రాసియిచ్చాను. వెళ్ళేప్పుడు ఆదస్తావేజు మీరు చించిపారేశారు జ్ఞాపకం ఉండేఉంటుంది, కానరిజిష్ట్రార్ ఆఫీసులో దానికినకలుఉంది. నేనువ్రాసి ఇచ్చినదేదో ఇప్పుడూచెల్లుతుంది.

అంచేత మీరు నిరభ్యంతరంగా హరిద్రాగ్రామానికి వచ్చిమీఆస్తిని మీరుదఖలు పరుచుకోండి ఇల్లుమీదే.

ఇహ ఈఅయిదేళ్ళనుంచీ నేనుచాలా డబ్బునిలపచేశాను అదీమీదే వచ్చిస్వీకరించండి,

ఈడబ్బులో కొంతనేను యాచిస్తున్నాను. ఎనిమిదివేలరూపాయలు అందులోంచి తీసుకున్నానునేను. మూడువేలరూపాయలతో గంగతీరంలో నాకోఇల్లు ఏర్పాటుచేసుకుంటున్నాను అయిదువేలరూపాయలతో నాజీవి తం నిర్విఘ్నంగా గడిచిపోతుంది

మీరురావటానికి తగిన ఏర్పాట్లన్నీ పూర్తిచేసి నేనుపుట్టింటికివెడతాను నాకొత్తఇల్లు తయారయేంతవరకూ అక్కడేఉంటానునేను, మీతో ఇహ ఈజన్మలో కలుసుకోవాలనే వాంఛలేదు. దీనివల్లనేనూసంతుష్టి పొందగలను మీరూసంతోష పడగలరనటంలో సందేహంలేదు.

మీరెండో ఉత్తరంకోసం యెదురుచూస్తున్నాను"

మామూలు సమయానికే ఉత్తరం గోవిందలాల్‌కు చేరింది - ఎంత భయంకరమైన ఉత్తరం! రవంతమృదుత్వమైనాలేదు. 'ఆరుసంవత్సరాల అనంతరం రాస్తున్నాను' అనిగోవిందలాలయినా వ్రాశాడు, కాని భ్రమరి ఉత్తరంలో అలాంటి ప్రస్తావన ఏమీలేదు. ఆభ్రమరి!

గోవిందలాల్ ఉత్తరం చదువుకుని "నేనుహరిద్రాగ్రామంరాను. నాకుఇక్కడ గడిచేందుకు సరిపడ్డఖర్చును - నెలనెలా భిక్షలాగా అక్కడనుంచి పంపించవలసింది'' అనివ్రాశాడు.

"నెలనెలకూమీకు అయిదువందలరూపాయలు పంపుతాను. ఇంకా ఎక్కువకూడాపంపగలను. కానిఅలాపంపితే అపవ్యయం జరుగుతుందేమోననిఊహ. మరొకవిజ్ఞప్తి. ప్రతిసంవత్సరం వచ్చేఅధికాదాయాన్ని మీరు ఇక్కడకువచ్చి అనుభవించటంమంచిది. నాకోసం దేశత్యాగంచెయ్యకండి - నాకురోజులు పూర్తిఅవుతున్నాయి" అనిజవాబిచ్చింది,

గోవిందలాల్ కలకత్తాలోనే ఉన్నాడు. అదేమంచిదనుకున్నారు ఇద్దరూ,

---

# 45

నిజానికి భ్రమరికి రోజులు సమీపిస్తున్నాయి చాలారోజులనుంచి భ్రమరి వ్యాధి చికిత్సవల్ల కొంతవరకు ఉపశమిస్తూ వచ్చింది; కాని వ్యాధి ఎక్కువయింతర్వాత చికిత్సకు లొంగలేదు, ఇప్పుడు భ్రమరి ఆరోజుకారోజు క్షీణించసాగింది. మార్గశిరమాసంలో మంచంఎక్కిన భ్రమరి మళ్ళీ మంచం దిగనేలేదు.'మాధవనాథ్ వచ్చి, స్వయ గాదగ్గిర ఉండి వృథాచికిత్స చేయి చసాగాడు. యామిని హరిద్రాగ్రామంలో ఇంటి దగ్గర ఉండి చెల్లెలికి అంత్యశుశ్రూష చేయసాగింది,

వ్యాధి చికిత్సకు లొంగలేదు. పుష్యమాసమంతా ఇలాగే గడిచి పోయింది. మాఘమాసంలో భ్రమరి మందుపుచ్చుకోవటం మానేసింది. మందుపుచ్చుకోవటం వృథాయిప్పుడు "ఇంక మందుపుచ్చుకోనవసరం లేదు అక్కా ఫాల్గుణమాసం వస్తోంది! ఫాల్గుణమాసంలో పూర్ణిమనాటి రాత్రి పోతాను. ఆ పూర్ణిమారాత్రి గడిచిపోకుండా చూస్తూఉండుఅక్కా; ఏమయినాసరే ఆరాత్రి చనిపోవాల్సిందే; జ్ఞాపకముంచుకో అక్కా!" అని చెప్పింది భ్రమరి యామినితో.

యామిని ఏడ్చింది. కాని భ్రమరి మందుమాత్రం పుచ్చుకోవటంలా మందుపుచ్చుకోకపోతే రోగం తగ్గటంలేదు. కాని భ్రమరిమాత్రం సంతోషంగా గడుపుతున్నది రోజులు.

రోజులు గడిచినకొద్దీ అంతిమకాలం సమీపిస్తోంది. భ్రమరి ఎంతో స్థైర్యంతోనూ, సంతోషంతోనూ ఉంటున్నది. చివరకు ఆ భయంకర మృత్యుదినం వచ్చింది. భ్రమరి ఊళ్ళోవాళ్ళ చాంచల్యాన్ని. యామిని దుఃఖాన్నీ చూసి ఇదే ఆఖరిరోజని గ్రహించింది. శరీరంలోని బాధవల్ల కూడా అలాగే అని తోచింది. అప్పుడు "ఇదే ఆఖరిరోజు" అని యామినితో చెప్పింది భ్రమరి.

యామిని ఏడ్చింది. "ఇది ఆఖరిరోజు అక్కా! నాదో భిక్ష ఉన్నది, వాగ్దానం చెయ్యి" అన్నది భ్రమరి.

యామిని ఏడవసాగింది; మాట్లాడలేదు.

"నాది ఒక్కటేభిక్ష; ఇవాళ ఏడవవద్దు నేను చనిపోయాక ఏడు. నేను వచ్చి అడ్డుపడను—కాని ఇవాళ నీతో చెప్పవలసిన మాటలు, నిర్విఘ్నంగా చెప్పి చనిపోదామని కోరికగా ఉంది"

యామిని కన్నీళ్లు తుడుచుకుని దగ్గర కూర్చుంది - కాని కంఠం బాష్పరుద్ధమవటంవల్ల మాట్లాడలేకపోయింది.

భ్రమరి చెప్పసాగింది. "ఇంకొకభిక్ష - నువ్వుతప్ప ఇంకెవరూ ఇక్కడకు రాకూడదు. ఆఖరిక్షణంలో అందరినీ చూస్తాను - కాని ఇప్పుడుమాత్రం ఎవరూ రాకూడదు. నీతో ఇంక మాట్లాడలేను"

యామినిఇంకా ఎంతసేపని ఏడుస్తూకూర్చుంటుంది?

క్రమంగా రాత్రిఅయింది "రాత్రివెన్నెలేనా అక్కా" అన్నది భ్రమరి.

యామినికిటికీతెరిచి 'దివ్యమైనవెన్నెల'' అనిచూపించింది.

"అయితే కిటికీలన్నీ తెరిచిఉంచు - నేను వెన్నెలనుచూస్తూ చచ్చిపోతాను. చూడు! ఈ కిటికీక్రింద పూలతోట! అందులోపూలన్నీ విచ్చినాయికదూ?''

ఆకిటికీ దగ్గరనుంచునే ఉదయంపూట భ్రమరి గోవిందలాల్‌తో మాట్లాడుతూవుండేది. ఏడేళ్ళనుంచి భ్రమరి ఆకిటికీ దగ్గరకు వెళ్ళటం లేదు. ఆకిటికీ తెరవటమూలేదు.

యామినిఅతి ప్రయత్నంమీద ఆకిటికీతెరిచి "ఏదీ? ఇక్కడ పూల తోటలేదు. ఒట్టిమోళ్లుఉన్నాయి. ఒకటి రెండుచెట్లుకూడా వున్నాయి కాని వాటని పూలుఏవీలేవు" అన్నది.

"ఏడేళ్ళక్రితం అక్కడపూలతోట ఉండేది దోహదం లేకపోవ టంవల్ల పాడైపోయింది. ఏడేళ్ళనుంచీ నేనటుచూడటమేలేదు"అనిభ్రమరి చాలాసేపు నిశ్శబ్దంగా ఊరుకుంది. తర్వాతమళ్ళీ "ఎక్కడనుంచిఅయినా సరేఅక్కా! నాకుఇవాళ పూలుతెప్పించితీరాలి - ఇవాళనాకు పూలపాన్పు తెలుసా?'' అన్నది.

యామినివద్దరఆజ్ఞతీసుకుని దాసదాసీలందరూ రాసులకొద్దీ తీసుకొచ్చారుపూలు "పూలునాపక్కమీద పరవండి ఇవాళనాకు పూలపాన్పు'' అన్నది భ్రమరి

యామిని అలాగేఅమర్చింది భ్రమరి కళ్ళవెంటనీళ్ళు రాసాగినాయి అప్పుడు. "ఏడుస్తున్నా వెందుకుచెల్లీ''? అనిఅడిగింది యామిని.

"ఒక్కదుఃఖం ఉన్నదిఅక్కా.! వారునన్ను త్యజించి వెళ్ళి పోయేరోజున చేతులజోడించి" ఒక్కసారిఅయినా వారినిమళ్ళీ కనిపించే ట్లుచెయ్యి'' అని భగవంతుని ప్రార్థించాను. 'నేను పతివ్రతనయితే వారి దర్శనం మళ్ళీ లభించితీరుతుంది.' అని ప్రతిజ్ఞచేశాను. ఏదీ, ఇంక కన్పించనలేదు మళ్ళీ. ఇవాళ—చనిపోయేరోజున—ఒక్కసారి వారు చూడగలిగితే—ఈఒక్కరోజులో ఏడుసంవత్సరాలనుంచి అనుభవించిన దుఃఖాన్ని మరచిపోగలను అక్కా'!' అన్నది భ్రమరి.

"చూస్తావా?'' అన్నది యామిని. భ్రమర చటుక్కున త్రుళ్ళిపడి "ఎవరిసంగతి చెబుతున్నావు నువ్వు?" అని అడిగింది.

యామిని చలించకుండా "గోవిందలాల్ సంగతి. అతడు ఇక్కడకు వచ్చాడు. నాన్న నీకు జబ్బుగా ఉందని తెలియజేశాడతడికి. ఈ సంగతి తెలుసుకుని నిన్ను ఒకసారి చూద్దామని వచ్చాడతడు. ఇవాళే చేరుకున్నాడిక్కడికి. నీ స్థితిచూసి భయపడి ఇంతసేపటివరకూ నీతో చెప్పలేకపోయాను. అతడూ సాహసించి నీ యెదుటికి రాలేకపోయాడు" అన్నది యామిని.

"ఒక్కసారి చూడాలిఅక్కా! ఈజన్మలో ఒక్కసారి చూస్తాను. ఇప్పుడేచూస్తాను'' అని ఏడ్చింది భ్రమర.

యామిని లేచివెళ్ళింది కాస్సేపటికల్లా మెల్లిగా చప్పుడుకాకుండా అడుగులువేసుకుంటూ ఎడేళ్ళగడిచాక ఇవాళ మళ్ళీ తన పడకగదిలోకి వచ్చాడు గోవిందలాల్.

ఇద్దరూ ఏడవసాగారు. ఒక్కరు కూడా మాట్లాడలేకపోయారు.

భ్రమర భర్తను దగ్గిరకవచ్చి పక్కమీద కూర్చోమని సంజ్ఞ చేసింది. గోవిందలాల్ ఏడుస్తూ పక్కమీదికి వచ్చి కూర్చున్నాడు. భ్రమరి అతణ్ణి ఇంకా దగ్గిరగా రమ్మనమన్నది. గోవిందలాల్ ఇంకా దగ్గిరగా వెళ్ళాడు. భ్రమరి భర్త పాదాలను తన చేతులదగ్గిరకు తీసుకుని పాదాల్ని స్పృశించి అతడి పాదధూళి శిరస్సున ధరించింది. "ఇవాళ నా అపరాధాల నన్నిటినీ క్షమించి, జన్మాంతరంలో సుఖించమని ఆశీర్వదించండి'' అన్నది.

గోవిందలాల్ ఏమీ మాట్లాడలేకపోయినాడు భ్రమరి చేతులను తనచేతుల్లోకి తీసుకున్నాడు ఆ చేతులు అతడి చేతుల్లో అలాగే చాలా సేపు ఉన్నాయి. భ్రమరి నిశ్శబ్దంగా ప్రాణాలు విడిచింది.

---

## 46

[illegible] విధిగా దహన సంస్కారం జరిగింది [illegible] గోవిందలాల్ ఇంట్లోనూ [illegible]. ఇంటికి తిరిగివచ్చి నప్పటినుంచీ అతడువరితోనూ ఏమీమాట్లాడలేదు.

తూర్పు తెలతెలవారింది. భ్రమరిచనిపోయిన మర్నాడు - సూర్యుడు ప్రతిరోజూ ఉదయించినట్లే, ఉదయించాడు. చెట్లఆకులన్నీ సూర్యకిరణాలతో ఉజ్జ్వలమయినాయి. సరోవరంలోని నల్లటినీళ్లు చిన్నచిన్న అలలు కొట్టుకుని మిలమిలలాడు తున్నాయి ఆకాశంలోని నల్లటిమేఘం తెల్లపడింది - భ్రమరిచావలేదన్నట్లు....గోవిందలాల్ బైటికివచ్చాడు.

గోవిందలాల్ ఇద్దరు స్త్రీలను ప్రేమించేవాడు - భ్రమరినీ రోహిణిని రోహిణీ చనిపోయింది భ్రమరీ చనిపోయింది యౌవ్వనంలో తృప్తి చెందని రూపతృష్ణను అణుచుకోలేక రోహిణి రూపానికి ఆకర్షితుడయినాడు భ్రమరిని త్యజించి రోహిణిని స్వీకరించగానే ఈమె రోహిణి కాని భ్రమరి కాదు; ఇది రూపతృష్ణ కాని ప్రేమ కాదు; ఇది భోగం కాని సుఖం కాదు! ఇదిమందర పర్వతఘర్షణవల్ల పీడితమైన వాసుకినిట్టూర్పుల నుంచి వెలికివచ్చిన హాలాహలంకాని, ధన్వంతరీ భాండంనుంచి ఉద్భవించిన అమృతం కాదు—అని తెలుసుకున్నాడు. ఈ హృదయసాగరం మథనపడి, మథనపడి ఏ హాలాహలాన్నయితే తెచ్చుకుందో అది అపరిహార్యం, తప్పని సరిగా భక్షించవలసిందే అని గ్రహించాడు. నీలకంఠుండిలాగా గోవిందలాల్ కూడా ఆ విషాన్ని భక్షించాడు. నీలకంఠుని కంఠంలో ఉండిపోయిన విషంలాగానే, ఆ విషం కూడా అతడి కంఠంలో గడ్డుకట్టింది. ఆ విషం జీర్ణమూ కాలేదు. ఉద్గీర్ణమూ కాలేదు.. కాని అప్పుడు పూర్వపరిజ్ఞాత స్వాదువిశుద్ధమూ, దివ్యపరిమళ శోభితమూ సర్వరోగాలకు ఔషధ తుల్యమూఅయిన భ్రమరిప్రణయసుధ పగలూరాత్రి అతడిస్మృతి పథంలోకి రాసాగింది గోవిందలాల్ ప్రసాద్‌పూర్‌లో రోహిణిగానవాహినిలో తేలియాడేప్పుడుకూడా భ్రమరే అతడిమనస్సుకు అధీశ్వరి. అంతర్యంలో భ్రమరీ - పైకిరోహిణి [illegible]పొందవీలులేని భ్రమరి - విడిచిపెట్టడానికి వీలులేనిది రోహిణి. అయినా భ్రమరిమనస్సులో - పైకి రోహిణియే అందుకనే రోహిణి అంత త్వరగా చనిపోయింది ఎవరైనా ఈ సంగతి గ్రహించలేకపోయారంటే ఈ ఆఖ్యాయికనేను వృథాగా రాశానన్నమాట.

గోవిందలాల్ అప్పుడొకవేళ రోహిణికేదో తగిన ఏర్పాటుచేసి, ప్రేమమయి అయిన భ్రమరిదగ్గరకువచ్చి, చేతులుజోడించి నిలబడి, "నన్నుక్షమించు—నీహృదయంలో మళ్ళీ నాకుచోటుఇయ్యి" అని అన్న

ట్లయితే నీవు ఎలాఅయితే నన్ను క్షమించగలవో నాలోఆసుగుణాలులేవు. కాని నీలో అనేక గుణాలు ఉన్నాయి కనక నీగుణసంపదలో నన్ను క్షమించు''అని అన్నట్లయితే;బహుశా భ్రమరిఅతణ్ణి క్షమించేసేదేమో. ఎందుకు క్షమించదు? స్త్రీ క్షమామయి, దయామయి, ప్రేమమయి- స్త్రీ ఈశ్వరుని కీర్తికి చరమోత్కర్ష; దేవతా ప్రతిమూర్తి. పురుషుడు దేవుని సృష్టి మాత్రమే. స్త్రీ వెలుగు, పురుషుడు ఛాయా. వెలుగు ఛాయను వదిలి పెట్ట కలదా?

గోవిందలాల్ అలా చెయ్యలేకపోయాడు. కొంత అహంకారం- పురుషుడు అహంకార పరిపూర్ణుడు. కొంత సిగ్గు - దుష్కృత్యం చేసే వాడికి సిగ్గేశిక్ష కొంత భయమూ—పాపం సహజంగా ధైర్యం ఎవరికీ రానీదు. భ్రమరి దగ్గర ఇంక ముఖం చూపటానికి వీలులేకపోయింది. గోవిందలాల్ ఇంకముందుకు రాలేకపోయాడు. అదీకాక గోవిందలాల్ హంతకుడు. అప్పటికి గోవిందలాల్ ఆశా విశ్వాసాలు అంతరించాయి' చీకటి వెలుగు ముందరికి రాలేకపోయింది.

కాని అయినా వారించటానికి శక్యంకాకుండా పునఃప్రజ్వలితమైన భ్రమరిని చూడాలనే లాలస, సంవత్సరాలనుంచీ ప్రతిక్షణమూ, గోవింద లాల్‌ను బాధించసాగింది. ఎవరిలా పొందగలిగారు? ఎవరిలా పోగొట్టు కున్నారు? భ్రమరి దుఃఖాన్ని పొందింది, గోవిందలాలూ దుఃఖాన్ని పొందాడు. కాని గోవిందలాల్‌తో పోల్చిచూస్తే భ్రమరి సుఖపడింది. గోవిందలాల్ దుఃఖం మనుష్యదేహానికి అసహ్యం భ్రమరికి సహాయముండన్నది- యము సాహాయ్యం గోవిందలాల్‌కు ఆ సాహాయ్యమూ లేదు.

మళ్లీ తెల్లవారింది - మళ్లీ సూర్యకాంతిలో జగత్తు కిలకిలలాడింది. గోవిందలాల్ ఇంట్లోంచి బైటికివెళ్ళాడు-రోహిణిని గోవిందలాల్ స్వహస్తాలతో వధించాడు - భ్రమరినికూడా ఇంచుమించు స్వహస్తాలతో వధించి నట్లే అదేఆలోచిస్తూ ఆలోచిస్తూ బైటికివెళ్ళాడు.

రాత్రిఅంతా గోవిందలాల్ ఎలాగడిపాడో తెలియదు చాలభయానకంగానే రాత్రిగడిచి ఉంటుందని పిస్తుంది తెలువుతెలవంగానే మాధవీనాథ్ కనిపించా డతడికి. మాధవీనాథ్ అతడ్ని చూసి, ముందులాగే అలాగే చూస్తూ ఉండిపోయినాడు. ముఖంలో మానవాతీతమైన రోగఛాయ కన్పిస్తోంది.

అతడిలో మాధవనాధ్ మాట్లాడలేదు—ఈ జన్మలో గోవింద లాల్‌తో ఇహ మాటాడకూడదు. అని ప్రతిజ్ఞచేసుకున్నా డతడు. మాట్లాడకుండా వెళ్ళిపోయాడు మాధవనాచ్.

గోవిందలాల్ ఇంట్లోంచి బయలుదేరి భ్రమరి గదిప్రక్కనఉన్న ఆ పుష్పోద్యానంలోకి వెళ్లాడు. యామిని యథార్థమే చెప్పింది — అక్కడ పుష్పోద్యానంలేదు. అంతా గడ్డితోనూ మ్రోళ్ళతోనూ అడివి అయిపోయింది-ఒకటి రెండు చావకమిగిలిన చెట్లుఆఅడవిలో సగంచచ్చి నట్లున్నాయి-కాని వాటిని పూలు పూయలేదు. గోవిందలాల్ చాలాసేపు ఆ మ్రోళ్ళ మధ్య తిరిగాడు. చాలా ప్రొద్దెక్కింది. ఎండ చుర్రుమంటోంది-గోవిందలాల్ తిరిగి తిరిగి అలసిపోయి చివరకు అక్కడనుంచి వెళ్ళి పోయాడు.

అక్కడ నుంచి గోవిందలాల్ ఎవ్వరితోనూ మాట్లాడకుండా ఎవ్వరి ముఖంకేసి చూడకుండా వారుణీ చెరువు ఒడ్డుకు వెళ్లాడు. జాము న్నర ప్రొద్దెక్కింది. తీవ్రమైన ఎండలో వారుణిలోని నల్లటి నీళ్లు మిల మిల లాడుతున్నాయి. ఆడవాళ్ళూ మగవాళ్ళూ అనేకమంది రేవులో స్నానం చేస్తున్నారు. కుర్రవాళ్ళు ఈతలు కొడుతున్నారు. గోవిందలాల్ కు అక్కడ అంతమంది చేరటం నచ్చలా. ఆ వారుణీతీరంలో నానావిధ పుష్పాలున్న నందన వనంతో సమానమయిన ఆ పుష్పోద్యానం ఉంది. గోవిందలాల్ అటువైపుకే వెళ్లాడు. మొదట్లోనే చూశాడు, కటకటాలన్నీ విరిగిపోయి ఉన్నాయి - ఆ ఇనప కటకటాల గేటుకు బదులుగా వెదురు కటకటాల తడిక ఉంది. భ్రమరి గోవిందలాల్ కోసం ఆస్తి అంతా ఎంతో శ్రద్ధగా కాపాడి ఉంచింది. కాని దీని విషయంలో మాత్రం శ్రద్ధ వహించలా. ఒక రోజు నయామిని ఆ తోట సంగతి చెప్పింది—"నేను యమ సదనానికి పోతున్నాను. మా ఆ నందనవనం కూడా ధ్వంసం కానీ. పృథివిలో నా కున్న స్వర్గాన్ని ఇంకెవరికిచ్చిపోను చెప్పు అక్కా!" అన్నది.

గోవిందలాల్ చూశాడు. దానికి గేటులేదు - కటకటాలు విరిగి పడిఉన్నాయి. లోపలికి వెళ్ళిచూస్తే పూలచెట్లేవీలేవు. రకరకాల గడ్డి చెట్లూ పెడమొలిచిన చెట్లూ ఉన్నాయి. లతా మండపం అంతా పడిపోయి ఉంది. రాతివిగ్రహం విరిగి మూడుముక్కలుగా గుండ్రగా పడిఉన్నాయి

దానిమీద తీగెలు అడ్డదిడ్డంగా పడిఉన్నాయి. ప్రమోద భవనంపై కప్పు కూలిపోయి ఉంది. ఆ భవనంలోని చలువరాళ్ళన్నీ ఊడదీసి ఎవరో ఎత్తుకుపోయారు. ఆ తోటలో ఇంక పూలు పూయలేదు పక్షులు కూయలేదు- మంచిగాలి కూడా వీయలేదనిపిస్తోంది.

విరిగిపోయిన శిలావిగ్రహం ముక్క దగ్గిర కూర్చున్నాడు గోవిందలాల్. మధ్యాహ్నసమయం దాటిపోతున్నా ఇంకా అక్కడే కూర్చుని ఉన్నాడతను. తీవ్రమయిన ఎండవేడిమికి అతడి తల వేడిఎక్కిపోయింది. కాని గోవిందలాల్‌కు అదేమీ తెలియటంలా. అతడి మనస్సు మనస్సులో లేదు రాత్రి నుంచీ రోహిణినీ, భ్రమరినీ గురించే ఆలోచిస్తున్నాడు ఒకసారి రోహిణిని మరోసారి భ్రమరిని. ఆలోచిస్తూ ఆలోచిస్తూంటే అతడి దృష్టికి భ్రమరి కన్పించసాగింది. ఎదురుగా రోహిణి కన్పించసాగింది జగత్తంతా రోహిణీ భ్రమరీ మయమైపోయింది. ఆ ఉద్యానవనంలో కూర్చుని, ప్రతి వృక్షాన్నీ భ్రమరి అని భ్రమపడసాగాడు. ప్రతి వృక్షచ్ఛాయ క్రిందా రోహిణి కూర్చున్నట్లు చూడసాగాడు. ఇదిగో భ్రమరి నుంచుంది - మళ్ళీలేదు. ఇదిగో రోహిణి వచ్చింది. మళ్ళీ ఎక్కడికి పోయింది? ప్రతి ధ్వనిలోనూ రోహిణిదో, భ్రమరిదో కంఠస్వరం వినిపిస్తోంది. రేవులో స్నానంచేసేవాళ్లు మాట్లాడుకుంటూంటే భ్రమరి మాట్లాడుతున్నదేమో అనిపించేది కాస్సేపు. రోహిణి మాట్లాడు తున్నదేమో అనిపించేదిమరి కాస్సేపు. ఒక్కొక్కప్పుడు ఇద్దరూ మాట్లాడుకుంటున్నారా అనిపించేది. ఎండుటాకు కదిలితే భ్రమరి వస్తుందేమో అనిపించేది. తోటలో పిట్ట ఏదైనా ఎగిరితే రోహిణి పరుగెత్తుకొంది అనిపించేది. గాలికి కొమ్మకదిలితే భ్రమరి నిట్టూరుస్తున్నటనిపించేది గోరువంక కూస్తే రోహిణి పాడుతున్నట్లనిపించేది ప్రపంచమంతా రోహిణీ భ్రమరీ మయమయింది.

ఎంతప్రొద్దు వాలిపోతున్నా గోవిందలాల్ అక్కడే ఆ విరిగిపోయిన బొమ్మదగ్గిరే - ఆ రోహిణీ భ్రమరీ మయజగత్తులోనే ఉన్నాడు. మూడున్నర, నాలుగ్గంటలయినా స్నానం చెయ్యకుండా, భోజనం లేకుండా, అక్కడే ఆ రోహిణీ భ్రమరీ మయ అగ్నిగుండంలో ఉన్నాడు. సాయంకాలమయింది, గోవిందలాల్ లేవలేదు అతనిలో చైతన్యంలేదు. ఆఫ్లో వాళ్ళు అతడు రోజంతా కన్పించకపోయేసరికి అతడు కలకత్తా వెళ్ళా

డేమో అనుకున్నారు, అంచేత ఆస్తేవెతకలేదతడికోసం. అక్కడే ప్రొద్దు కూకింది. చీకటిపడింది, ఆకాశంలో నక్షత్రాలువచ్చాయి, పృధివి నిశ్శబ్దం గాఉంది గోవిందలాల్ అక్కడే ఉన్నాడు.

హఠాత్తుగా ఆ అంధకారంలో నిశ్శబ్దంగాఉన్న తోటలో గోవింద లాల్ ఉన్మాదమనస్సు విషమ వికారాన్నిపొందింది. అతడు స్పష్టంగా రోహిణి కంఠస్వరం విన్నాడు. రోహిణి బిగ్గరగా—"ఇక్కడ" అని పిలుస్తున్నట్లున్నది.

గోవిందలాల్‌కు రోహిణి చచ్చిపోయిందని జ్ఞాపకంలేదప్పుడు అతడు "ఇక్కడ ఎందుకు" అని ప్రశ్నించాడు.

"ఇక్కడ ఈసమయంలో ఏమిటి రోహిణి!'' అన్నాడు గోవింద లాల్.

"మానసిక వ్యాధిగ్రస్తుడైన గోవిందలాల్ మళ్ళీ" ఇక్కడే ఈ సమయంలోనే ఈ నీళ్ళలో 'మునిగిపోయాను నేను' అని జవాబుచెప్పటం విన్నాడు.

గోవిందలాల్ తన మనస్సులో ఉద్భవించిన ఆ మాటలను విని "నేనూ మునగనా?'' అని ప్రశ్నించాడు.

"అరా భ్రమరి స్వర్గములో కూర్చుని పంపించింది, ఆమె పుణ్య బలంతో మనల్ని ఉద్ధరిస్తుంది. ప్రాయశ్చిత్తం చేసుకుని చచ్చిపో" అన్నట్లు వినిపించింది,మళ్లీఅతడికి!

గోవిందలాల్ కళ్లుమూసుకున్నాడు. అతడిశరీరం అవసన్నమై వణికింది. అతడుమూర్ఛితుడై ఆసోపాన శిలమీద పడిపోయాడు.

మూర్ఛావస్థలో రోహిణి స్వరూపం చటుక్కున అంధకారంలో లుప్తమయిపోయినట్లు మానసచక్షువులతోచూడకలిగాడు అప్పుడుక్రమశః దిక్కులన్నీ తేజస్సుతో నిండిపోయి, జ్యోతిర్మయిమై భ్రమరి స్వరూపం ఎదుట సాక్షాత్కరించింది.

"చావటం ఎందుకు? చావకండి. నన్ను పోగొట్టుకున్నావని చచ్చి పోతారా? నా కంటె కూడా ప్రియమైన వస్తువేదో ఉన్నది. బ్రతికి ఉంటే దాన్నైనా పొందకలుగుతారు'' అన్నది భ్రమరి స్వరూపం.

గోవిందలాల్ ఆ రాత్రి మూర్ఛితావస్థలో అక్కడే పడిఉన్నాడు.

ఉదయం అతణ్ణి వెతుక్కుంటూ వచ్చిన ఊళ్ళోవాళ్ళు అతణ్ణి లేవతీసి ఇంటికి తీసుకు వెళ్ళారు. అతడిదురవస్థ చూసేసరికి మాధవనాథ్‌కు కూడా దయకలిగింది. అందరూ కలిసి అతడికి చికిత్సచేయించారు. రెండు మూడు నెలలకు గోవిందలాల్ మామూలు మనిషి అయినాడు. అతడు ఇహ ఇంటిదగ్గరే ఉంటాడని అందరూ ఆశించారు. కాని గోవిందలాల్ అలా చెయ్యలేదు. ఒక నాడు రాత్రి అతడు ఏవరికీ చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడు. అతడి జాడ ఎవరికీ తెలియలేదు.

ఏడేళ్ళ గడిచాక అతడికి శ్రాద్ధవిధులు జరిగాయి.

---

## 47

గోవిందలాల్ ఆస్తి అంతా అతడి మేనల్లుడు శచీకాంత్‌కు సంక్రమించింది. శచీకాంత్ యుక్త వయస్కుడు.

శచీకాంత్ ప్రతిరోజూ ఆ పాడుపడిన తోటలోకి పూర్వం గోవిందలాల్ ప్రమోదోద్యానం ఉండి, ఇప్పుడు అడవిగా మారిన ప్రదేశంలోకి వెళ్ళి తిరిగి వస్తూవుంటాడు.

ఆ దుఃఖమయగాథ అంతా శచీకాంత్ విన్నాడు. రోజూ అక్కడికి వెళ్ళివస్తూ, అక్కడకూర్చుని ఈగాథఅంతా తలచుకునేవాడు, ఆలోచించి ఆలోచించి మళ్ళీ అక్కడ ఆ ఉద్యానాన్ని నిర్మింపచేయటానికి పూనుకున్నాడు. ఈసారి కొత్తరకం కటకటాలు పెట్టించాడు ఆ చెరువులోకి దిగేందుకు అందమైన నల్లరాళ్ళతో మెట్లుకట్టించాడు. మళ్లీ వరుసలు తీర్చినట్లు అందమైన చెట్ల మొక్కలనన్నీ నాటించాడు కాని రంగు రంగుల పూలమొక్కలు మాత్రం వేయించలా. దేశీయులైన వాటిల్లో వకుళ, కామినీ పూలవృక్షాలూ విదేశీయాల్లో 'సాయిప్రెస్' మొదలైనవి. ప్రమోద భవనానికి బదులు ఒక చిన్న మందిరం నిర్మించాడు. ఆ మందిరంలో దేవతా విగ్రహాలను స్థాపించలా. చాలా డబ్బు ఖర్చుపెట్టి భ్రమరి విగ్రహాన్ని బంగారంతో చేయించి, ఆ మందిరంలో స్థాపించాడు ఆ సువర్ణ విగ్రహం పాదప్రదేశంలో "సుఖదుఃఖాలలోనూ, గుణదోషాల లోను భ్రమరితో సమానమయిన వారెవరో—వారికి నే నీ సువర్ణ విగ్రహాన్ని బహూకరిస్తాను".



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B168 |
| పుస్తకం పేరు | కృష్ణకాంత్ |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Hasseena |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |